


ఆంధ్రగ్రంథ రత్నాకరము, ౫వ రత్నము:

# రాణాప్రతాపసింహ

## నాటకము

నాటక రచనా ధురంధరులగు

శ్రీ ద్విజేంద్రలాల్ రాయల

బంగాళాగ్రంథమునకు

అనువాదకర్తలు

శ్రీ జంధ్యాల శివన్నశాస్త్రిగారు



# ఆంధ్రగ్రంథ రత్నాకరము, గుడివాడ

## రా జ పో ష కు లు

౧ మ॥ రా॥ శ్రీ వల్లభనేని రామబ్రహ్మం చౌదరిగారు, గొలివేపల్లి
౨ ,, పర్వతనేని నారాయణరావుగారు, కౌతరం.

---

## ప్ర ధా న పో ష కు లు.

౧ మ॥ రా॥ శ్రీ లింగం వెంకటసుబ్బయ్యగారు, బొమ్ములూరు.
౨ ,, వల్లూరిపల్లి కోదండరామయ్యగారు, దాకరం.
౩ ,, అడపా సుబ్బారాయుడుగారు, గుడివాడ.
౪ ,, పురాణం సూరిశాస్త్రిగారు, బి. ఎ., బందరు
౫ ,, మల్లిరెడ్డి గురవారెడ్డిగారు, జొన్నపాడు
౬ ,, మాగంటి వెంకటరామదాసుగారు, తమిరిశ.
౭ ,, చిట్టూరి వెంకటనరసింహంగారు, బందరు
౮ ,, సూరపనేని సుబ్బయ్యచౌదరిగారు, దింటకుఱ్ఱు.
౯ ,, వెల్లంకి రామదాసచౌదరిగారు, అప్పికట్ల.
౧౦ ,, కొడాలి ఉమామహేశ్వరరావుగారు, జవర్లపూడి.
౧౧ ,, వల్లభనేని రామకృష్ణయ్య చౌదరిగారు, గొలివేపల్లి.
౧౨ ,, కరిపినేని వెంకటరామయ్యగారు, చినపారుపూడి.
౧౩ ,, కామినేని గోపాలకృష్ణయ్యగారు, గుడ్లవల్లేరు.
~~౧౪ ,, ఉప్పలపాటి నాగయ్యగారు, గురజ.~~
౧౫ ,, జొన్నలగడ్డ శ్రీరామచంద్రయ్యగారు, గుడివాడ.
౧౬ ,, రాళ్ళభండి వటుంబరావుగారు, బల్లిపఱ్ఱు.
౧౭ ,, ఆట్లూరి వెంకటాద్రిగారు, కోడూరు.
౧౮ ,, గూడపల్లి గోపాలకృష్ణయ్యగారు, నందమూరు.

## పో ష కు లు.

౧ మ॥ రా॥ శ్రీ॥ నండూరు వరాహలక్ష్మీనృసింహంగారు, అరుకొలను.
౨ ,, పింగళి వటుంబరావుగారు, లింగాల.
౩ ,, కూచిభట్ల వెంకటాచలపతిశాస్త్రిగారు, కొర్నిపాడు.
౪ ,, గో॥ భా॥ రామచంద్రరావు దొరగారు, ఊలవభద్ర.
గంజాంజిల్లా.
౫ ,, యలమంచిలి నాగయ్యగారు, నూజెళ్ల.
౬ ,, శిరిపురపు వెంకటరత్నంగారు, ఎలమఱ్ఱు.
౭ ,, కోనేరు నారాయణరావుగారు, బొర్లపూడి.
౮ ,, ఆట్లూరి వెంకటపతి గారు, చనటపల్లి.
౯ ,, పాటిబండ్ల సీతారామయ్యగారు, అరుకొలను.

౧౦ మ॥ రా॥ శ్రీ॥ సీతంరాజు హనుమంతరావుగారు, జుజ్జనపూడి

౧౧ ,, కే వెంకటాచలంగారు, పెనుమల్లి.

౧౨ ,, మెవ్వభూషయ్యగారు, ముదునూరు.

౧౩ ,, పర్వతనేని గంగయ్యగారు, పోలుకొండ.

౧౪ ,, శివలెంక మల్లికార్జునరావుగారు, పెసరమిల్లి.

౧౫ ,, చెలసాని వెంకటరత్నంగారు, చిరుచింతల

౧౬ ,, వల్లభనేని చౌదరయ్యగారు, గోళివేపల్లి

౧౭ ,, వల్లభనేని రామశాస్త్రిలుగారు, ,,

౧౮ ,, శింగవరపు రామయ్యగారు, కొమరవోలు

౧౯ ,, పొట్లూరి సీతయ్యగారు, ,,

౨౦ ,, పొట్లూరి వెంకటరత్నంగారు, ,,

౨౧ ,, హరి సుందరరావుగారు, కల్వపాముల.

౨౨ ,, మానికొండ కుటుంబరావుగారు, ఉంగుటూరు

౨౩ ,, కోవెలమూడి పరంధామయ్యగారు, కోలవెన్ను.

౨౪ ,, ఈడుపుగంటి సీతయ్యగారు, నందివాడ

౨౫ ,, కొత్తపల్లి రామకుటుంబయ్యగారు, గుడివాడ

౨౬ ,, బ్రహ్మభొట్ల పట్టాభిరామశర్మగారు, గుడివాడ

౨౭ ,, కాజ వెంకటరామయ్యగారు, పసుమర్రు.

౨౮ ,, నూకల వీరరాఘవయ్యగారు, కొనుమోలు.

౨౯ ,, పోతిన శ్రీనివాసరావుగారు, బెజవాడ

౩౦ ,, అడుసుమల్లి వెంకటకృష్ణయ్యగారు, చిరుచింతల.

౩౧ ,, ఉప్పలూరి ఆదినారాయణమూర్తిగారు, గుడివాడ

౩౨ ,, తిపిర్నేని సుబ్రహ్మణ్యంగారు, గుడివాడ.

౩౩ ,, పరిమి వెంకటపిచ్చయ్యగారు, ఎడాలి

౩౪ ,, కొల్లి చినవెంకటరామయ్యగారు, అప్పికట్ల.

౩౫ శ్రీమతి వల్లూరిపల్లి కనకదుర్గమ్మగారు, వేలూరు

౩౬ మ॥ రా॥ శ్రీ॥ పిడికిటి సూర్యనారాయణగారు, పునాదిపాడు

౩౭ ,, పాలపర్తి మాలేశంగారు, పాలపర్రు.

౩౮ ,, గూడూరి మల్లికార్జునుడుగారు, వంగూరు.

౩౯ ,, కోడూరు రంగయ్యగారు, కోడూరు.

౪౦ ,, అడుసుమిల్లి కృష్ణయ్యగారు, ,,

౪౧ ,, కొండపల్లి నారాయణస్వామిరెడ్డిగారు, జొన్నపాడు,

౪౨ ,, కొడాలి వీరభద్రయ్యగారు, చినపారుపూడి

౪౩ ,, కరెడ్ల రామయ్యగారు, గుడివాడ.

౪౪ ,, గూడపల్లి రామబ్రహ్మంగారు, బెజవాడ.

# భూమిక



మేవాడు రాజ్యవంశములో రాణాప్రతాపసింహుఁ డద్వితీయపరాక్రమశాలి యఖండదేశభక్తుఁడు దేశస్వాతంత్ర్యసంపాదనకై ఘోరదారిద్ర్యవ్రతము నవలంబించిన ధన్యుఁడు. చిత్తోరు రాజ్యము నుద్ధరించువఱకు నేలమీదనే పరుండెదననియు జీర్ణపత్రమునందే భోజనము చేసెదననియు దీక్షవహించి యీ మహాపురుషుఁడు తన సామంతు లందఱి చేతను నిట్టి ప్రతిజ్ఞ చేయించెను. ఈ వంశమువారు నేటికిని పఱపుక్రింద నొక గడ్డిపఱక నుంచుకొనియు కంచముక్రింద నొక యాకు నుంచుకొనియు పారంపర్యముగ నీప్రతిజ్ఞను ఒక విధముగఁ బాలించుచున్నారు. ఇట్టి లోకోత్తర చరితుఁడగు ప్రతాపసింహుని చరిత్ర సాధారణముగ భారతవర్షమందలి ముఖ్యభాష లన్నిటియందును వ్రాయఁబడినది. వంగభాషయందుఁగూడ శ్రీ రవీంద్రనాథఠాకూరుగారి సోదరుఁడు జ్యోతిరింద్రనాథఠాకూరుగారు ప్రతాపుని చరిత్రను గ్రహించియే అశ్రుమతియను నొకనాటకమును రచించిరి. ఈ గ్రంథముండగా ఈవిషయమున వేఱొకగ్రంథమురచించి ఖ్యాతిబడయుట సామాన్యవశ్యము గాదు. అదియొక ద్విజేంద్రునకే చెల్లినది. చెల్లుటయేకాదు ద్విజేంద్రుని యీ గ్రంథము ముందు అశ్రుమతి అశ్రుమతివలె తేజము వాసెననియుఁ జెప్పవచ్చును. ఇట్టి హృదయరంజకమగు నీనాటకము ద్విజేంద్రుని గద్యనాటకములలోనెల్ల మొదటిది. 'రాణాప్రతాపసింహ' తొలుదొల్త కలకత్తాలో సుప్రసిద్ధమగు మినర్వాథియేటరులో ప్రదర్శింపఁబడి ప్రేక్షకుల నానందమున నోలలాడించెను. ద్విజేంద్రుఁడు గయ ఉద్యోగిగా నున్న కాలములో కొందఱు బంగాలీయువకులచే నది ప్రదర్శింపఁబడి అప్పుడు ద్విజేంద్రుఁడుగూడ స్వయముగ శక్తసింహపాత్ర నభినయించెను.

ద్విజేంద్రుఁడు ఇతిహాసమును విశేషముగ నుల్లంఘింపకయే యీ గ్రంథము నింత యుత్తమముగ రచించెను. ఇది సామాన్యలేఖకుల పనిగాదు. ఇతిహాసము మౌనమువహించిన స్థలములందు మాత్రము నూతనపాత్రముల సృజించియు ప్రసిద్ధపాత్రముల ప్రకృతిననుసరించి కార్యక్రమమునుగూర్చియు తన యమోఘకల్పనాశక్తిని సార్థకపఱచెను. టాడ్ దొరగారి రాజస్థానకథావళి నాధారముచేసికొని ద్విజేంద్రుఁడు ఇందు ప్రతాపునియందు మానవోచితమగు క్షణికదౌర్బల్యమును జూపి ఆయన అక్బరుని యధికారమును స్వీకరింపుచు నొకజాబు వ్రాసినట్టును మరల పృథ్వీరాజాదుల ప్రేరణముచే నక్బరుపై తిరుగుపాటు చేసినట్లుగను వ్రాసెను. కాని ప్రతాపుఁ డక్బరున కెన్నఁడును లొంగలేదని ఆధునికచరిత్ర లేఖకులు సప్రమాణముగ నిరూపించిరి. మఱియు 'అక్బరునామా' వ్రాసిన అబుల్ ఫజల్ స్వల్పవిషయములనుగూడ కొండంత చేసి వ్రాసియుండగా ఇది నిజమగుచో తనగ్రంథమున దీనిని వ్రాయకయుండునా!

ప్రతాపుని యాత్మశక్తి దౌర్బల్యముగూడ సత్యేతరమని యెఱిఁగియుండునో ద్విజేంద్రుఁడు తన లేఖినిని ఇంక నెంతచక్కని త్రోవను నడిపించెడివాఁడో గదా!

ప్రకృతగ్రంథము అస్మన్మిత్రులును సుగుణభూషితులు నగు శ్రీ పర్వతనేని నారాయణరావుగారి ప్రేరణాఫలితము. వారు నావద్ద దీనిహిందీ అనువాదమ్మును జదువుచు నొకనాడు దీనిని తెలిఁగింపుఁడని కోరిరి. నే నందు కియ్యకొని దీనిమాతృకను వంగభాషలోఁ జదివితిని. నావద్ద పంచమసంస్కరణప్రతియే యుండెను. అందు కొన్నిరంగములే పూర్తిగ తగ్గించఁబడినవి. అదియునుగాక మాతృకకంటె హిందీ అనువాదమే చాల బాగుగనున్నది. అందుచే నే నీగ్రంథము ననువదించుటలో విశేషించి హిందీ అనువాదమునే అనుసరించితిని. గాన తదనువాదకర్తకు విశేషకృతజ్ఞుఁడను. పాఠకులయు నటకులయు రుచిననుసరించి ఇందు కొన్ని పద్యములుగూడ చేర్చితిని. ఈ గ్రంథమును జదివినవారికి దీని ప్రచార మెంతయావశ్యకమో వేఱుగఁ జెప్పనక్కఱలేదు. పాఠకులు చదువుటకు ముందు శుద్ధపత్రిక ననుసరించి అచ్చుపొరపాట్లు దిద్దుకొనుట మంచిది. మఱియు నిందు శుద్ధపత్రికలో సవరింపరాని Comma, Full-stop, Hyphen మున్నగువాని దోషములును గొన్నిగలవు. వానినిసవరించుకొనుట నటకులకు పరమావశ్యకము. ఈ గ్రంథరచనకు నన్ను ప్రేరేపించుటయేగాక దీనిముద్రణముఁగూడ విశేషసహాయ మొనర్చిన శ్రీ పర్వతనేని నారాయణరావుగారికి పరమేశ్వరుఁడు సుపుత్త్రారోగ్యైశ్వర్యములనొసఁగి రక్షించుగాత.

జంధ్యాల శివన్నశాస్త్రి-



# పాత్రసూచిక

## —✻ పురుషులు ✻—

ప్రతాపసింహుఁడు— మేవాడురాణా

అమరసింహుఁడు—ప్రతాపుని పుత్రుఁడు.

శక్తసింహుఁడు—ప్రతాపుని తమ్ముఁడు.

అక్బరు— మొగలచక్రవర్తి.

సలీము—అక్బరు కొడుకు.

మానసింహుఁడు — మొగల సేనాపతి.

మహాబత్ఖాన్ — మొగల సేనాధ్యక్షుఁడు.

పృథ్వీరాజు— మొగల దర్బారుకవి.

ప్రతాపుని సామంతులు, మంత్రి భిల్లనాయకుడు. అక్బరు సభాసదులు, ~~ద్వారపాలకుడు~~, మొన్నగువారు.

## — స్త్రీలు. —

[illegible]—ప్రతాపుని పట్టమహిషి

ఈర—ప్రతాపుని కూఁతురు.

జోషీబాయి—పృథ్వీరాజు భార్య.

మేహరున్నిసా—అక్బరు కూఁతురు.

దౌలతున్నిసా—అక్బరు మేనకోడలు.

రేవ—మానసింహుని చెల్లెలు



# రాణా ప్రతాప సింహ

## ప్రథమాంకము

### ప్రథమదృశ్యము

స్థానము—కోమలమీరు అడవిలో కాళీదేవాలయము,

సమయము—ప్రభాతము.

[కాళిప్రక్కగా కుల పురోహితుఁడు నిలఁబడి యుండును. కాళికి ... రాణా ప్రతాప సింహుఁడును రాజపుత్ర సామంతులును కుడి ...కాలు నేల మోపి అర్ధోప విష్టులై భూమిపై నుంచిన ఖడ్గములు ...చి యుందురు.]

పు·—అగుచో మీరు కాళీమాతసమక్షమున శపథము చేయుఁడు.

అందఱు:—శపథము చేయుచున్నాము.

ప్రతాప.—అవసరమగుచో మేము చిత్తూరుకై ప్రాణము లిచ్చెదము

అందరు:—అవసరమగుచో మేము చిత్తూరుకై ప్రాణము లిచ్చెదము.

ప్రతాప—ఎంతవఱకు చిత్తూరు స్వాధీనము కాదో—

అందరు—ఎంతవఱకు చిత్తూరు స్వాధీనము కాదో—

ప్రతాప:—అంతవఱకు భూర్జపత్రములందు భోజనము చేసెదము—

అందఱు—అంతవఱకు భూర్జపత్రములందు భోజనము చేసెదము—

ప్రతాప·—అంతవఱకు తృణశయ్యపైఁ బరుండెదము—

అందఱు—అంతవఱకు తృణశయ్యపైఁ బరుండెదము—

ప్రతాప:—అంతవరకు వేషభూషలఁ బరిత్యజించెదము—
అందఱు:—అంతవరకు వేషభూషలఁ బరిత్యజించెదము—
ప్రతాప—మఱియు శపథము సేయుఁడు. మేముగాని మావంశములోఁ
బుట్టువారుగాని యెన్నఁడును మొగలులతో నెట్టి సంబంధమును
జేయము.
అందఱు— (అదియేమాట అందురు.)
ప్రతాప—ప్రాణముండగా మొగలులకు దాస్యము చేయము.
అందఱు—(అదియేమాట అందురు.)
ప్రతాప—మాకును వారికిని మధ్య నెప్పుడు ఖడ్గమే యుండును.
అందఱు—(అదియే అందురు.)
పురోహి—స్వస్తి స్వస్తి స్వస్తి (మంత్రోదకము చల్లును.)
ప్రతాప—రాజపుత్రవీరులారా! నేఁడు కాళీమాత సన్నిధిని ఖడ్గము
స్పృశించి మీరీప్రతిజ్ఞ జేసితిరి. దీని కెన్నఁడును భంగము
గలుగఁగూడదు. మఱల వినుఁడు.

సీ॥ వీర సిసోదియాస్మారక చిహ్నంబు
చిత్తూరుకోట నార్జించువఱకు
రాజపుత్రుల మహారవి తేజమున కోడి
యక్బరు ఘూకము ట్లణఁగువఱకు
తాతము త్తవులకుఁ దావోసంగిన మాతృ
దేశబుణమ్మును దీర్చువఱకు
శూర బాహుజమహాశోణితోర్వరమైన
మేవాడు నిర్భీతి మెలఁగువఱకు
గీ॥ వేషభూషలు సుఖభోగవితతి నెల్ల
చినుఁగుగుడ్డను బలె విసర్జింపవలయు
సర్వసన్న్యాసదీక్షను జరుపవలయు
స్వేచ్ఛఁ బ్రాణమ్ము లర్పణ సేయవలయు॥

అందఱు—రాణాజీ! అట్లే గావింతుము, ప్రాణము లుండఁగా మా
ప్రతిజ్ఞకు భంగము రానీయము.

ప్రతాప— నేఁ డీకరిన ప్రతిజ్ఞ ఎందుకు చేయించితినో మీ రెఱుఁగుదురా? దేశసేవ యొనర్చుట సామాన్యమైన పని గాదు. ఇది చాల కఠోరవ్రతము. ఉపన్యాసము లిచ్చుటవలనను గీతములు పాడుట వలనను దేశసేవ సాధింపఁబడదు. కఠోరదుఃఖము లనుభవించ వలయును. హృదయరక్తమును బాఱింపవలయును. ప్రాణము లొడ్డి పని చేయవలయును. మంచిది మీ రింక కోమలమీారు నకుఁ బొండు.

(సామంతులు నిష్క్రమింతురు ప్రతాపుఁడు ఉద్రేకముతో దేవ శము ముందు తిరుగుచుండును. పురోహితుఁ డించుక సేపు నిశ్చలుఁడై నిలఁబడి పదపడి నిట్లు పిలుచును.)

పురో— ప్రతాప్! (ప్రతాపుఁ డెదురుగా తిరుగును) నేఁడు నీవు చేసిన ప్రతిజ్ఞను పాలింపఁగలవా?

ప్రతాప— గురుర్యా! నా చేఁగానిచో నే నిట్టిప్రతిజ్ఞను బట్టియేయుండను. అదియునుగాక.

మాతృసేవాత్వరమాణమానసులకు
ధనమును నీరసేంధనము నొండె
జన్మభూమీ మోక్షసాధనాచణునకు
పురమును నడవికాఁపురము నొండె
దేశసంఘోద్ధారపరునకు పక్వాన్న
జాలమ్ము వనకందమూల మొండె
దేశాపమాన నిష్కాసనాతురునకు
భోగమ్ము కాలాహిభోగ మొండె
గీ॥ మాతృదేశ సముద్ధార మహితభాగ్య
మెల్లరలలాటమున లిఖియింపఁబడదు
కాని నిజజన్మభూమికై ప్రాణ మొసఁగు
పరమసౌభాగ్య మెల్లరవశము గాదె॥

పురో— ప్రతాప్! నిన్ను ఆశీర్వదింపుచున్నాను. నీ వీప్రతిజ్ఞాపాలనమందు సఫలుఁడ వగుదువుగాక! (ప్రస్థానము)

(ప్రతాపుఁడు ఉద్రేకముతో నిటునటు తిరుగుచుండును.)

ప్రతాప—అక్బర్!

ఉ॥ ధీరత శత్రువీరుల సుతీక్ష్ణశరాహతి కోర్చి ముంగటన్
బోరఁగలేక పందవయి పొంచి యధర్మరణమ్మునందు ము
న్నా రవితుల్యతేజుని మహాసుగుణున్ జయమల్లుఁ జంపి చి
త్తూరును మాదుపెన్నిధిని దోఁచితి వెట్టులొ రాజతస్కరా.

మేము క్షత్రియులము చేత నగుచో న్యాయయుద్ధ మొనరించి చిత్తూరుకోట తిరిగి సాధించెదము. అన్యాయ యుద్ధమును చేయము. నీవు మొగలుఁడవు. దూర దేశమునుండి వచ్చితివి. భారత దేశమునుండి ఇంచుక నేర్చుకొనిపొమ్ము. ధర్మయుద్ధమన నేమియో, ఏకాగ్రత, సహిష్ణుత, యథార్థ వీరత్వము అన నేమియో నేర్చుకొని పొమ్ము. దేశమునకై ప్రాణము లెటు లర్పింపవలయునో నేర్చుకొనిపొమ్ము. నేఁడు నీవు భారతచక్రవర్తి వి సింహాసనాసీనుఁడవయి నీచులు, పిరికిపందలు, స్వధర్మద్రోహులు నగు పెక్కు రాజపుత్రులఁ జూచియుందువు. నీదర్బారులోఁజేరి నీకు స్తోత్రపాఠములు వినిపించుచు గౌరవపదవులఁ బడిసి వారును యుద్ధక్షేత్రములనుండి కాలికిబుద్ధిచెప్పువారును తమకూతుళ్ళ భార్యలను, చెల్లెండ్రను నీపాదములకడ సమర్పించి నిన్ను సంతోషపె వారునునగు రాజపుత్రులను జూచియుందువు కాని యిప్పటికిని మా దేశారాధనకై తమప్రాణముల బలినిడువారును, స్త్రీజాతి గౌరవ గాపాడువారును, నీవు దయతో నొసంగిన బహుమానముల దృణీకరించువారును నగు రాజపుత్రులుగలరని నీకు చూపింపఁగోరుచున్నాను. నీవు మాతండ్రియగు ఉదయసింహుఁడు చిత్తూరునుండి పాఱిపోవుట చూచితివి. ఇప్పుడు ఆయనకొడుకు ప్రతాపసింహుఁడు చిత్తూరుదుర్గమున బ్రవేశించుటకై చేయు ప్రతిజ్ఞచూడుము (కాళికెదురుగ మోకరిలఁబడి చేతులుజోడించి) అమ్మా! నాశపథము సఫలమగునట్లును, ధర్మము జయించునటులను, మహాత్త్వమందలి మహత్త్వము నష్టముగాకుండునటులను అనుగ్రహింపుము. అమ్మా! జన్మభూమీ! నాపై విశ్వాసముంచుము.

సీ॥ లేఁబ్రాయమున నింద్రు లెక్క సేయనిమేటి
మగఁటిమిగల రఘుక్ష్మావరుండు
కోతులమూకఁ గైకొని నిమిత్తమ్ముగ
రావణుఁ దునుమాడు రాఘవుండు
అలఘురాసానుపర్యంతమ్ము రిపుల వె
న్నాడు బాప్పారావలాధిపుండు
కాబులీయుల భుజాగర్వ సర్వస్వమ్ము
రూపుమాపిన ఖుమానుక్ష్మాపవరుఁడు
గీ॥ మొదలుగాఁగఁ భూవరుల్ పుట్టినట్టి
వంగడమ్మున జనియించి వారిప్రతిభ
గంగఁ గలియంగ మ్లేచ్ఛునొక్కనికి జన్మ
భూమి నొసఁగుజె ప్రాణముల్ పోకమున్న॥
ఎవరు? (వెనుకకు తిరిగిచూడ శక్తసింహుఁడు నిలఁబడియుం
డును) ఎవ్వరు? శక్తా?
శక్త—అవును అన్నా! నేనే.
తాప—నీవింతదనుక నెచట నుంటివి?
క్త—ఎంతదనుక?
తాప—కాళీపూజ జరుగుచున్నంతదనుక.
—ఇంతదనుక నేనా?
ప్రతాప—అవును.
శక్త—గణితము వేయుచుంటిని.
ప్రతాప—గణితము వేయుచుంటివా?
శక్త—అవును. అన్నా! అంధకారమయమగు భవిష్యత్తులో గంతులు
వేయుచుంటిని. జీవితసమస్యలఁ బరిష్కరింపుచుంటిని.
ప్రతాప—నీవు కాళీపూజ సేయలేదా?
శక్త—పూజయా! లేదు అన్నా! పూజపై నాకు నమ్మకము లేదు.
పూజవలన లభించునదియుఁ గనుపడుట లేదు. కాళీమాత నోరు
తెఱచుకొని మట్టిబొమ్మవలె కదలక మెదలక నిలచి యున్నది.

ఇందు ప్రాణము లేదు. ఏమియు శక్తి లేదు. అన్నా! దీనిని పూజించుటకంటె గణితము వేసికొనుట మంచిది. కనుకనే నేను గణితము వేయుచుంటిని. ఒకసమస్యను బరిష్కరింపుచుంటిని.

ప్రతాప—ఆసమస్య యేమి?

శక్త—జన్మాంతరవాదము సత్యమగునా కాదా యని. జన్మాంతరముపై నాకు నమ్మకము లేదు. అది నిజమైనం గావచ్చును. మానవుం డీప్రపంచమునకు ధూమకేతు వాకసమునకుం బలె వచ్చుచు పోవుచుండును. ధూమకేతు వాకసమున మరలం గనుపట్టదు. అది మఱియొక యాకాశమునం గనపడినం గనపడ వచ్చును. మఱియు పెక్కు శక్తు లేకీభవించుటచే మానవుని జన్మమును ఆశక్తులు విడిపోవుటచే మానవుని మృత్యువునుగూడ కావచ్చును, ఈ "నేను" విచ్ఛిన్నమగుడు ఈపెద్ద నేను నుండి పదిపండ్రెండు చిన్న "నేను" లు పుట్టుచుంరవచ్చును.

ప్రతాప—శక్తా! జీవిత మంతయు నిట్టి ప్రశ్నలయందును వాని చర్చలందునే గడపెదవా? ఈప్రశ్నలకును ఈచర్చలకును అంతము లేదు. ఈవ్యర్థచర్చలు మానివేయుము, రమ్ము. మనము గలసి పనిచేయుదము. సహజముగ మన బుద్ధికి గోచరిందునదియు స్వాభావికప్రవృత్తి గలదియునగు పనినే చేయుదము

శక్త—పనియా! ఏమిపని?

ప్రతాప—శక్తా! ఇంచుక దీనయగు నీజన్మభూమివంకకుం జూడుము. అన్యులు దీని నెట్లు పదదళితము చేయుచున్నారో దీని యలంకారముల నూడందీసి దీని నెటుల కష్టములపాలు సేయుచున్నారో చూడుము. రమ్ము. మనముభయులము కలసి దీనియుద్ధారణము నకై జీవితమర్పింతము. ఇంతకంటె మంచివిషయ మేమున్నది?

(ప్రతాపుని మంత్రియగు భీమాషా ప్రవేశించును,)

భీమా—రాణాజీ!

ప్రతాప—మంత్రివరా! ఏమి సమాచారము.

భీమా—గుఱ్ఱము సిద్ధముగ నున్నది.

ప్రతా—రమ్మ శక్తా! రాజధానికి పోదము. చాల పనులు చేయవలసి యున్నవి. రమ్మ కోమలమీరునకుఁ బోదము,

శక్తి—మీరు నడువుఁడు నేను వచ్చుచున్నాను.

(ప్రతాపభీమాపాలు నిష్క్రమించెదరు)

శక్త—(కొంచెము సేపు ఇటూనటు తిరిగి) జన్మభూమియా? అది నాకేమి యగును. నేను దానికేమియగుదును? నేనిచ్చట పుట్టిన మాత్రమున నేమాయెను? ఇంతమాత్రమున నే నేను దానికి చేయు పనియేమియు నుండదు నేనిక్కడ పుట్టనిచో సముద్రములోఁ బుట్టువాఁడను. లేక ఆకాశమునఁ బుట్టువాఁడను. అది యునుగాక జన్మభూమినన్నింత దనుక బహిష్కరించినది. పట్టెఁడన్న మేని నాకు పెట్టజాలకపోయెను. దానికై నేను నాజీవిత మేల యర్పింపవలయును? ప్రతాప్! నీవు మేవాడుకు రాణావు నీవు దానికై ప్రాణము లర్పింపఁదగుదువు. నేను ఎందుకర్పింప వలయును? నా కది యేమి యగును? — ఏమియు కాదు. (మెల్లగా నిష్క్రమించును.)

## —* ద్వితీయ దృశ్యము *—

స్థానము—కోమలమీరులో రాజప్రాసాదసమీపమున సరోవరము.

సమయము—సాయంకాలము

(ప్రతాపుని పుత్రికయగు ఈర ఒంటరిగా అస్తమించు సూర్యుని చూచుచుండును)

ఈర—(చప్పట్లువేయును) ఈదృశ్య మెంత గరిమామయముగ నున్నది సూర్యుఁ డస్తమించుచున్నాఁడు. ఆకాశమంతటను సూర్యుఁడు దక్క మఱియెవ్వరును లేరు. నాలుగు జాములకాలము ఆకాశ మరుక్షేత్రమునఁ దిరిగి ఇప్పుడు విశ్వమునంతను రక్తవర్ణమున నద్ది అస్తమించుచున్నాఁడు.—ఏగరిమతో నుదయించెనో ఆగరిమతోడనే యస్తమించు చున్నాడు.అదుగో అస్తమానమయినది.

ఇందు ప్రాణము లేదు. ఏమియు శక్తి లేదు. అన్నా! దీనిని పూజించుటకంటె గణితము వేసికొనుట మంచిది. కనుకనే నేను గణితము వేయుచుంటిని. ఒకసమస్యను బరిష్కరింపుచుంటిని.

ప్రతాప—ఆసమస్య యేమి?

శక్త—జన్మాంతరవాదము సత్యమగునా కాదా యని. జన్మాంతరముపై నాకు నమ్మకము లేదు. అది నిజమైనను గావచ్చును. మానవుం డీప్రపంచమునకు ధూమకేతు వాకసమునకుం బలె వచ్చుచు పోవుచుండును. ధూమకేతు వాకసమున మరలం గనుపట్టదు. అది మఱియొక యాకాశమునం గనపడినం గనపడ వచ్చును. మఱియు పెక్కు శక్తు లేకీభవించుటచే మానవుని జన్మమును ఆశక్తులు విడిపోవుటచే మానవుని మృత్యువునుగూడ కావచ్చును, ఈ "నేను" విచ్ఛిన్నమగుడు ఈపెద్ద నేను నుండి పదిపండ్రెండు చిన్న "నేను" లు పుట్టుచుంగవచ్చును.

ప్రతాప—శక్తా! జీవిత మంతయు నిట్టి ప్రశ్నలయందును వాని చర్చలందునే గడపెదవా? ఈప్రశ్నలకును ఈచర్చలకును అంతము లేదు. ఈవ్యర్థచర్చలు మానివేయుము, రమ్ము. మనము గలసి పనిచేయుదము. సహజముగ మన బుద్ధికి గోచరిందునదియు స్వాభావికప్రవృత్తి గలదియునగు పనినే చేయుదము.

శక్త—పనియా! ఏమిపని?

ప్రతాప—శక్తా! ఇంచుక దీనయగు నీజన్మభూమివంకకుం జూడుము. అన్యులు దీని నెట్లు పదదళితము చేయుచున్నారో దీని యలంకారముల నూడందీసి దీని నెటుల కష్టములపాలు సేయుచున్నారో చూడుము. రమ్ము. మనముభయులము కలసి దీనియుద్ధారణమునకై జీవితమర్పింతము. ఇంతకంటె మంచివిషయ మేమున్నది?

(ప్రతాపుని మంత్రియగు భీమాసా ప్రవేశించును,)

భీమా—రాణాజీ!

ప్రతాప—మంత్రివరా! ఏమి సమాచారము?

భీమా—గుఱ్ఱము సిద్ధముగ నున్నది.

ప్రతా—రమ్ము శక్తా! రాజధానికి పోదము. చాల పనులు చేయవలసి యున్నవి. రమ్ము కోమలమీరునకుఁ బోదము,

శక్తి—మీరు నడువుఁడు నేను వచ్చుచున్నాను.

(ప్రతాపభీమాషాలు నిష్క్రమించెదరు)

శక్త—(కొంచెము సేపు ఇటునటు తిరిగి) జన్మభూమియా? అది నాకేమి యగును. నేను దానికేమియగుదును? నేనిచ్చట పుట్టిన మాత్రమున నేమాయెను? ఇంతమాత్రమున నే నేను దానికి చేయు పనియేమియు నుండదు నేనిక్కడ పుట్టనిచో సముద్రములోఁ బుట్టువాఁడను. లేక ఆకాశమునఁ బుట్టువాఁడను. అది యునుగాక జన్మభూమినన్నింత దనుక బహిష్కరించినది. పట్టెఁడన్న మేని నాకు పెట్టజాలకపోయెను. దానికై నేను నాజీవిత మేల యర్పింపవలయును? ప్రతాప్! నీవు మేవాడుకు రాణావు నీవు దానికై ప్రాణము లర్పింపఁదగుదువు. నేను ఎందుకర్పింపవలయును? నా కది యేమి యగును? — ఏమియు కాదు. (మెల్లగా నిష్క్రమించును.)

## —* ద్వితీయ దృశ్యము *—

స్థానము—కోమలమీరులో రాజప్రాసాదసమీపమునసరోవరము.

సమయము—సాయంకాలము

(ప్రతాపుని పుత్రికయగు ఈర ఒంటరిగా అస్తమించు సూర్యుని చూచుచుండును)

ఈర—(చప్పట్లువేయును) ఈదృశ్య మెంత గరిమామయముగ నున్నది సూర్యుఁ డస్తమించుచున్నాఁడు, ఆకాశమంతటను సూర్యుఁడు దక్క మఱియెవ్వరును లేరు, నాలుగు జాములకాలము ఆకాశమరుక్షేత్రమునఁ దిరిగి ఇప్పుడు విశ్వమునంతను రక్తవర్ణముననద్ది అస్తమించుచున్నాఁడు.—ఏగరిమతో నుదయించెనో ఆగరిమతోడనే యస్తమించు చున్నాడు.అదుగో అస్తమానమయినది.

పీతవర్ణమగు నాకాశమిప్పుడు ధూసర మగుచున్నది. దేవతల కారతి యెత్తుటకోయన సంధ్య అస్తంగతుఁడగు సూర్యుని శూన్యదృష్టితోఁ జూచి చూచి ఇప్పుడు విశ్రాంతమందిరమునఁ బ్రవేశించుచున్నది. ప్రియసఖి! సుందరసంధ్యా! ఇప్పుడు నీ కేమి విచారము? నీహృదయమున ఇంతనైరాశ్య మేల నిండియున్నది? నీ వింత ఖిన్నవు, ఇంత నీరవవు, ఇంత కాతరవు నేల యగు చుంటివి? చెప్పుము. చెప్పుము ప్రియసఖి!

(ఈరకు వెనుకగ ఈరతల్లియగు లక్ష్మీబాయి ప్రవేశించును.)

లక్ష్మి—ఈరా!

ఈర—ఉలికిపడి ఏమి అమ్మా?

లక్ష్మి—నీ వింతదనుక నిచ్చట నేమిచేయుచుంటివి?

ఈర—అమ్మా! నేను సూర్యాస్తమయమును జూచుచుంటిని, ఎంత సుందర దృశ్యమో చూడుము. ఇప్పుడాకాశ మెంత యుజ్వలముగ నున్నది. పృథ్విఎంత శాంతముగానున్నది! నాకు సూర్యాస్తమయదృశ్యము చాలబాగుగనుండును.

లక్ష్మి—ఇదినీవు నిత్యము చూచుదృశ్యమేకదా!

ఈర—అయినను ఇది నిత్యము బాగుగనేయుండును. ఇది ఎప్పటికిని ప్రాతగిలదు. సూర్యోదయముగూడ చాల అందముగనే యుండును కాని సూర్యాస్తమయమున అందులోలేని యొకవైచిత్ర్యము గలదు. ఇందులో గంభీరమగు నొక రహస్యమును, నిగూఢమగు నొకవేదనయు, అపారము నగాధము నగు నొక విషాదమును, మధురమగు ప్రశాంతియుఁ గలవు. అమ్మా! ఇది చాల సుందరము చాల సుందరము.

లక్ష్మి— ఇక్కడ నీకు చలివేయును

ఈర—లేదు అమ్మా! నాకు అభ్యాస మయినది. అమ్మా! నీవీనక్షత్రముఁ జూచుచుంటివా?

లక్ష్మి—ఏనక్షత్రము?

ఈర—ఇదుగో పశ్చిమాకాశమున — అస్తమించుసూర్యునకు ముందుగా

లక్ష్మి—ఆఁ చూచుచున్నాను. కలుగుచుండును.

ఈర—దానిపే రేమో యెఱుఁగుదువా? సుంగ

లక్ష్మి—లేదు.

ఈర—దానిని శుక్రుఁడందురు. ఇది ఆరుమాసములు ఉదయించు సూర్యునకు ముందుగను, ఆఱుమాసములు అస్తమించుసూర్యునకు వెనుకగను నడుచుచుండును. ఒకప్పు డిది ప్రేమరాజ్యసన్యాసియు, ఒకప్పుడు సత్యరాజ్యపురోహితుడు నగుచుండును అమ్మా! ఈచుక్క యెంతస్థిరముగను, ఎంతఉజ్జ్వలముగను, ఎంత సుందరముగను ఉన్నదో చూడుము.

(ఈర రెప్పయార్పక చుక్కవంక చూచుచుండును లక్ష్మి ఇంచుక సేపు ఈరవంక చూచి తర్వాత ఆమెవద్దకు వెళ్లి చేయిపట్టుకొనును.)

లక్ష్మి—మంచిది. ఈరా! ఇంక కద. ఇంటికి పోదము. ప్రొద్దుగ్రుంకినది.

ఈర—అమ్మా! కొంచె మాగుము అదుగో ఎవ్వరో పాడుచున్నారు.

లక్ష్మి—ఆఁ! ఈనిర్జనప్రాంతమున ఆపడున దెవ్వరు?

(కొంచెము దూరమున ఒకవిరాగి పాడుచుపోవును.)

గీతము

సుఖముసుఖంబని భ్రమయ నేల యిటు సుఖ మారయఁగ ఫలంబే
సఖుఁడ దుఃఖమే నాకు నిక్కముగ సౌఖ్యంబును దుఃఖంబే॥
ప్రాణమిత్రమగు దుఃఖం బేయెడఁ బ్రబలప్రీతి నను డాయుఁగ
జానుగ సుఖ మాక్షణమునఁ బరిహాసము సేయుచు నను బాయుఁగ
అరుదుగ నెన్నఁడొ దయచేసి సుఖం బంఘ్రిరజము పైఁ జల్లుఁగ
బరువడి మొగమునశవ్వుట కనులబాష్పము దాఁగుటయు ఘటిల్లుఁగ
అశ్రుబిందువులఁ గాంచినయంతట నరుగు విరక్తసుఖంబు
ప్రశ్రయముగ నాయశ్రులఁ దుడువఁగఁ బఱతెంచును దుఃఖంబు॥

(ఇద్దఱు నిలఁబడి గీతము విందురు. ఈర కన్నీరు గార్చును.)

ఈర—అమ్మా! ఇతఁడు చెప్పినది నిజము. పెక్కుసమయములందు సుఖముకన్న దుఃఖమే నాకు చాల మధురముగఁ గనుపట్టును.

లక్ష్మి—దుఃఖము మధురముగ నుండునా?

పీతవర్ణ—అమ్మా! దుఃఖము మధురముగ నుండును. త్రోవలో నెందఱో ఆడుచుపాడుచు నుల్లాసముతో పోవుచుందురు. ఎవ్వఁడేని వారివంక కన్నెత్తి చూచునా? కాని వారిలో నొక్కఁడు దుఃఖితుఁడై ఏడ్చుచుండ వానికష్టకారణము దెలిసికొనుటకును సహానుభూతితో వానికన్నీరు తుడుచుటకును బుద్ధి పుట్టదా? యుద్ధములో విజయమందినవానికథ వినుటకు బాగుగ నుండునా లేక ఓడినవానికథయా? మనకెవ్వరిపై సహానుభూతి గలుగును? ఆనందగీతము చక్కఁగ నుండునా దుఃఖగీతమా? ఉష సుందరముగ నుండునా సంధ్యయా? సౌభాగ్యగర్వితయు సంగీతమధురయు నగు ఢిల్లీనగరిని జూడ మనసు గలుగునా లేక విగతవైభవయు మలిననీరవయు నగు మథురాపురినా? అమ్మా! నిజముగ సుఖములో నొకవిధమగు అహంకార ముండును దానిస్వరము ఉచ్చమును కర్కశమునగును కాని విషాదము చాల నమ్రముగను నీరవముగను ఉండును.

లక్ష్మి—అవును. ఈమాట నిజమే

ఈర—దుఃఖము చాల గొప్పదియు సుఖము చాల నీచము అని నా యభిప్రాయము. దుఃఖములో సేకరించినదియే సుఖములో వెచ్చింపఁబడును దుఃఖము సృష్టికర్తయు సుఖము భోక్తయు నగుచుండును దుఃఖము వేరువలె మట్టినుండి రసము నాకర్షించును. అయితే సుఖము ఆకులుపూలువలె వికసితమై ఆరసము ను వ్యయముచేయును. దుఃఖము వర్షఋతువువలె కాగిక్రాగి యున్నభూమిని జల్లపఱచును. సుఖము శారదపూర్ణచంద్రునివలె వచ్చి దానిపై హాస్యమొనరించును. దుఃఖము రయితువలె పొలము దున్ని సాగుచేయును. సుఖము రాజువలె అందు పండిన పంట ననుభవించును. సుఖ ముత్కటమును, దుఃఖము మధురము నగును.

లక్ష్మి—ఈరా! ఈసంగతులన్నియు నాకుఁ దెలియవు. కాని ప్రపంచములో గొప్పవారని చెప్పబడు వారెల్లరు దుఃఖితులే. వారే

దురదృష్టవంతులు. వారికే అనేకకష్టములు కలుగుచుండును. ఇది నేను బాగుగ నెఱుగుదును మఱియు అప్పుడప్పుడు మంగళమయుఁడగు ఈశ్వరునివిధానములో ఈనియమ మెందుకా యని ఆలోచించుచుందును.

(ప్రతాపుని పుత్రుఁడు అమరసింహుఁడు ప్రవేశించును.)

అమర—అమ్మా!

లక్ష్మి—ఏమి అమర్

అమర—అమ్మా! నాయనగారు పిలుచుచున్నారు.

లక్ష్మి—పద వచ్చుచున్నాను. (ఈరతో) రమ్ము అమ్మాయీ! పోదము

(లక్ష్మియు ఈరయు పోవుదురు అమరుఁడు ఒకరాయిపై కూర్చుండును)

అమర—అమ్మయ్యా! రోజంతయు పడి కొట్టుకొనఁ గొట్టుకొనఁగా నిప్పటికి కొంచెము విశ్రాంతి చిక్కినది. ఎటులో ప్రాణము దక్కినది రామరామా! రాత్రి లేదు. పగలు లేదు. ఎప్పుడు నొకటే యుద్ధము. నాయనగారి కింక ఆఁకలి దప్పిక, నిద్రభద్ర ఏమియు లేవు ఎప్పుడు శిక్షణము, వ్యాయామము, ఆలోచన ఇదియే పని. నేను పేరునకు రాజపుత్రుఁడ నేకాని నాకును ఒక మామూలు సిపాయికివలె యుద్ధవిషయము లన్నియు నేర్చుకొనవలసిన దే. రాజకుమారుఁడ నగుటచే నింక నాకేమి లాభము! బుద్ధిపూర్వకముగ అనంతదారిద్ర్యమును శాశ్వతదైన్యమును తెచ్చి పెట్టికొనుట యేలాకో నాకు తెలియకున్నది. అదుగో బాబుగారు వచ్చుచున్నారు. బాబూ!

శక్తసింహుఁడు—(ప్రవేశించి) ఎవరు? అమర్!

అమర—అవును బాబూ! నేనే, మీ రిప్పు డిచ్చటి కేల వచ్చితిరి?

శక్త—ఏమియు లేదు. ఊరకయే తిరుగుచున్నాను. ఇచ్చట కొంచెము గాలి వీచుచున్నదని వచ్చితిని. ఇంటిలో చాల వేడిగా నున్నది. ఈఉదయసాగరతీరము చాల సుందరమైనది.

అమర—ఏమి బాబూ! మీరుండుచోట నిట్టి సరోవరము లేదా?

శక్త:—లేదు అబ్బాయీ!
అమర—ఈకోమలమీారు మీా కెటు లున్నది?
శక్త:—బాగుగనే యున్నది.
అమర—ఏమి బాబు! నాయనగారు మిమ్మిచ్చటకు పిలిచినది మొగలు అతో యుద్ధము చేయుట కేనా!
శక్త—లేదు. ఆయన నాకు ఆశ్రయ మొసఁగినాఁడు
అమర—ఇంతకుమున్ను మీారు నిరాశ్రయులా?
శక్త.—ఆఁ అన్నమాటయే
అమర—మీారు నాయనగారికి సహోదరులే కాదు?
శక్త—అవును.
అమర—అయితే ఈరాజ్యము ఆయన కెట్టిదో మీాకు నట్టిదియే.
శక్త—లేదు అబ్బాయీ! మీానాయన నాకంటె పెద్దవాఁడు
అమర—అయిన నేమి? మీారు ఆయనకు సోదరులేక దా.
శక్త—అవునుకాని శాస్త్రప్రకారము జ్యేష్ఠుఁడే రాజ్యార్హుఁడు.
అమర—ఏమి బాబూ! ఈనియమ మేల పుట్టినది? జ్యేష్ఠుఁడగు మాత్రమున శ్రేష్ఠుఁడు కాజాలఁడుగదా ఇంక నీనియమ మెందులకు?
శక్త— ఇది నే నెఱుఁగను. (స్వగతము)ప్రశ్న న్యాయముగనేయున్నది జ్యేష్ఠుఁడగుమాత్రమున శ్రేష్ఠుఁడు కాఁజాలఁడు. ఇంక నీసాంఘిక నియమ మేల పుట్టినది? శ్రేష్ఠుఁడె రాజ్యాధికారియగునటుల నియమ ముండఁదగినది చిన్నవాఁడైన నేమి పెద్దవాఁడైననేమి? ఈనియమ మేలపుట్టనదో తెలియకున్నది ఇది చాల గొప్ప సమస్యయే
అమర—బాబూ! మీా రేమి యాలోచించుచుంటిరి?
శక్త—ఏమియు లేదు. పద ఇంటికిఁ బోదము. రాత్రి అయినది.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

## తృతీయదృశ్యము.

స్థానము — రాజకవియగు పృథ్వీరాజుగృహాంగణము. సమయము — ప్రభాతము (పృథ్వీరాజు, రాజసభాసదులగు మార్వాడు, అంబరు, గ్వాలియరు, చందేరీ రాజులు కూర్చుండియుందురు.)

మార్వా—కవిరాజుగారూ! కొంచెము మీపద్యము వినిపించుఁడు. (అంబరురాజువంక చూచి) చాల చక్కనిపద్యము. చాల చక్కనిది

అంబరు—ఈగందరగోళము కట్టిపెట్టండి. పద్యాలకు గిద్యాలకు ఇది సమయము గాదు చక్కని హాస్యప్రసంగము చేసికొందము రండు.

మార్వా—అటుల కాదు. కొంచెము వినుఁడు. ఆపద్యము పేరెంత సుందరముగ నున్నదో దానిభావము నంతసుందరముగనున్నది. వృత్తముకూడ విషయానురూపముగ నున్నది.

చందేరీ—ఆపద్యము పేరేమి?

పృథ్వీ—ప్రథమచుంబనము.

చందేరీ—పేరు చాల ముద్దుగ నున్నది. కొంచెముచదువుఁడు విందము

అంబరు—ప్రథమచుంబనమా? దీనినిగూర్చికూడ పద్యము వ్రాయ వచ్చునా?

పృథ్వీ—ఎందుకు కూడదు? మీరు మాటాడునంతలో పద్యమే చదివెడివాఁడను మంచిది వినుఁడు.

అంబరు—పద్యముగిద్యము కట్టిపెట్టండయ్యా? కవిరాజుగారూ! నేఁడు రాజసభలో క్రొత్తసమాచారము లేమైనఁ గలవా?

పృథ్వీ—వేఱుసమాచార మేమియుండును? రాణాయుద్ధసమాచారమే.

అంబరు—ఓహో! ప్రతాపసింహుఁడు అక్బరుబాదుషాతో యుద్ధమా? ఇది యసంభవము. అట్లే యగుచో మన మిదివఱకే యుద్ధము చేసియుండమా?

గ్వాలి—అవును. లేనిచో మన మిటు లూరక కూర్చుందుమా?

చందే—నిజము.

మార్వా—"నవవికసితకుసుమితఘనపల్లవ" వహ్వా! ఎంత చక్కని కూర్పు! కవిరాజుగారూ! ఈశ్వరుఁడు మిమ్ము చిరాయువులఁ జేయుగాక.

అంబరు—బయలుదేరినాఁడు మేవాడుకు మహారాణాయఁట!

గ్వాలి—ఒకచిన్నరాజ్యమునకు రాజే కాదండి!

చందే—అవును అదిమాత్రమెంత ఇంతదనుక ఒకచిన్నకోట చిత్తూరు ఉండెడిది. అదికూడ మొగలులు జయించిరి.

అంబరు—రాజ్యములేని రాజు అందురే అటులున్నది.

మార్వా—కొంచెము తన పౌరుషమును జూపింపఁగోరుచున్నాఁడు. ఇంక నేమున్నది.

పృథ్వీ—అవును. ఇప్పుడు ప్రతాపసింహుఁడు కొంచెము చెలరేగుచున్నాఁడు. మొన్ననే హఠాత్తుగ పైనఁబడి మూడు మొగలు దండులను నఱికి వేసినాఁడు

అంబరు—అంత పొగరుగ నున్నచో దానిఫలితము త్వరలోనే యనుభవింపఁగలఁడు.

చందేరీ—ఇంక రెండు పోదము. దర్బారులో హాజరుకూడ వేయించుకొనవలయును. (లేచి నిలబడును.)

మార్వా—పదుఁడు (మార్వాడు గ్వాలియరు అంబరురాజులు నిలఁబడుదురు.)

అంబరు—నే నిది ప్రతాపునిమూర్ఖత్వ మందును.

చందే—నేను ప్రతాపుని యున్మాదమందును.

(అందఱును ప్రతాపుని పరిహసింపుచుఁ బోదురు.)

పృథ్వీ—వీరిలో మార్వాడురాజే కొంత తెలివితేటలు గలవాఁడు. ఈమాఱు మంచిపద్య మొకటి వ్రాయవలయును. దానికి విషయము— వియోగచుంబనము. ఎంత చక్కనివిషయము! అయితే దీని కేవృత్తము బాగుగ నుండును? కవికి అనురూపమగు వృత్తము నెన్నుకొనుటయే చాల కష్టము. కవిత్వసౌందర్యము వృత్తముమీదనే ఎక్కువ ఆధారపడియుండును.

(పృథ్వీరాజుభార్య జోషీబాయి ప్రవేశించును.)

పృథ్వీ—నీ విప్పుడు బయటి కేల వచ్చితివి?

జోషి—నేఁడు మీరు బాదుషాదర్బారునకు వెళ్లెదరా?

పృథ్వీ—వెళ్ళక చేయునది యేమి? నేఁడు బాదుషాగారి దర్బారు దినము. ఇంక నేనో ఆషాయిమాషాయిగాడనుగాను. భారతచక్రవర్తియగు అక్బరు బాదుషాగారి ఆస్థాన కవీశ్వరుఁడను. అబ్దుల్‌ఫజలు ఒకటవనంబరు. నేను రెండవనంబరు

జోషీ— (కరుణముతో) అయ్యో! దీనికి అహంకారమా! ఏపని పరమ లజ్జాకరమో దానికిని ఇంత అభిమానమా! (వ్యంగ్యముతో) మీరు అక్బరు బాదుషాగారి దర్బారు కవీంద్రులా! కర్మము ఫలించినది!

పృథ్వీ—ఔరా! నీహృదయమునఁ జాల కరుణారసము వెల్లివిరిసినది! నీ వెఱుఁగుదువా అక్బరుబాదుషా ఎంత గొప్పవాఁడో? ఆసముద్రక్షితీశానాం! ఆర్యావర్తమంతయు ఆయనకుతల వంచినది.

జోషీ—ఛీ! నాథా! మీకు సిగ్గుగుటలేదా?

గీ॥ పుణ్యభరిత భవన్మాతృభూమి యిటుల
మొగలు పాదాలఁబడి కడుఁ బొగులుచుండె
మాతృపరిభావకుండను మాట లేక
మెచ్చుఁ బొగడంగ మీమన మెట్టులొప్పె?

ఔరా! ఎంత యధఃపతనము! ఎంత యధఃపతనము! ఆర్యావర్తమంతయు నింకను అక్బరునకు తలవంచలేదని మీ రెఱుఁగరా?

గీ॥ దాస్యమున లభ్యమా భోగతతుల నెల్ల
తృణముగ గణించి బాదుషాయిడెడు ఘనత
నేలరానెడు నాశౌర్యనిధి ప్రతాపుఁ
డింకనున్నాఁడు భరతమహీతలమున॥

పృథ్వీ—ఆఁ. కవిత్వదృష్టిలో ఇది యొక చక్క నిభావమే దీని కొక మంచి యుపమాన మీయవచ్చును. ఉత్తరంగమగు సముద్రపు లహరులలో గ్రామములు, పట్టణములు, గొట్టుకొనిపోవు

చుండ దూరమున నొకపర్వతము చలింపక దృఢముగ నిలచి యున్నది. అయితే యథార్థమునకు నేను సముద్రమును జూడ లేదు, దానిలహరులను జూడ లేదు.

జోషీ—

సీ॥ క్రమహంసీతూలికాతల్పముల వీడి
గండశైలములఁ బరుండియుంట
రత్నభూషితఘనప్రాసాదముల వీడి
తవిలి కుటీరం దలదాఁచికొంట
స్వర్ణరౌప్యాది భోజనపాత్రముల వీడి
జీర్ణపర్ణముల భుజింపుచుంట
అతిరుచ్యబహుళపక్వాన్నమ్ములనువీడి
కందమూలముల నాఁకలిని విడుట
గీ॥ దేశమాత ఋణమ్మును దీర్చ్చవలకు
గారవపుమూట మేటి చిత్తోరుకోట
బాపటా నాటువలకు ప్రతాపసింగు
దాల్చిన దరిద్రఘోరవ్రతమ్మ సుమ్మ॥

ఈ కఠోరసన్యాసవ్రత మెంత మహత్వపూర్ణము! ఎంత ఉన్నతము!

పృథ్వీ—కవిత్వదృష్టితోఁ గాంచిన నిది యొకమంచిభావమే నే నిప్పుడు చూపించిన యుపమానము దీనికి చక్కఁగా తగియున్నది. చూడుము. పర్వతమువలె నిదియు నున్నతము, ఇదియు కఠోరము, ఇదియు దరిద్రము. కవిత్వదృష్టిలో దారిద్ర్యముకూడ నొక మహోన్నతభావమే. కాని సాంసారికదృష్టిలో నిదియంతగ నుపయోగకరము గాదు.

జోషీ—ఉపయోగకర మెందులకుఁ గాదు?

పృథ్వీ—దారిద్ర్యములో విలాసమునకు స్థానముండదు గదా. ఎన్నియో ఆవశ్యకవస్తువులు కఱవై యుండును. చలికాలములో వ్యర్థముగ నెక్కువ చలికి లోను కావలసి య్యుండును. ఆకలి వేయునపుడు

ఆహారము దొరకమిచే కడుపులో నెప్పుడు గడబిడగా నుండును మఱియు ప్రపంచములో నున్నతర్వాత మనుష్యుని కేదో యొక వస్తువుపైకి బుద్ధి పోకయుండదు కొందమన్న దగ్గఱ పైసా ఉండదు. ఇంక దీనికి తగునట్లుగా ఇంటిలో పిల్లమేక ఉన్న వానియవస్థ చెప్పనలవి కాదు. ఇంక నిది లాభకారి యెట్లులో చెప్పుము.

జోషీ—వినుఁడు బుద్ధిపూర్వకముగ దారిద్ర్యవ్రతముఁ బూనినవానికి యిందఱంత కఠోరము గాజాలదు. వానికి దారిద్ర్యములో ఏ రాజమకుటమందును ఏ సార్వభౌముని సామ్రాజ్యమందునుగను పడని యొక సౌందర్యము, ఒకగుణము అనుభూత మగును. ఉన్నత హృదయుఁడు దారిద్ర్యమున కెన్నఁడును వెఱవఁడు పైఁగా వాఁడు దారిద్ర్యమును ప్రేమించును. దానిని కోరి తెచ్చుకొనును. వాఁడు దారిద్ర్యములో నెన్నఁడును మస్తకమువంచఁడు—ఇంకను ఉన్నతము చేయును. వాఁడు దారిద్ర్యమునఁ జల్లారఁడు—ఇంకను ప్రజ్వరిల్లును.

పృథ్వి—కాని కవితాక్షేత్రమునకు వెలుపల దారిద్ర్యసౌందర్యముచూచు భాగ్య మెవ్వరికిని గలుగదు.

జోషీ—కలుగదా?

సీ॥ అఱచేతనున్న రాజ్యము వీడి నారవ
స్త్రములను దాల్పఁడే రాఘవుండు
భ్రాతృధర్మంబు నిర్వర్తింప సన్న్యాసి
యయి మెలంగఁడె యల్లకయికసుతుఁడు
ఎల్లభోగములఁ ద్యజింప నామరణమ్ము
ప్రతిన దాలుపఁడె దేవవ్రతుండు
అలుబిడ్డల రాజ్య మన్ని విసర్జించి
మునివృత్తిఁ బూనఁడే బుద్ధమూర్తి
గీ॥ ధర్మమూలకమా దరిద్రతను దాల్చి
పూజ్యత వహింపరే వారు భువనమందు

త్యాగశోధితమైన తత్తనువు గరము
రాజిలదె సానపట్టిన రత్నమటుల

పృథ్వీ—వారు వట్టి వెఱ్ఱివారు. ఇల్లు వాకిలిలేనివార లెండ కెండుచు వానకుఁ దడియుచు బాధపడుచుండిరనఁ గొంత సబబుగలదు. కాని సలక్షణముగ నిండ్లు వాకిళ్ళుగలవారుగూడ నట్లు బాధపడు చుండిరనిన వారిని ఉన్మాదవైద్యశాలకు పంపవలసినదే.

జోషీ—ఈవెఱ్ఱితనమే ప్రపంచమున ధన్యత సంపాదించునది స్వామీ! మహాత్ములు కాఁగోరినచో త్యాగ మావశ్యకము.

పృథ్వీ—త్యాగమా? చాలు. అయితే నా కామహత్త్వము వలదు.

జోషీ—మహత్త్వముఁ బడయుట మీవంటివిలాసప్రియులపని గాదు ఇది నేను బాగుగ నెఱుఁగుదును. అయితే మాతృభూమిని పరులు పరాభవించుచుండ దానిని రక్షింపఁ బూనుట యొక మహత్త్వము కాదు. అది ప్రతిపుత్రునకును గర్తవ్యము—చాల సాధారణకర్తవ్యము. నిలఁబడి మాతృపరాభవమును గనులారఁ జూచుట మహాత్వాభావమును సూచింపదు——మనుష్యత్వాభావ మును సూచించును.

పృథ్వీ—చూడుము. మొదటిమాట స్త్రీ లిటుల గూఢగీర్వాణభాషలో మాట్లాడిన "చిన్ననోరు పెద్దమాట" అను సామెత వారియెడ సార్థకమగును. రెండవది వారు తార్కికులువలె ఇటుల తర్కము ప్రారంభించిన మగవాళ్ళకు దేశము విడిచిపాఱిపోవలసిన దుస్థితి సంభవించును.

జోషీ—గుప్పెడుమెతుకులు తిని పొట్ట నింపుకొనుట, సుఖముగ నిద్రించుట ఈమాత్రమువని సాధారణపశువులు చేయగలవు. కాని మనుష్యుఁడు యేవిషయమునఁగాని ఇంచుకస్వార్థత్యాగము చేయఁ జాలనిచో, తన మాతృగౌరవరక్షణమునకై అవసరము గలుగు నపుడు ఏపాటిసహాయమును జేయఁజాలనిచో నింక మనుష్యున కును పశువునకును భేదమేమి?

పృథ్వీ—నీవింక లోనికిఁ బొమ్ము. నీమాటలు చాల ముదురుచున్నవి. మాటలతో నాబుఱ్ఱ నిండిపోయినది ఇంక వెలితిలేదు. నీవు చెప్పినవన్నియు నేను జీర్ణము చేసికొనిన పిమ్మట తక్కినవి చెప్ప వచ్చును. పొమ్ము (జోషి వెళ్లును.) ఈమె నన్ను వేపుకొని తినినది. తుదకు ఓడించి మఱి వదలినది. ఈమెతో నేను గెలువజాలకపోతిని నాయోగ్యత నంతను కడిగి వేసినది. ఆడ వాళ్లే అసలు మాటలలో జాణలు. అందు జోషి బాగుగ చదువు కొనినది కూడ ఇంక నే నామె నెట్లు గెలువఁగలను. అందుకనే నేను ఆడవాళ్ళకు ఎక్కువ చదువు పనికిరా దందును. చంపుకొని తిన్నది (విచారముతో బయటకుఁ బోవును )

చతుర్థదృశ్యము

స్థానము—చిత్తోరువద్ద ఘోరారణ్యము. సమయము—ప్రభాతము. (సశస్త్రుఁడగు ప్రతాపసింహుఁడు ఒంటరిగ అడవివంక చాలసేపు చూచుచుండును.)

ప్రతాప—(శుష్కకంఠముతో) అక్బర్! నీవు మేవాడను జయించిన మాట వాస్తవము కాని ఇంకను మేవాడను నేనే శాసించు చున్నాను ఈవిశాల దేశమంతయు ధ్వంసము చేసితిని. గ్రామ వాసుల నెల్లఱను పర్వతదుర్గమునకు లాగికొని వచ్చితిని. అక్బర్! జ్ఞాపకముంచుకొనుము నాకంఠమునఁ బ్రాణమున్నంతవఱకు మేవాడనుండి రాగిదమ్మిడికూడ నీఖజానాకు చేరదు దేశమంత లో తుదకు దీపము పెట్టుటకు ఒక్కమనుష్యునిఁ గూడ నేను మిగుల్చలేదు. దేశమంతయు నెటుల బావురుమనుచున్నది! దేశమంతయు శ్మశానవాటిక వలె నీరవముగ నున్నది. పొలములనిండ అడవిగడ్డి మొలచినది, త్రోవలలో పెద్దపెద్ద మ్రాకులు పెరిగినవి. ఎటుచూచినను మహారణ్యము. పూర్వము మనుష్యులు తిరుగుచోట నిపుడు అడవిమృగములు చరించుచున్నవి, జన్మభూమీ! సుందరమేవాడుభూమీ! వీరప్రసవినీ!

మాతా! నీకిప్పు డీవేషమే బాగుగనున్నది. ఇపుడు నిను నా-
యనిమాత్ర మనఁజాలుదును. నీపై నాయధికారమును దెలుపఁ
గలను. ఇంక నగలువాణెములో—క్రమ్మఱి నాచేతులతో వా
నిని నీపాదములకుఁ దొడిగెదను. లేనిచో ఈశ్మశానమున ని
న్నీతపస్విని వేషముననే యుంచెదను అమ్మా! నేఁడు నిన్ను మొ
గలదాసినిగఁ గాంచి నాహృదయము బ్రద్దలగుచున్నదిఁ ఆహా!
భారతభూమి కెట్టిదురవస్థ సంభవించినది!

సీ॥ దూరపుదృష్టి హిందువు లత్తఱిఁ మహా
దార్యంబును నొకింత దాల్పకున్న
జయచంద్రుఁడాది దుష్టని కృష్టసుతులు పృ
థ్వీశులు పుడమి జన్మింపకున్న
సోదరమాత్సర్యమేదురులై నృపుల్
మాతృహత్యకయి పాల్పడకయున్న
ఆర్యరక్తోద్భూతులైన హిందూరాజ
మణులు పూర్వోన్నతి మఱవకున్న
గీ॥ ఎన్నియుగముఁ నుండియో యెనకమెసఁగ
సూర్యచంద్రాన్వయక్షత్రశూరవరులు
పాలనము చేసినట్టి యీభరతభూమి
యవనులకుఁజిక్కి దౌర్భాగ్య మబ్బెనొక్కొ

(ప్రతాపునకు కంఠావరోధము గల్గును. ఇంతలో నొకపసులకాపరిని
గొని యొక సైనికుఁడు వచ్చును.)

సైని— (నమస్కరించి) మహారాణాకు జయము.

ప్రతా—ఏమి?

సైని—ఈతఁడు చిత్తూరుకోటవద్ద గొఱ్ఱెలను మేపుచున్నాఁడు

ప్రతా—(పసులకాపరిని తీవ్రముగ చూచుచు) ఇది నిజమేనా?

పసుల—అవును రాణాజీ!

ప్రతా—మేవాడుదేశమున ఎవ్వఁడేని పొలముదున్నుకొనినఁగాని పసుల

మేపుకొనినఁగాని ప్రాణదండము విధింపఁబడునను నాయాజ్ఞ నెఱుఁగవా?

వసుల—ఎఱుఁగుదును.

ప్రతా—అగుచో నీవు గొఱ్ఱెల నేల మేపుచుంటివి?

వసుల—దుర్గముననుండు మొగలోద్యోగి యాజ్ఞచే

ప్రతా—మంచిది. అతఁడు వచ్చి నిన్ను రక్షించుగాక. నేను నీకు మరణదండము విధించుచున్నాను.

వసుల—ఈసంగతి వారికి తెలిసినచో వారు తప్పక నన్ను రక్షింతురు.

ప్రతా—స్వయముగ నే నాయనకు కబురంపుచున్నాను. సైనికా! నీ వితనికి సంకెలలు వేసికొనిపొమ్ము. ఒకవారము పిమ్మట నితఁడు వధింపఁబడును. దుర్గాధికారి వద్దకు నే నిపుడే కబురంపుచున్నాను. వధానంతరము ఇతనిసిరము వాసమునకు గట్టి చిత్తూరుదుర్గ మార్గమున నుంచవలయును. నాయాజ్ఞ తుచ్ఛముగాదనియు మొగలులు చిత్తూరు దుర్గమును జయించినను మేవాడకురాజు నేనే కాని అక్బరు గాదనియు జనులకు తెలియఁగలదు. పొమ్ము తీసికొనిపొమ్ము.

(వసుల మేపరితో సైనికుఁడు పోవును.)

ప్రతా—ఓరీదురదృష్టవంతుఁడా! వసులకాపరీ! నీవు వ్యర్థముగ నీకలహమునఁ జంపబడితివి. రావణుని పాపమున లంక ధ్వంసమయ్యెను. దుర్యోధనుని పాపమున మహాత్ములగు భీష్మద్రోణకర్ణాదులు చంపఁబడిరి. నీవో ఒకమనుష్యమాత్రుఁడవు. ఈపనులన్నియుఁ గాల నిష్ఠురములు అమ్మా! జన్మభూమీ! కేవలము నీకొఱకే నేను నిష్ఠురుఁడ నయితిని. కనుక నే నేను నీయఁలంకారములన్నియు విప్పితిని. ప్రియతమయగు మహారాణిని ఒకసాధారణ పర్ణకుటీరమున నుండుదానినిగాఁ జేసితిని ప్రాణాధికులగు పుత్రుని పుత్రికను దరిద్ర తాపతము నభ్యసింపఁ జేసితిని స్వయముగ నేను సన్యాసి నయితిని

(శస్త్రధారియగు శక్తసింహుఁడు ఎడమవైపున పడియున్న కూ్రరజంతువుల కంకాళములఁ జూచుచు మెల్లగ ప్రవేశించును.)

ప్రతా—చూచివచ్చితివా?

శక్త—ఆఁ

ప్రతా—ఏమి చూచితివి?

శక్త—అచ్చట నెవ్వరును లేకుండుటను జూచితిని.

ప్రతా—ఎవరును లేరా?

శక్త—ఎవ్వరును లేరు.

ప్రతా—ఏమి?

శక్త—ఎవ్వరేని ఉండినఁగదా కారణ మడుగుటకు.

ప్రతా—మందిరమండలిపూజారి ఏమయ్యెను? ఆయనయే నాకు వెుంగలనేనవచ్చు సమాచారము తెలిపెను.

శక్త—ఆయన తనయింటివద్ద లేడు.

ప్రతా—అయితే నా రాక వ్యర్థమయ్యెను.

శక్త—వ్యర్థమేమి? ఇచ్చట ననేకవన్యపశువులు గలవుగదా. వేటాడుదము రమ్ము.

ప్రతా—ఇంక పులివేఁటయేనా మన కిప్పుడు పని?

శక్త—లేకున్న మఱి యేమిచేయుదము? ఇంతమంచిరోజు ఇంతచక్కని అడవి, ఇట్టిభయానకనిర్జనమార్గము! దీనిసౌందర్యపూర్తికి రక్తమావశ్యకమగునపుడు మనుష్యరక్తము లభింపకున్న పశురక్తమునే ప్రవహింపఁజేతము

ప్రతా—నిష్ప్రయోజనముగ రక్తమును బాఱించుటయా?

శక్త—నిష్ప్రయోజనమేమి? బల్లెముల లక్ష్యమును సాధన చేయుటయే ప్రయోజనము. అన్నా! నేఁడు మనయిద్దరలో ఎవ్వరు బల్లెములను బాగుగా గుఱిచూచి ప్రయోగింతురో చూతము.

ప్రతా—నీకు రుజువుకావలసినది యిదియేనా?

శక్త—అవును (స్వగతము) నీ వేయధికారగర్వముతో మేవాడుకు రాణావో నే నెందుకు నీదయాధర్మమునకుఁ బాత్రుడనయి నీవుపె

ట్టిడు అన్నము తినవలయునో నేఁడు కనుగొందును.

ప్రతా—మంచిది నేఁడీపని చేయుదము, వేటకు వేఁటయునగును. అభ్యాసమునకు నభ్యాసము నగును. (ఇద్దరును పోదురు)

దృశ్యపరివర్తనము

(ఒకఅడవిలో ప్రతాపశక్తసింహులు చచ్చినపులిని పరీక్షించుచుందురు.)

ప్రతాప—ఈపులిని నేను చంపితిని.

శక్త—లేదు నేను చంపితిని.

ప్రతా—ఇదుగో చూడు. ఇది నాయలుగు.

శక్త—ఇది నాయలుగు.

ప్రతా—ఇదినాయలుగుచే చచ్చినది.

శక్త—కాదు నాయలుగుచేఁ జచ్చినది.

ప్రతా—మంచిది పద ఈ అడవిపందిని గుఱిపెట్టి కొడుదము.

శక్త—సమానదూరమున నుండి కొడుదము

ప్రతా—మంచిది. (ఇద్దరు అటనుండిపోదురు.)

(దృశ్యపరివర్తనము, మరియొకఅడవి)

శక్త—పంది పారిపోయినది.

ప్రతా—అయితే ఎవ్వరిబల్లెమును తగులలేదు.

శక్త—లేదు

ప్రతా—అయితే ఏమియు రుజువు కాలేదు. నేఁడు చాలింతము. చాల ప్రొద్దు పోయినది. మరియొకప్పుడు చూతము.

శక్త—మరియొకనాఁ డెందుకు? నేఁడే యేల చూడఁగూడదు?

ప్రతా—ఎట్లు?

శక్త—మన మొకరిపై నొకరు బల్లెము ప్రయోగించుకొందము.

ప్రతా—ఆఁ అదియేమి?

శక్త—ఇందులో బాధ యేమున్నది?

ప్రతా—వద్దు వద్దు ఇందు లాభ మేమున్నది?

శక్త—లాభము లేకున్న హానిమాత్ర మేమున్నది? అంతగా పోయిన శరీరమునుండి కొంచెము రక్తము పోవును అయినను మనము

కవచము ధరించియే యున్నాము. ఇంతమాత్రమున నీవును చావవు. నేనును చావను, ఇంక భయ మెందులకు?

ప్రతా—శక్తసింహా! నేను చచ్చుటకు భయపడుట లేదు

శక్త—కాదుఅన్నా! నీవు బల్లెము గ్రహింపుము. నేడు మనమిద్దరము నరరక్తమునకై బయలు దేరితిమి కనీసము రెండుమూడు చుక్కలనెత్తురైనను కార్పవలయును బల్లెము పట్టుము. విసరుము. (బిగ్గరగా) విసరుము

ప్రతా— మంచిది. విసరుము.

శక్త—ఒక్కమారుగ విసరుదము

(ఇద్దరును కత్తులు క్రిందఁబెట్టి ఒకరిపై నొకరు బల్లెముల విసరుకొనఁ బోదురు. ఇంతలో ప్రతాపుని పురోహితుఁడు వచ్చి వారిమధ్య నిలబడును.)

పురో—ఆఁ ఇదియేమి? సోదరులమధ్య యుద్ధమా? మీరు శాంతింపుఁడు. శాంతింపుఁడు.

శక్త—కాదు కాదు. మీరు తొలఁగుఁడయ్యా! లేనిచో మీరు చంపబడుదురు.

పురో—నేను మృత్యువునకు వెఱవను. మీరు శాంతింపుఁడు

శక్త—ఎన్నటికిని లేదు. మేము నరరక్తమునకై ఇంటినుండి బయలు దేరితిమి. మాకు నరరక్తము కావలయును.

పురో—మీకు నరరక్తము వలయుచో ఇదుగో నిచ్చుచున్నాను. (క్రింద నున్న శక్తసింహుని ఖడ్గము తీసికొని ఱొమ్మున బొడుచుకొని పడిపోవును.)

ప్రతా—ఆఁ గురుదేవా! ఏమి యిట్లు చేసితిరి?

పురో—ఏమియు లేదు. మిమ్ము శాంతింపఁజేయుటకై నే నిట్లు చేసితిని. మీఅన్నదమ్ము లెప్పుడును జగడమాడకుఁడు. దీనివలన నే దేశము నాశమయ్యెను. ఇంకనాశము చేయకుఁడు (చనిపోవును.)

ప్రతా—శక్తా! నీ వేమి యిట్లు చేసితివి?

శక్త—(భయపడి) నిజముగ నే నేమి చేసితిని?

ప్రతా—శక్తా! నీవలననే ఈ బ్రహ్మహత్య జరిగినది. నీజాతకములో నీ వొకనాఁడు మేవాడును నాశము చేయుదువనియున్నట్లు వింటిని. ఇంతవఱకు నే నామాటను నమ్మలేదు. కాని నేఁడు పూర్తిగా నమ్మితిని

శక్త—నావలన బ్రహ్మహత్య జరిగినదా?

ప్రతా—నీవు నిరాశ్రయుఁడవై భ్రిమ్మరుచుండ నేనే నిన్ను మేవాడుకు గొనివచ్చితిని. కాని నీవు మేవాడకు సర్వనాశనము సేయువాఁడవు. నిన్ను మేవాడలో నుంచఁజాలను. నీవు తక్షణము నా రాజ్యము నుండి వెడలి పొమ్ము.

శక్త—మంచిది.

ప్రతా—పొమ్ము. నేనిపుడు వీరి సంస్కారప్రయత్నము గావించి ప్రాయశ్చిత్తము చేసికొందును. నీవు పొమ్ము,

(ఇద్దఱు చెరియొక ప్రక్కను బోదురు)

పంచమదృశ్యము

స్థానము—అక్బరు రాజప్రాసాదమందలి యొక వసారా.

సమయము—తృతీయయామము.

(మానసింహునిచెల్లెలు రేవ పచారుచేయుచుండ నొకవృద్ధదాసి ప్రవేశించును.)

దాసి—అమ్మాయీ! నీవు ఇక్కడ నున్నావా?

రేవ—ఏమి?

దాసి—నీ విక్కడ సుఖంగా పచార్లు చేస్తున్నావు. నేను నీకోసం ఇల్లు అంతా వెదకి వచ్చాను.

రేవ—ఏమి నాతో నీకేమి పని వచ్చినది?

దాసి—ఏంపని అంటున్నావు? పెండ్లికూతురుకు పెళ్ళిగొడవే తెలియదు కాని పొరుగువాళ్ళకంటికినిద్ర లేదన్నట్లుంది. నాతో పనేం అంటున్నావు? నీకు పెళ్లిమనువువచ్చింది. నీతో కాకపోతే నాతో

నా పని? చక్కనిమాటలు నేర్చావులే. నాకు కావలసిన పెళ్ళే మీటో ఒక్కమాటే అయింది ఆడవాళ్లకు రెండుసార్లు పెళ్లి అవుతుందా? ఇల్లాఅవుతే ఇంక చింత ఏం వుంది? అయినా ముసలిముండను నన్ను పెళ్ళాడే దెవళ్ళు? అమ్మాయీ! నా పెళ్ళయి నపుడు నీవింకా పుట్టలేదు నేను మాత్రం అపు డేమంత పెద్ద దాన్ని? పదకొండోయేడు వచ్చిందో లేదో.

రేవ—మంచిది నీవు పొమ్ము నీప్రలాపనముతో నిచ్చట నేమియుపని లేదు. నీవు పొమ్ము.

దాసి—ఎవడికోసం దొంగతనం చేస్తామో వాడే దొంగదొంగఅని అల్లరి చేసినట్టుంది నీకు పెళ్లి కబురు సెప్పగానె ఉబ్బి ముద్దెట్టుకొంటా వనుకొంటే పైగా నన్ను చివాట్లెడుతున్నావు? ఇవాళ్ళ ముసలిదాన్ని అయినానని నన్ను కసరి కొడతావా? ఇవాళ్ల ముసలిదాన్ని అయినాగాని ఒకప్పుడు నేనూ పడుచు దాన్నిగా వుండేదాన్నే. నాకూ పెద్ద పెద్దకళ్లుండేవి నాబుగ్గలుకూడా గులాబిపువ్వులల్లే వుండేవి. నావొంటితీరుకూడా బాగానేవుండేది. అప్పుడు మా ఆయన నన్నెంతో పొగడుతూ వుండేవాడు ఒకనాడు ఆయన నన్ను పిలిచి—

రేవ—నీ స్నిగోడవఅంతయు నెవ్వ రడిగినారు? పొమ్ము. నన్ను వేధింప కుము. లేనిచో నేను మంచిదాననుగాను.

దాసి—అమ్మా! ఎన్నిమాటలు నేర్చావు? నే నెట్లా వెడతా? నిన్ను పిల్వటానికి వచ్చాను. మీ అమ్మ నిన్ను పిలవమంది. కాని మళ్ళీ పిల్వొద్దులే అంది పెళ్ళిమాట వినగానే ఆవిడ మండి పడింది. ఆపాళాన నేను వచ్చేశాను. నీ వెరుగుదువా పెళ్లికొడుకు ఒక నేరురాజు రాయసింహుడు హా! హా! హా! అరవైఏళ్లు బాలా కొమారుడు మూగుతనాలు గడచాయి ఇంకా ఒకతనం వుంది చూపులుకు కోతి రూపయౌవనాలు సున్న.

రేవ—అగుచో నాతోం బని లేదు, నీవు పొమ్ము.

దాసి—పని యెందుకు లేదు. బలే! చక్కనిమాటలు నేర్చావు. ఇప్పుడు

మీఅమ్మ ఇట్లా అంటేనే మీనాన్న కావలసినంత పోట్లాట చేశారు. ఇంత పోట్లాట నేనెప్పుడూ చూడలేదు. పెద్దమహా

శైవ—భారతంఅయింది, మహాభారతం. మీఇల్లు కురుక్షేత్రం అయింది. ఆఁ!

దాసి—అవును! పెద్దజగడం అయింది అయితే దెబ్బలాట జరుగలేదులే కాని

శైవ—'కాని' యేమి? కాని అర్ధణా.

దాసి—నీకిదే పెద్దదోషం. నీమాటేగాని రెండోవాళ్ళమాట వినిపించుకోవు ఇఁక నేనేమి చెప్పను. మీ అమ్మ ఈముసలివానికి నాకూతుర్ని ఇవ్వనంది. అప్పుడు మీనాన్న ముసలివానికి ఇవ్వడం బాగోలేదని ఈ పెళ్ళివిషయంలో మానసింహునికి జబు వ్రాస్తున్నారు

శైవ—అయితే వారేమియు కోపగించలేదుగద?

దాసి—కోపగించలేదనుకో. ఇంతకు ఆయన ముగవాడు. కోపం రావాలంటే ఎంతసేపు? మాఆయన ఒకనాడిట్లే కోపగించాడు. కళ్ళెంత ఎఱ్ఱచేశాడనుకొన్నావు కోపగించవద్దు మొర్రో నీఆరోగ్యం చెడుతుందని ఎంతో మొత్తుకొన్నా. ఇంతలో రామాచార్లుగారు వచ్చి చేతులు పట్టుకొని ఎక్కడికో లాక్కొని పోయినాడు. నాప్రాణం దక్కింది లేకపోతే ఆవ్వాళ్ళే మాయింట్లో మహాభారతం అయ్యేది. తర్వాత మళ్ళీ మాఆయనవచ్చి నన్ను బతిమాలుకొన్నాడు. కాళ్ళపైపడి ఎంతో వేడుకొన్నాడు. ఎంతసేపటికి నేను వొప్పుకోలేదు మళ్ళీ ఒకనాడు-

శైవ—నన్ను వేధించుకొని తినెదవా నీవిచ్చటనుంచి వెళ్ళెదవా లేదా?

దాసి—బాగుంది. నేనెందుకు వేషతా? నీకు నాకష్టసుఖాలు చెప్పుకుందామని వస్తే నన్ను చీడపురుగువలె విదిలించి కొడుతున్నావు (ఏడ్చును)

శైవ—ఓసీ! నిన్నిప్పుడు నేనుకొట్టితినా?

దాసి—లేదు అమ్మా! నీవునన్ను కొట్టలేదు. నేనేనిన్నుకొట్టాను. రాజు

గారితోను రాణిగారితోనూ నేనుకొట్టానని వెళ్ళిచెప్పు. ఇన్నాళ్ల దాక నిన్ను చంకనెత్తుకొని పెంచాను. మీనౌకరి చేసిచేసి ముసలదాన్ని అయినాను. ఇంకేముంది. నన్ను కొట్టితిట్టి ఆవతలికి ఈడ్వండి. నేను కడుపుకాలి సందుగొందులు తిరుగుతూ వుంటాను. ఇప్పుడు నాకెవరున్నారు? నామగడు లేడు. ఆనాపడుచు దనమూ లేదు నీకు ధర్మమైతే నన్ను వెళ్ళకొట్టు నీవు పసిదానవుగా వున్నపుడు నిన్ను చంకనెత్తుకొని ఆడించాను ఒకనాడు నిన్నుదొంగతనంగా వీధినాటకానికి తీసికొనిపోయి చూపించాను. ఈసంగతి మహారాజుగారికి తెలిసి వారు నన్ను పెట్టిన అవస్థ భగవంతుడికి తెలియాలి. మెడవిరవడం తరువాయిగా అన్నీ చేశారు. దీనిని గుంపులోకి ఎందుకు తీసుకు పోయూవన్నారు దానిపై నేను-

(తెరలో) రేవా! రేవా!

దాసి—అదుగో విను.

రేవ—వచ్చుచున్నాను. (నిష్క్రమించును)

దాసి—(కొంచెము సేపు మెదలక కూర్చుండి) ఇక నేను పోయి మరి రివ్వాతోనైనా బాతాఖాని వేసుకొంటాను.

(షష్ఠదృశ్యము)

స్థానము—ఆగ్రాలో అక్బరుని ఆలోచనాగృహము

సమయము—ప్రభాతము

[అక్బరు, శక్తసింహుడు, ఎదురుగ నిలబడి యుందురు]

అక్బరు—మీరు రాణాప్రతాపసింహునకు సోదరులా?

శక్త—చిత్తము.

అక్బరు—మీ రిచ్చట కేయుద్దేశ్యముతో వచ్చితిరి?

శక్త—నేను మొగలసైన్యమును గొని రాణామీదికి దండెత్తఁగోరుచున్నాను. రాణానుమొగలులకు పాదాక్రాంతునిఁ జేయుటయు,

తత్సైన్య రక్తప్రవంతిని మేవాడునఁ బాఱించుటయు నా సంకల్పము.

అక్బరు—ఇందుచే మొగలుల కేమి లాభము? మేవాడునుండి నేటివరకును ఒకదమ్మిడీగూడ మాఖజానాకు రాలేదు.

శక్త—మీరు రాణాను జయించినచో చాల పైకము సర్కారు ఖజానాకు రాఁగలదు. రాణాహుకుముచే నిప్పుడు మేవాడులో బొత్తుగా కృషివ్యాపారము జరుగుటలేదు. లేకున్న మేవాడులో బంగారుపండెడిది. నాఁడు ఒకపసులకాపరి చిత్తూరు దుర్గాధ్యక్షునిహుకుముచే మేవాడులో గొఱ్ఱెలు మేపుచుండ రాణా వాని తల తీయించెను.

అక్బరు—(ఆలోచనతో) మంచిది. మీరు మాకేమి సహాయము చేసెదరు?

శక్త—నేనురాజపుత్రుఁడను. యుద్ధముచేయుట యెఱుఁగుదును. రాణాతోఁ బోరాడెదను, నేను రాజపుత్రుఁడను సైన్య సంచాలన మెఱుఁగుదును. మొగలసైన్యముఁ గొని రాణామీఁదికి దండెత్తెదను.

అక్బరు—దీనిచే మీ కేమి లాభము?

శక్త—పగ తీఱును.

అక్బరు—ఇంతయేనా?

శక్త—అవును ఇంతయే.

అక్బరు—మీకు సైన్యమునిచ్చినచో మీరు ప్రతాప సింహునిజయింపఁగలరా?

శక్త—జయింపఁ గలనని నాకు గట్టినమ్మకము గలదు. నేను ప్రతాపసింహుని సేనాబలము నెఱుఁగుదును, యుద్ధకౌశలమెఱుఁగుదును. ఇంక ప్రతాపుఁడు యోద్ధయే నేను యోద్ధనే. అతఁడు క్షత్రియుఁడే నేను క్షత్రియుఁడనే. అతఁడు రాజపుత్రుఁడే నేను రాజపుత్రుఁడనే. భేదము అతఁడు పెద్దవాఁడు నేను చిన్నవాఁడను. ఇంతయే. ఒకనాఁడుప్రసంగవశమున ప్రతాపసింహునిపుత్రుఁడగు అమరసింహుఁడు "జ్యేష్ఠుఁడయిన మాత్రముననే శ్రేష్ఠతగలుగ"

దని చెప్పెను నాటనుండియు ఆవిషయము నన్ను శల్యమువలె వేధించుచున్నది అతనిమాట యెంతయు సత్యమని నాకుతోఁచు చున్నది

అక్బరు—ఊఁ! (నేలవంక చూచుచు కొంతసేపు ఇటునటు తిరిగి) ఎవ్వ రక్కడ?

(ద్వారపాలకుఁడు వచ్చి నమస్కరించును)

అక్బరు—మహారాజ మానసింహుని నొకమా ఱు దయచేయుఁడని చెప్పుము.

ద్వార—చిత్తము ఖుదావంద్! (ప్రస్థానము)

అక్బరు—రాణాప్రతాపసింహుఁడు మీకు చాల మేలుచేసెనని వింటిని

శక్త—ఏమి మేలు?

అక్బరు—లేదా? అయితే నేను విన్నది పొరపాటు ప్రతాపుఁడు నేటి వఱకు మీ కెట్టియుపకారమును జేయలేదా?

శక్త—చేసినాఁడు. మాతండ్రి ఒకమాఱు నన్ను వధించుట కాజ్ఞాపింప-

అక్బరు—(ఆశ్చర్యముతో) ఆఁ! మీతండ్రి మిమ్ము చంపుట కాజ్ఞ యొసఁగెనా?

శక్త—చిత్తము వినుఁడు. నాచాటు భారతమంతయు వినిపించెదను. అయిదు సంవత్సరముల ప్రాయమున నా కొక కత్తి కనుపడగా దానికి పదునున్నదో లేదో యని పరీక్షించుటకు దానితో నా చెయ్యికోసికొంటిని. నాజాతకములో నేను నాజన్మభూమిని ధ్వంసము చేసెదనని వ్రాసియున్నది. నేను నిస్సంకోచముగ కత్తి పెట్టి నాచేతిని నఱికికొనుట చూచి నాతండ్రి నాజాతక వృత్తాంతమును నమ్మెను. నాచే అసాధ్యకార్యములన్నియు సాధింపఁబడునని యు నెఱింగి నాఁడే ఆయన నన్ను వధించుట కాజ్ఞ యొసంగెను.

అక్బరు—ఆశ్చర్యము!

శక్త—మీకు ఆశ్చర్యముగ నున్నదా? మీ రాయనను బాగుగ నెఱుగరు కాఁబోలు చిత్తూరుకోట ముట్టడింపఁ బడినపుడు ఆయన

పిఱికివానివలె పాఱిపోవనిచో చిత్తూరు భాగ్యసూర్యుడుఁ డెన్నడు నస్తమించఁడు.

అక్బరు—చిత్తూరు రాజపుత్రులచేతినుండి మొగలుల చేతికి వచ్చెనన్న ఇది దాని సౌభాగ్యముగాదా?

శక్త—అది యెట్లు?

అక్బరు—ఆటవికులగు రాజపుత్రులు రాజ్యసంచాలన మెఱుఁగరని మీరును ఒప్పుకొందు రనుకొనియెద.

శక్త—ఆటవికులు రాజపుత్రులో మొగలులో నాకీసంగతి తెలియదు. కాని ఇంతవరకు నేజాతివారును మమ్ము ఆటవికులనుట నేను వినియుండలేదు.

అక్బరు—అట్లు కానిచో మొగలులు హిందువులపై నెందుకు శాసనము గావింతురు?

శక్త—రోమను జాతియు లంత నాగరికులుగదా. ఆటవికులగు గథులు వారి నెట్లు లోడించిరి?

అక్బరు—రోమనులు ధర్మమును మఱచి.. అందుచే ఓడిపోయిరి.

శక్త—అయితే గథులు ధార్మికు లగుటచేతనా రోమనులను జయింపఁ గలిగినది? అట్లుకాదు ప్రపంచములో నెప్పుడును ధర్మమునకే జయము గలుగదు. అధర్మమునకే యెప్పుడు నపజయము గలుగుచో అధర్మమెన్నఁడో నామ మాత్రావశిష్టమయి యుండెడిది అట్లే యగుచో నేఁడు ప్రపంచములో మూఁడువంతులకుపైగా అధర్మమే ప్రభుత్వము చేయుచునుండదు. మఱియు నిపుడు హిందూ దేశములోనే అధర్మము తనహద్దునుమీఱి సభ్యతారాజ్యమునఁ బ్రవేశించి దానిని నాశనముచేయుచున్నది. అయినను ఈ ప్రాపంచిక వ్యవహారమంతయు సర్వశక్తిమంతుఁడును, న్యాయవంతుఁడును, దయాళువునగు పరమేశ్వరుని చేతిలో నున్నదనియే శాస్త్రములు చెప్పుచున్నవి.

అక్బరు—(నిశ్చేష్టితుఁడై ప్రసంగము మార్చి) అయితే మీరు మీవ్వ

త్తాంతము వినిపింపుఁడు. మీతండ్రిగారు మిమ్ము వధించుట కా
జ్ఞయిచ్చినపు డేమి జరిగెను?

శక్త—వధికులు నన్ను వధ్యస్థానమునకుఁ గొంపోవుచుండిరి ఇంతలో సాలుంబరపతియగు గోవిందసింహుఁడు నాకు తటస్థించిరి. వారికి ఒకప్పుడు నాపై చాల దయ యుండెడిది. గనుక నే ఆయన నన్ను తనకు ఉత్తరాధికారినిగాఁ జేయఁగోరి రాణాతోఁ జెప్పి నన్ను రక్షించెను. నన్ను పోష్యపుత్రునిగ తనవద్ద నుంచుకొని పెంచుచుండగనే ఆయన కొక కుమారుఁడు గలిగెను. అప్పు డు మేవాడకు రాణాప్రతాపసింహుఁడు, సాలుంబరపతి చెప్పుట చే రాణా నన్ను తనరాజధానికిగొనివచ్చిచాల ఆదరముతో తనవద్ద నుంచుకొనెను.

అక్బరు— మీరు మేవాడుకు సర్వనాశనము చేయుటుదరని యోచింగి కూడనా?

శక్త—అవును. ఎంచింగియు

అక్బరు—అయితే ఆయన మీ కేమియు నుపకారము చేయలేదని యిప్పుడే అంటిరిగదా?

శక్త—ఇది ఉపకార మెట్లగును? నేను అన్యాయముగ నాజన్మభూమి నుండి, నారాజ్యమునుండి నాయధికారమునుండి వంచింపఁ బడి తిని. ప్రతాపుఁడు నన్ను రాజ్యమునకుఁ గొనివచ్చి కొంచెము న్యాయము చేసెను ఇందు ఉపకార మే మున్నది? నే నతని కెందుకు కృతజ్ఞుఁడఁ గావలయును? ఇంతకు నాఅధికారము నాకు రాలేదుగదా. అత డేయధికారముతో మేవాడు సింహాసన మధిష్టించెను? నేనెందు కతనికి ఆజ్ఞావర్తియగు సేవకుఁడఁ గా వలయును? మేమిద్దఱము ఒకతండ్రి బిడ్డలమేగదా! అతఁడు పెద్ద నేను చిన్నఅయిన మాట వాస్తవము. జ్యేష్ఠుఁడ యిన మాత్రమున శ్రేష్ఠుఁడగునా? మా యుభయులలో నెవ్వరు శ్రేష్ఠులో పరీక్షించుటకే నాఁడు వెళ్ళితిమి. హఠా త్తుగ నొకబ్రహ్మహత్య జరుగుటచే అది రుజువు కాలేదు.

ప్రతాపుఁడు నాకంటె తాను శ్రేష్ఠుఁడగుటను రుజువుచేసి నన్ను రాజ్యమునుండి వెడలఁగొట్టినచో నాకు విచారముండదు. అట్లు చేయకయే నన్ను వెడలఁగొట్టెను చాలఅన్యాయము చేసెను. దీనికి బదులు దీర్చుకొనఁగోరుచున్నాను

అక్బరు—(చిఱునవ్వుతో) ప్రతాపునకు మీపై నమ్మకము గలదా?

శక్త—ఆఁ కలదు.

అక్బరు—అగుచో మోసముతో మీ రాతని నేల పట్టింపరాదు? వ్యర్థముగ యుద్ధముచేయుట యెందుకు?

శక్త—ఇది మాత్రము నావలన కాదు. అయితే ఇంక సెలవు పుచ్చుకొందును.

అక్బరు—వినుఁడు. ఇందు బాధ యేమున్నది? యుద్ధము చేయకయే నెత్తురు పాఱింపకయే మనపని చక్కపడుచో ఇందు బాధ యేమి?

శక్త—మీరు నాగరక ముసల్మానులు. మీ కీపన్నాగము లన్నియు బాగుగనుండును. ఇంక మేమో ఆటవికులమగు రాజపుత్రులము. స్నేహము చేసితిమా మా హృదయము కోసి యిచ్చెదము విరోధించితిమా తిన్నగా కత్తి దూయుదుము. పైకి స్నేహముగనుండి లోపలనుండి కత్తి దూయుట మేమెఱుఁగము. రాజపుత్రులు స్నేహసమయమందును రాజపుత్రులుగనే యుందురు. పగతీర్చుకొనునపుడును రాజపుత్రులుగనే యుందురు. నాకు ధర్మముపై విశ్వాసము లేనిమాట వాస్తవము నే నీశ్వరుని ఒప్పుకొనను. సామ్రాజ్యమునకు ద్రోహిని. అయినను నేను రాజపుత్రుఁడనే. రాజపుత్రుల కుచితముగాని పని నావలనఁగాదు.

అక్బరు—అయితే మానసింహుఁ డిట్టివిషయములలో వెనుక ముందు చూడడు. క్షత్రియులలో ఆతఁ డొక్కఁడే తెలివితేటలతో యుద్ధము చేయువాఁడు. ఆతని విజయములలో సగము తెలివితేటలతో సాధించినవే. ఆయన పెక్కుసమయములందు సైని

కబలమును చూపించునేకాని దానిని ఉపయోగించుట చాల అరుదు.

శక్త—ఆయన అట్టులెందుకు చేయఁడు? అట్లు చేయనిచో ఆయన మొగలసేనాపతి యెట్లగును? ఆయన స్థానమున నేను సేనాపతిని అయియుండక పోదునా?

అక్బరు—ఆయనయు రాజపుత్రుఁడే గదా?

శక్త—ఔఁ విన్నాను. ఆయన తల్లిదండ్రులు రాజపుత్రులేయఁట.

(శక్తసింహుని వ్యంగ్యమును అక్బరు గ్రహించియు గ్రహింపనట్టు లుండును.)

అక్బరు—అయితే ఇంక నేమి?

శక్త—గీ॥ అగుట కన్నియు మామిడు లయిన నేమి
సుమధురస్వాద మన్నిటఁ జూడఁగలమె?
రాజపుత్రజులైనమాత్రమునఁ దన్మ
హోన్నతగుణంబు లెల్లరు నొందఁబోరు॥

అక్బరు—మఱియేమి?

శక్త—ఏమున్నది? ఆయన బాదుషా గారికి స్యాలక పుత్రుఁడు. నేనేమియు కాను. ఆయన బాదుషాతోఁ గలసి పెక్కుమారులు పులావు, కోర్మా భుజించినాఁడు. బాదుషాపై ఆతనికి ఆమాత్ర మభిమాన ముండదా?

అక్బరు—(కొంచెమాగి) మంచిది. మీరు వెళ్లి యింక విశ్రమింపుఁడు.

శక్త—చిత్తము (సలాము చేసిపోవును)

అక్బరు—ప్రతాప్! నీతమ్ముఁడు నాపక్షమున నెప్పుడు చేరెనో అప్పుడే నీవు నాగుప్పిటిలోనికి వచ్చినావు. మధ్యమధ్య నాకు ఇట్టి మంచి అవకాశములు లభింపనిచో నే నింత విశాలదేశమును జయింపఁజాలుదునా? మానసింహుఁడు నాకు సాయపడనిచో నేఁడు మొగలుసామ్రాజ్య మింతదూరము వ్యాపింపఁగలదా? అదుగో మహారాజు వచ్చిరి.

(మానసింహుఁడు వచ్చి యక్బరున్నకు సలాము చేయును)

అక్బరు—రండు మహారాజాసాహెబ్!

మాన—సార్వభౌములు నన్ను పిలువనంపిరా?

అక్బరు—అవును. మీరు ప్రతాపసింహుని తమ్ముని శక్తసింహుని చూచితిరా?

మాన—చిత్తము. నే నిప్పుడే దారిలోఁ జూచితిని. నా యెదుట నుండి వెళ్లునంతవఱకు నావంకకే చూచుచు పోయెను.

అక్బరు—నిర్భయుఁడును, తెలివిగలవాఁడుగను గనుపట్టుచున్నాఁడు. మధ్యమధ్య చక్కని యెత్తిపొడుపులు ప్రయోగించుటగూడ బాగుగ నెఱుఁగును. ఈతఁడు ప్రపంచమున స్వార్థమును దక్క వేఱేమియుఁ జూడలేదు. ఇంకను లోహము కచ్చాది. కరగించి పనిలోనికి తీసికొని రావచ్చును.

మాన—బహుశః అతని హృదయమున ప్రతిహింసాసంకల్పము పొడమి యుండనోపు.

అక్బరు—ప్రతిహింస గాదు. ఇతఁడు పగతీర్చుకొనఁ గోరుచున్నాఁడు. ప్రేమయు హింసయు ఈ తరుణహృదయమున నింకను ప్రవేశింపలేదు. ఎవ్వని కెంత యీయవలయునో దమ్మిడీలతో ఈయఁగోరుచున్నాఁడు. ఎవనినుండి ఎంత పుచ్చుకొనవలయునో దమ్మిడిలతోసహా వసూలుచేసికొనఁ గోరుచున్నాఁడు. ఆతఁడు ధర్మమును బాటింపఁడు. గాని తనజాతిపై అతనికి చాల అభిమానము గలదు.

మాన—అగుచో నిపుడు ప్రభువుల హుకుమేమి?

అక్బరు—ప్రతాపుఁడు ఒక మొగలుపశుపాలకుని కొఱతవేసినవార్త వింటిరా?

మాన—లేదు. నేను వినలేదు.

అక్బరు—ఆతఁడు మూడుమాఱులు దండెత్తివచ్చి మూడు మొగలు పటాలముల రూపుమాపిన వార్తయు మీరు వినలేదా?

మాన—ఆఁ ఇదిమాత్రము వింటిని.

అక్బరు—ఈఉన్మత్తసింహ మెంతవఱకు ఇటుల విశృంఖలముగ తిరుగు చుండును? వానిపైకి దాడివెడలుటకు నాకిదియే మంచియవకాశ ముగఁ గనుపడుచున్నది. మీ అభిప్రాయమేమి?

మాన—నే నీవిషయ మాలోచించితిని. నేను షోలాపూరునుండి తిరిగి వచ్చునప్పుడు ఆదారిని వెళ్లి ప్రతాపసింహుని కలసికొందును. ఏవిధముననైనను అతఁడు మనయుచ్చులోఁబడినచో వ్యర్థముగ రక్తముపాఱించుపని యుండదు లేనిచో యుద్ధము తప్పదు.

అక్బరు—మంచిది. మీ అభిప్రాయము చాల ఉచితముగనున్నది ఇదియే మంచిది. మీరు షోలాపూరు ఎప్పుడు వెళ్లెదరు?

మాన—ఎల్లుండి ప్రొద్దున.

అక్బరు—మంచిది. నే నొక యావశ్యకకార్యముపై మిమ్మిచట నొంటరిగ విడిచిపోవుచున్నాను.

మాన—చిత్తము. (అక్బరు పోవును.) నే నిందుకై పూర్తిగాసిద్ధపడియే వచ్చితిని. ఁవ పెండ్లివిషయమై నాయనగారు మాటిమాటికి వ్రాయుచున్నారు. ప్రతాపుని జ్యేష్ఠపుత్త్రుఁడగు అమరునకుదాని నిచ్చువిషయమై ప్రస్తావించెదను. ఆయన ఇందు కియ్యకొనిన చాల బాగుండును, నిష్కళంకమగు మేవాడువంశముతో సంబంధముచేసి యీకళంకితమగు అంబరవంశమును శుద్ధముచేయఁ గలనో లేనో చూతును.

మ॥ మొగలోచ్ఛిష్టములౌ ప్రలోభనములన్ మోహమ్ము రెట్టింప స
ల్పగరానట్టి యకార్యముల్ సలిపి బేలల్ రాజపుత్త్రాధముల్
జగతిన్ దేశముసల్లకత్త్రఖనియౌ సంఘంబుపట్లన్ గడున్
నెగడంజేసిరి దుష్కళంకమును దీనిన్ బాపఁగా శక్యమే॥

మే మెల్లఱము పతితులము కళంకితమగు ఈ విశాలరాజపుత్ర వంశమందు ప్రతాపుని నిష్కళంక శుభ్రపతాక యొకటియే విరాజిల్లుచున్నది. ప్రతాపసింహా! నీవు ధన్యుఁడవు. (ప్రస్థానము)

సప్తమదృశ్యము.

స్థానము—ఆగ్రాలో అక్బరుని అంతఃపురోద్యానము.

సమయము—మధ్యాహ్నము.

(అక్బరుని కన్యయగు మేహారున్నిసా ఒంటరిగా ఒకచెట్టుక్రింద దండగుచ్చుచు పాడుచుండును.)

గీతము

జనరహితంబగు వనమునఁ జేలాంచలమునఁ గూర్చుని హేలన్
ఘనముగ నిజకంఠమ్మునఁ దాల్పఁగ మనమున గ్రుచ్చెద మాలన్
నిజహృదయము సంతోషపెట్టుటకు నే గానము గావింతున్
నిజమనమునఁ గ్రీడింతును నాకిఁక నే సహచరినని యెంతున్
నామనమున నే నవ్వెద నేడ్చెద నన్నె నేను ప్రేమింతున్
నేమమ్మున నను నేనె సదా మన్నింతును సుఖమును గాంతున్

(ఇంతలో నక్బరుమేనకోడలు దౌలతున్నిసా పరుగెత్తుకొని వచ్చును)

దౌలతు—మేహార్! మేహార్! ఇదుగో చూడుము. ఒక పావురముల గుంపు ఎగిరిపోవుచున్నది.

మేహారు—వహ్వా! పావురములగుంపు ఎగిరిపోవుచున్నచో నం దాశ్చర్యమేమున్నది? అందు నన్నేమి చూడమందువు? (మరల పాడును.)

దౌలతు—ఔరా! ఆశ్చర్యజనకము కానిచో దానిని చూడనేకూడదా? ప్రపంచములో ఆశ్చర్యవిషయము లెన్ని గలవు?

మేహారు—ప్రపంచములో ఆశ్చర్యవిషము లెన్నియో కలవు.

దౌలతు—కొంచెము విందును,

మేహారు—(దండ క్రింద ఉంచి గంభీరభావముతో) మంచిది వినుము. ముందు ఈప్రపంచమే ఆశ్చర్యమైన వస్తువు. దీనికి పని లేదు, పాట లేదు. అహోరాత్రములు సూర్యునకు నాలుగుప్రక్కల తిరుగుచుండును. ఇదియెందుకు తిరుగుచున్నదో యెవ్వరు నెఱుఁగరు దీని తర్వాత మనుష్యుఁడును ఒకవింతవస్తువు ముందు వాఁడు ఒకమాంసముముద్దగా జన్మించును. తర్వాత

కొన్ని దినములు వాఁడు ప్రపంచతరంగములలో నిటునటు కొట్టుకొనుచు తిరుగును. తుద కొక్కనాఁడు ఎక్కడనో మునిఁగిపోవును. ఇంక వారి నెవ్వరును వెదకి పైకి తీయఁజాలరు పిసినారులు ధనమును ప్రోవుచేతురు. గాని దాని యానంద మనుభవింపఁజాలరు. ఇది యొకవింత కాదా? లక్ష్మీపుత్రులు తమ ధనమంతయు వ్యర్థముగ నాశనముచేసి చిప్పకట్ట చేతఁబుచ్చుకొని సందుగొందుల ముష్టికిఁ దిరుగుదురు. ఇది అంతకన్న నెక్కువ వింతగాదా! బుద్ధియుండియు మానవుఁడు పెండ్లిచేసికొని తనకు తాను సంకెళ్లువేసికొనును. ఇంక వాఁడు చక్కగా తిననుజాలఁడు చేతులుకాళ్లుకదల్పనుజాలఁడు. ఇది తక్కువ వింతయా?

దౌల...ఆడవాళ్లు మూర్ఖతచేఁ బెండ్లిచేసికొందురు. ఇదియు వింతయేనా?

మేహారు...ఇందు సందేహమేమున్నది? వారికి అన్నవస్త్రములవిషయమై విచారింపవలసిన పనియే లేదు. ఇట్టిస్థితిలో నే నింత గొప్పబాదుషాకు కూతురునై ఒకఅయ్యకాళ్ళపై వెల్లిపడినచో నిదియు నొక వింతయే. నే నిచ్చట నన్నవస్త్రములకు లోపము లేకుండ సుఖముగ నున్నాను ఇట్టి స్థితిలో నే నెవ్వనేని పెండ్లిచేసికొనినచో నాకు తప్పక చికిత్స చేయింపవలసినదే.

నౌలతు—అయితే నీవు పెళ్లిచేసికొనననిరూఢిచేసికొంటివా?

మేహారు—అయితే నే నింతవఱకు నూరక కూర్చుండ లేదు.

దౌల—అనఁగా?

మేహారు—అనఁగా నిదియే. నాకు ఇంతవఱకు పెండ్లికాలేదు. ఇంక నాకు వేతే పని లేదు పాట లేదు. కనుక నిచ్చవచ్చిన పనులెల్ల చేయుచుందును. నిద్రించెదను, కూర్చుందును, లేచెదను, తిరిగెదను, ఆవలించెదను. వ్రేళ్లు విరచెదను నేను కన్య నన్న మాటయే కాని యెప్పుడును ఉమర్ ఖయ్యాము చదువుచుందును. చిత్తచకోరమును ఇంటిచూలములందు చిత్రించుచుందును. అవకాశము చిక్కినప్పుడు ఆలస్యమును విడిచి ప్రాపంచికచిత్ర

ములు చూచుచుందును. మఱియు పురుషులలో నామనస్సున కనురూపుఁడగువాఁడు ఎవ్వఁడేని యుండునాయని ఆలోచించు చుందును. (తలవంచుకొనును.)

దాల—ఊరక ఆలోచించుటయేనా నిర్ణయించుటకూడ నున్నదా? నీకు నచ్చినపురుషుఁ డెవ్వఁడేని దొరకెనా?

మేహ—(గంభీరభావముతో) దాలత్! నీ విట్లడుగుట ఉచితముగాదు నాకు నచ్చినపురుషుఁడు దొరకినను నీకు చెప్పవచ్చెదనా?.

దాల—ఎందుకు చెప్పవు? నేను నీకు ఆంతరంగికురాలను.

మేహ—దాలత్! నీస్నేహము నామాంసకండరములఁ జీల్చుకొని లోవలకు చేరినమాట వాస్తవము. కాని యెముకలలోఁ బ్రవేశింప లేదు. అది యెముకలలో ప్రవేశింప దగినవిషయము—ఈశరీరములో మఱియొకశరీరమున్నచో నిదిదానికి చేరిన విషయము. గనుకనే నీకు స్పష్టముగా చెప్పఁజాలను నీవు అంతగా పట్టు పట్టినచో నామనోహరుని రూపమును సాంకేతికముగ కొంచెము చెప్పగలను.

దాల—మంచిది చెప్పుము, నీమనోహరుని నేను గుర్తింపఁగలనేమో.

మేహ—మంచిది వినుము. నామనోహరునిరూప మెట్టిదో చెప్పెదను. ముక్కు—ఉన్నది. చెవులు—నేను బాగుగా చూడలేదు గాని అయినను తప్పక ఉండవచ్చును. అతఁడు నవ్వినపుడు ముత్యాలు రాలినను రాలకున్నను పండ్లుమాత్రము తప్పక బైట పడును. అత డెప్పుడేని ఏడ్చినచో ఆయేడ్పుచే అతనియంద మేమియు హెచ్చదు. అతఁడు పాడుచున్నట్లును తెలియదు. నామనోహరుని యాకారము ఇంతవరకు నక్షావేసి చెప్పితిని తక్కినదినీ వూహించుకొనుము

దాల—ఇప్పుడు నాకు బాగుగ తెలిసినది నిజముగ నీప్రియుఁడు నా కన్నులయెదుటఁ గనుపట్టుచున్నాడు.

మేహ—నీ వతనిని చూచినఁ జూడుము. కాని నీ వతనిని ప్రేమింపకుము సుమా. నీవు ప్రేమించినను అంత పెద్ద హాని లేదు.

బాదుషాగారి అంతఃపురమున నూర్గురుకంటె నెక్కువ రాణు లుండుట నీవు చూచితివిగదా. కాని నీ పతనిని ప్రేమింప కుండిన కొంత బాగుగ నుండును.

(బట్టలు దులుపుకొనుచు మెల్లగా సలీము ప్రవేశించును.)

సలీము—మేహార్! నీ విచట నేమి చేయుచుంటివి?

మేహ—ఈదాలత్ ప్రపంచములోని ఆశ్చర్యవస్తువుల జాబితా నడు గఁగా అది వినిపించుచుంటిని

సలీము—నేనును ఆజాబితా విందును

మేహారు—మరల చెప్పెదను. దాలత్! నీవు చెప్పుము. నీ కంతయు జ్ఞాపక ముండియుండవచ్చును. ఇంతసేపుండి నీకు చిలుకకువలె చదివించితిని ఏమి చదివించితినో నాకు జ్ఞాపకమే లేదు. సలీమ్! నాకల్పనాశక్తి మంచిదేకాని జ్ఞాపకశక్తి లేదు. నేను దులాబీఖర్చుగల ఒకవర్తకుని వంటిదానను. వ్యాపారము చేసె దను. బాగుగ సంపాదించెదను. అయితే ఖర్చుపెట్టెదను కాని దాలతు తెలివితేటలు గలది. వ్యాపారము ఎక్కువచేయ లేదు గాని బాగుగ కూడఁబెట్టఁగలదు ఆఁ ఆఁ. బాగుగ జ్ఞప్తికి వచ్చినది. లోభులు మరణాంతమువఱకు బాగుగ వ్యా పారముచేసి తమపుత్రులకు, పౌత్రులకు ఖర్చుచేసికొనుటకు ద్ర వ్యము కూడఁబెట్టెదరు. ఇదియు నొక వింత మాటయని నేను చెప్పుచుంటిని.

దాల—ఇది వింతమాట యెట్లు సలీమ్?

మేహారు—ఏమి ఇది వింతమాటకాదా?

సలీము—ఎందుకు కాదు? కాని నీవుచెప్పిన వింతమాటలన్నిఁటిని మిం చిన మరియొక వింతమాట గలదు.

మేహారు...అదియేమి?

సలీము...అక్బరుబాదుషాతో రాణాప్రతాపసింహుని యుద్ధము ప్రపంచ ములో సర్వోత్తమవీరుడైన బాదుషాతో ఒక చిన్న జమీం దారు యుద్ధము. ఇంతకంటె నింక ఆశ్చర్యమేమి యుండును.

దాల... ఇది వెఱ్ఱితనము.

సలీము .. నేనును మొదటనిట్లే యనుకొంటిని. కాని కొలఁదిదినముల క్రిందటనే యతఁడు మొగలుసైన్యమును చెల్లాచెదరు చేసిన సంగతి చూడ ప్రతాపుఁడు వెఱ్ఱివాఁడు కాడని తెలిసికొంటిని. నూరుగురు రాజపుత్రులు ఏనూరు మొగలుల డీకొనుట యేగాక వారిని ఓడించిరి.

మేహ—అయితే మీరుమాత్రము ఒకమాఱు బాగుగా పోరాడివారి నెందు కోడించరాదు?

సలీము—ఈమాఱు అట్లే యగును. మహారాజ మానసింహుఁడు షోలాపూరునుండి తిరిగివచ్చునపుడు దారిలో ప్రతాప సింహుని కలసికొని ఆతనిసేనాబలమును బాగుగచూచి వచ్చును. ఏవిధముసైనను ప్రతాపుఁడు మనకు లోఁబడి పన్ను ఇచ్చుటకు ఒప్పుకొనిన సరే, లేనిచో యుద్ధము తప్పదు.

మేహ—నీవును యుద్ధమునకు వెళ్లుదువా?

సలీము—నేను యుద్ధమునకు వెళ్లక కుంటివానివలె నింట కూర్చుందు ననుకొంటివా?

మేహ—అయితే నీతో నేనును వచ్చెదను.

సలీము—నీవా!

మేహ—నీకాశ్చర్యమెందుకు?

దాల—అయితే నేనును వచ్చెదను.

సలీము—మీరు యుద్ధమునకు వచ్చి యేమి చేయుదురు?

మేహ—నే నెందుకు రాను? నీ వెప్పుడును మావద్దకువచ్చి అట్లుయుద్ధము చేసితిని ఇట్లు యుద్ధము చేసితిని వానిని ఓడించితిని వీనిని ఓడించితిని అని బడాయిలు కొట్టుచుందువు నీవు నిజముగ యుద్ధము చేసెదవో లేక మెదలక కూర్చుందువువో నేనుచూచెదను.

సలీము—నేను యుద్ధము చేయనిచో యుద్ధము లేకయే జయపరాజయ ములగునా?

మేహరు—నేనట్లే తలఁచుచున్నాను. యుద్ధములో ఈవైపువాళ్లు ఆవైపు

వాళ్లు ఫిరంగులు పుచ్చుకొని నిలఁబడుదురు. తర్వాత ఒకరూపా యితీసి ఒకపక్షమువాళ్లు ఒకవైపును వేఱొక పక్షమువాళ్లువేఱొ కవైపును తీసికొందురు. ఒకఁడు ఆరూపాయిని గిరగిరత్రిప్పిపైకి ఎగురవేయును. నేలపైఁబడునప్పుడు ఎవరివైపు పైకి ఉండునో వారు గెలిచినట్లును, ఎవరివైపు క్రిందికి ఉండునో వారు ఓడినట్లును ఎంచఁబడుదురు.

సలీము—అయితే జనులు ఇంత సైన్యమును ఎందుకు తీసికొనిపోదురు?

మేహ—జనులకు తమగొప్ప చూపించుటకు, లేనిచో నీవంటి బక్క సిపాయీలు ఏమి యుద్ధము చేసెదరు? ఏమి దౌలత్?

దౌలతు—నిజము

మేహ—ఇంకను వీరి పాలదంతములైనను ఊడలేదు. పాపము వీరేమి యుద్ధము చేసెదరు?

సలీము—అయితే నేను ఎట్లు యుద్ధము చేసెదనో మీరు చూడఁగోరు చున్నారుకాదు?

మేహ—అవును. ఏమి దౌలత్?

దౌల—అవును.

సలీము—మంచిది అయితే మీకు చూపించెదను. బాదుషాగారి ఆజ్ఞ తీసికొని మిమ్ము గొంపోవుదును. నేనుయుద్ధము చేయుదునో లేదో మీరు చూతురుగాక. (ప్రస్థానము.)

మేహ—హా..హా...హా...సలీమునకు కొంచెము పురిఎక్కించిఅప్పుడు తమాషా చూడవలె. ఈతఁడింత గొప్ప మేధావంతుఁడు. ఎవ్వ డేని కొంచె మేమేని అన్నచో ఇంక ఒడలు తెలియదు.

(ఒకదాసి ప్రవేశించును)

దాసి—బాదుషాగారు దయచేయుచున్నారు (ప్రస్థానము)

మేహ—ఇప్పుడు బాదుషాగా రెందుకు వచ్చుచున్నారు?

దౌల—నేను వెళ్లెదను.

మేహ—ఎక్కడకు వెళ్లెదవు? నిలువుము. మనము వారితో విన్నపము చేసికొందము.

దౌల—లేదు నేను వెళ్లెదను.

మేహ—అబ్బా! ఇంత పిరికిదానవేమి? బాదుషాయన పులియా? యెలుఁగుబంటియా?

దౌల—లేదు నేను వెళ్లెదను. (పర్రిస్థానము)

మేహ—దౌలతుకు బాదుషాయన నింత భయమెందులకో తెలియదు. కాని నా కేమియు భయము లేదు. బయట ఆయన బాదుషాయగుఁగాక. ఇంటిలో ఆయన నెవరు లెక్క సేతురు?

(అక్బరు ప్రవేశము)

అక్బ—మేహర్! నీ విచట నొంటరిగా నేల కూర్చుంటివి?

మేహ...(సలాము చేసి) అవును. ఇప్పుడు నేను ఒంటరిగానే యున్నాను దౌలతు ఇంతదనుక నిచ్చటనే యున్నది. మీరు వచ్చుచున్నారని విని పారిపోయినది.

అక్బ.. ఎందుకు?

మేహ...ఎందుకో బాదుషాకు శత్రువులు భయపడవలెనుగాని మాకెందుకు భయము?

అక్బరు ..(నవ్వి) అయితే నీవు నాకు భయపడవా?

మేహ.. ఎంత మాత్రము లేదు. నాకనులకు మీరు మనుష్యులే. మీరు హిందూదేశమునకు చక్రవర్తులయిన నేమి టర్కీసుల్తానులైన నేమి? నా కెందుకు భయము? నేను మిమ్ము తప్పక గౌరవింతును

అక్బ—అది యెందుకు?

మేహ—తండ్రియనియు వయస్సున బెద్దవార లనియు

అక్బ—మేహర్! నీవు చెప్పినది యథార్థము. మీరే నాకు భయపడుచో ఇంక నన్ను ప్రేమించువా రెవరు? అయితే నాకీమాట చెప్పుము. సలీము ఇచ్చటకు వచ్చినాఁడా?

మేహరు—అవును, జ్ఞాపకము చేసితిరి. రాణా ప్రతాపసింహునితో యుద్ధము జరుగునా?

అక్బ—జరుగవచ్చును. మానసింహుఁ డిపుడు ఆవైపునకే వెళ్లుచున్నాడు. ఆయన తిరిగివచ్చిన పిమ్మట నిశ్చయము తెలియును.

మేహ—అయితే సలీముకూడ యుద్ధమునకుఁబోవునా?

అక్బ—అవశ్యము. మానసింహుఁ డెల్లకాలము బ్రతికియుండఁడుగదా. అందుకని సలీము కన్నిసంగతులు నేర్పవలయును.

మేహ—అయితేనాది యొకమనవియున్నది.

అక్బ—ఏమి?

మేహ—ముందు నా కీసంగతి చెప్పుడు. మీరు దానిని నెరవేర్చెదరా?

అక్బ—ఈమాట నేను చెప్పవలయునా! మేహర్! ఈప్రపంచములో నీ కీయరాని దేమున్నది?

మేహ—నేనును గాలతును ఈయుద్ధములోనికిఁ బోయెదము. ఇదియే నామనవి.

అక్బ—ఏమి! మీరు యుద్ధములోనికి వెళ్ళి ఏమి చేసెదరు?

మేహ—ఏమి! మేము మనుష్యులము గామా? ఎప్పుడు నింటిలో ఖైదీలమై యుండుటయేనా మాపని? మాకుమాత్రము దేనిమీదను కోర్కెయుండదా?

అక్బ—ఇదియేటికోరిక? ఇది యెచటనైనఁ గలదా?

మేహ—ఎందుకు లేదు? మీరు పట్టుపట్టవచ్చునుగాని మీ బాలిక పట్టగూడదా?

అక్బ—నేనెప్పుడు పట్టుపట్టితిని?

మేహ...పట్టితిరి. ఆనాఁడు మీరు చిత్తూరు జయించివచ్చినపుడు నన్ను హిందూశాస్త్రములలో ఏధార్మికవీరుఁడేని శత్రువును కపటముతో జయించినకథ యున్నఁ జెప్పుమని యడిగితిరి. అప్పుడు నేను వాలి ద్రోణవధ వృత్తాంతము చెప్పఁగా మీమనస్సు కుదుటఁబడినది.

అక్బ—బాగున్నది. దానికిని దీనికిని సంబంధమేమి?

మేహ—ఉండనిండు లేకపోనిండు. నేను యుద్ధమునకు తప్పకవెళ్ళెదను.

అక్బ—ఇది యెట్లుజరుగును?

మేహ—జరుగునో జరగదో చూడుఁడు.

అక్బరు—మంచిది. ఇప్పు డీసంగతి కట్టిపెట్టుము. అసలు యుద్ధము జరిగిన అప్పుడు చూచుకొనవచ్చును. (ఇద్దఱు నిష్క్రమింతురు.)

## అష్టమ దృశ్యము

స్థానము—ఉదయసాగరతీరము. సమయము—మధ్యాహ్నము.

[ఒకప్రక్క మానా, గోవిందసింహుఁడు, రామసింహుఁడు, రోహిదాసు మున్నగు రాజపుత్రులును ప్రతాపుని మంత్రియగు భామాషా యును రెండవ ప్రక్క మహారాజ మానసింహుఁడును నిలచియుందురు.]

మానసిం—నాస్వాగతమునకై రాణాగారు ఇంత పెద్దయేర్పాటు చేసి నందులకు నేనెంతయు ననుగృహీతుఁడను.

భామాషా—మహారాజా! ఇప్పుడు మేమున్నస్థితిలో తమకు తగినస్వాగత మెక్కడఁజేయగలము? అయినను అంబరు మహారాజుగారు మాయీస్వల్పాతిథ్యము నే స్వీకరించి మాలోపములను క్షమించెదరని తలఁచుచున్నాము

మానసిం...మంత్రిగారూ! రాణాప్రతాపసింహుని ఆతిథ్యము గ్రహించుట నేఁడు ప్రతిరాజపుత్రునకును గౌరవ విషయము.

గోవింద.. మహారాజా! మీరు చెప్పినదెంతయు సత్యము.

మానా—మహారాజుగా రెప్పుడును నోటితోమాత్రము రాణాగారిని పొగడుచుందురు. క్రియమాత్రము వారిపూర్వ శత్రులగు మొగలులకు దాస్యముచేయుట.

రోహి—మానా! నీ పూరకుంఃడుము మానసింహుఁడు అక్బరునకు స్యాలకపుత్రుఁడు. ఆయనపై మనమింతకంటె వేఱు ఆశ ఎట్లు పెట్టుకొనఁగలము?

భామాషా...ఎవ్వరేని యఁగుగాక. నేఁడు ఆయన మనకు అతిథి. మహారాజా! మీరుమానామాటలు లెక్కసేయకుఁడు

మానసి— లేదు మంత్రిగారూ! నే నిట్టిమాటలను లెక్కసేయను. అయినను వారుచెప్పినది యథార్థమే. కాని నేను అక్బరుబాదుషాకు స్యాలకపుత్రుఁ డగుటలో నాదోషమేమియు లేదని మాత్రము జ్ఞాపకముంచుకొనుఁడు. అందు నేను చేసిన దేమియు లేదు. అయితే అక్బరుపక్షమున నేను యుద్ధము చేయుచుంటినని

మాత్రము నే నొప్పుకొందును. అక్బరునకు విరుద్ధముగ శస్త్ర
మును బట్టుట విద్రోహముగాదా?

గోవిం... మహారాజా! అది యెట్లు?

మాన.. ఇప్పుడు భారతవర్షమునకు ఏకచ్ఛత్రాధిపతి అక్బరేకదా?

మానా. ఏయధికారముచే?

మాన... శక్తియధికారముచే. పలుమాఱులు యుద్ధక్షేత్రమునభరతవర్ష
మున కధిపతియెవ్వరో నిశ్చయమాయెను

రామ. . కాని మహారాజా! యుద్ధ మింకను సమాప్తము గాలేదు.

శా॥ స్వాతంత్ర్యార్థముసల్పు యుద్ధమెప్డుడున్ సాంతంబు గాదంచు వి
ఖ్యాతంబే, యొకవర్షమే యనఁగనేలా? నూరువర్షంబులే
నోత్సాహముగాగ సాగుచునెయుండున్ దీనిఁ గావించు సు
స్వాతంత్ర్యమ్ము పరంపరాధిగ మెంచన్ బుత్రపౌత్రాళికిన్.

మానసిం . కాని ఇది యంతయు వ్యర్థము ప్రచండబలశాలియగు అక్బ
రునకు విరుద్ధముగ యుద్ధముచేసి రక్తపాతము గావించుటచే
ఫల మేమి?

రామ.. మహారాజా!

గీ॥ తనముబుద్ధికొలఁది యోజనము చేసి
కర్మ మొనరించుటే విధిగాని, నరుఁడు
తత్ఫలాఫలబాధ్యత దాల్పఁబోడు
సర్వమునకు విధాత యీశ్వరుఁడె కలఁడు.

మానసిం—ఫలాఫలముల విచారింపక యేపనియేని చేయుట మూర్ఖ
తగాదా?

గోవిం—మహారాజా! ఇదియే మూర్ఖత్వ మగుచో ప్రపంచములోని
ఉచ్చప్రవృత్తులయు మహత్త్వము యొక్కయు సగమువంతు
ఈమూర్ఖత్వమందే దాఁగియున్నది. ఈమూర్ఖత్వముచేతనేగదా

సీ॥ ప్రాణముల్ కత్తికి బలియిచ్చునేకాని
సాధ్వి సతీత్వ రక్షణము విడదు

మండునిప్పులఁబడి ప్రమ్గ్గిమండును గాని
తల్లి గానీదు సంతతికిఁ గీడు
తలదీసికొనుటకుఁ దలపడునే గాని
హిందువు కల్మా పఠింపఁబోడు
విమతులయసికి వక్షము సాఁచునే కాని
వీరుఁడు వీపు చూపింపఁబోడు
గీ॥ ప్రాణములపైని తీపిని బాసి యిటుల
నైజకర్తవ్యచరణ నీరేజములను
బ్రదుకు ధారనుబోయు మూర్ఖత్వమేని
యెల్లజిలలాటమందు లిఖింపఁబడునె॥

మహారాజా! రాణాగారి దారిద్ర్యమందున్న యీమహత్త్వము, వారి యాత్మత్యాగమందున్న యీగౌరవము అక్బరు పాదధూళి ధూసరితమగు మీసువర్ణకిరీటమందు లేదు. మానసింహా! మీ రెవరేని కానిండు, తుదకు హిందువులేకదా? హిందువులయ్యును మీరు ఇట్లు చెప్పుచుంటిరే! మీకు ధిక్కారము! మీకు ధిక్కారము!

(అమరసింహుని ప్రవేశము)

అమర — మహారాజా! తాము స్నానము చేసియున్నచో భోజనమును గావించి మమ్ము గారవింపుఁడని నాయనగారు చెప్పుచున్నారు.

మాన — రాణాగా రేరీ?

అమర — వారు కొంచె మస్వస్థతగానున్నారు. తలనొప్పిగా నున్నది. వారు నేఁడు భోజనము చేయరు. తమభోజన మైనపిమ్మట తమ్ముఁ గలసికొందురు.

మాన — అమరసింహా! మంచిది. నాకంతయుఁ దెలిసినది. నీవు వెళ్ళి రాణాగారితోఁ జెప్పుము. వారి యస్వస్థతకుఁ గారణము తెలిసినది. వారు నాపంక్తిని గూర్చుండి భుజించుట కిష్టపడుట లేదు. ఇన్నినాళ్ళనుండియు వారిగౌరవమును గాపాడుటకై నా గౌరవమును బోఁగొట్టుకొనుచుంటిని. బాదుషా భృత్యుఁడనయ్యు ఇన్నినాళ్ళవఱకు నేను రాణాకు విరుద్ధముగాఁ గత్తి పట్టలేదు.

వారితోఁ జెప్పుము నేటినుండియు నేను వారికి శత్రువు నైతిని.

గీ॥ మఱలఁ జను డెంతు తలనొప్పిమందుతోడ
 కొలఁదినాళ్లలో స్వాస్థ్యమ్ము కలుగఁగలదు
 నుప్రతసింహమ్ము మేల్కొల్పఁ జూచునటుల
 మానసింహుని కెవఁ డవమాన మెంచు?

నే నాతని గర్వమును జూర్ణము సేయనిచో నా పేరు మానసింహుఁడు గాడు.

(ప్రతాపసింహుఁడు ప్రవేశించును)

ప్రతాప—మంచిది మహారాజా! మంచిది, అట్లే యగుగాక. సాక్షాత్తు అక్బరునకే శత్రువగు నేను ఆతని యొక్క సేనాపతి శత్రుత్వమునకు వెఱవను. మఱియు జాతిభ్రష్టుఁడవగు నీపంక్తిని గుడుచుట కిచ్ఛగింపకయే నేను అస్వాస్థ్యమిషను బన్నినమాటయు వాస్తవము.

సీ॥ ఎవ్వాఁడు మొగల రాజేంద్రుప్రీతికి వంశ
 గౌరవం బెల్లను గంగఁ గలిపె
 ఎవ్వానిరీవిలో నిమిడియున్నది మొగల్
 బాదుషాదర్పిత పాదరజము
 ఎవ్వాని యవనవాహిని పతిత్వమునకుఁ
 బ్రబలహేతువు మ్లేచ్ఛబాంధవంబు
 ఎవ్వాఁడు గరమున హేతి దాల్చు ఫలంబు
 మాతృభూమి ప్రాణ మారణంబు

గీ॥ ఆకులాంగార మామాతృహంతకుండు
 నాజఘన్యుఁడు నానీచుఁడైన మాన
 సింహుఁ డొకమానిసే గ్రామసింహ మతఁడు
 వాని పొత్తునఁ గుడుచుట పాడె నాకు॥

నీవు నా కతిథివై పోతివి. లేనిచో సార్వభౌముని స్యాలకపుత్రుఁడగు మహారాజ మానసింహుఁ డెక్కడో దీన దరిద్రుఁడగు ప్రతాపసింహుఁ డెక్కడో యిచ్చటనే తేలెడిది. నీ వెపుడు కోరిన అప్పుడే నన్ను సమరక్షేత్రమునఁ గాంచఁగలవు.

మాన—మంచిది. అట్లే యగుఁగాక నేను త్వరలోనే మిమ్ము యుద్ధ క్షేత్రమునఁ గలసికొందును.

గీ॥ చీమ కవసానకాలమ్ము చేరువగుడు
రెక్కలు జనించునటు పోగరెక్కె నీకు
కాలమది మూడెఁ బోరునఁ గాచికొనుము
మానసింహుని సునిశిత మార్గణముల॥

రోహి—వీలగుచో మీమేనత్తమగనిని అక్బరునికూడ వెంట తీసికొని రండు

ప్రతా రోహిదాసూ! ఊరకుండుము.

(మానసింహుఁడు క్రోధముతో నిష్క్రమించును.)

ప్రతా—సోదరులారా! ఇన్నినాళ్లనుండి మనము గావించిన సంగ్రామ కృషికి ఇప్పుడు పరీక్షాదినము వచ్చినది. నేఁడు నేనునాచేతులలో నంటించిన అగ్నిని వీరరుధిరప్రవాహముచే నార్పెదను. నాఁడు మీరుయుద్ధములో నోడినను గెలిచినను మొగలులకుతలవంచమని చేసిన ప్రతిజ్ఞ జ్ఞాపకమున్నదా? చిత్తోరు నుద్ధరించుటకై అవసర మగుచో ప్రాణము లర్పించెద మని నాఁడు మీరు చేసినప్రతిజ్ఞ జ్ఞాపకమున్నదా?

అందఱు—ఆఁ రాణాజీ! జ్ఞాపకమున్నది.

ప్రతా—మంచిది. అగుచో నింక యుద్ధమునకు సన్నద్ధులగుఁడు.

అందఱు—రాణాప్రతాపసింగుకు జై

శ్రీ

# రాణా ప్రతాప సింహ

## ద్వితీయాంకము

### ప్రథమదృశ్యము

స్థానము—పృధ్వీరాజు అంతఃపురము సమయము—రాత్రి

[పృధ్వీరాజు మంచముపై పరుండియుండును. ఎదుట జోషీబాయి నిలఁబడియుండును.]

జోషీ—ఇప్పుడు అక్బరునకును రాణాప్రతాపసింహునకును యుద్ధము ప్రారంభమైనది. ఒకవైపున ఒకచిన్న రాజ్యమున కధిపతి. రెండవవైపున ప్రపంచములో సర్వాధికుఁడగు చక్రవర్తి.

పృధ్వీ—ఎంత సుందరదృశ్యము! ఎంత చక్కనిభావము! ఈ విషయమునగూర్చి నే నొకపద్యము వ్రాయవలయు ననుకొంటిని.

జోషీ—మీరు రాజకవులుగదా. మీకవిత్వమున సమ్రాట్టునే ప్రశంసించెదరు.

పృధ్వీ—బాగున్నది! నేను సమ్రాట్టును ప్రశంసింపనా? వారు భారతవర్షమునకు సార్వభౌములు. అందును నేను వారిద్రవ్యముచే నుదరము పోషించుకొనుచున్నాను ఇది కలియుగమే అనుకొనుము. అందుకని నేను కృతఘ్నత వహింపుదునా?

జోషీ—నిజముగ నిది కలియుగమే. కలియుగమే కాకున్న

సీ॥ అల్పప్రతాపుని తమ్ముఁడగు శక్తసింహుఁడు
సోదరు సాధింపఁ జూచునా? కా

రాణాకు భ్రాతృపుత్రకుఁడై మహాబలు
 మొగలదాస్యమ్మునఁ దగులునొక్కొ
ఇందాక నెటొ తలయెత్తినమేవాడు
 మానసింహుఁడు గూల్పఁ బూనునొక్కొ
బికనేరువిభుఁడు పృథ్వీరాజు మ్లేచ్ఛులౌ
 మొగలుల నీరీతిఁ బొగడునొక్కొ
గీ॥ ఆత్మగౌరవమున కిక్కయైన రాజ
 పుత్రకులమునఁ బుట్టియు మొగలువంచఁ
 జేరి మాతృభూమికి నెగ్గుచేయుటరయ
 కాలమహిమమ్ము గాకున్నఁ గలదె వేఱు!

ఆహా! చంద్రకవి చెప్పినటుల హిందువులకు ముఖ్యశత్రువులు హిందువులే

పృథ్వీ—నీవు చెప్పినది నిజము హిందువులకు ముఖ్యశత్రువులు హిందులే. (కొంచెము విచారించి) ఆఁ! నిజము హిందువులకు ముఖ్యశత్రువులు హిందువులే నిజము. నిజము.

(పృథ్వీరాజు మంచముదిగి ఇటునటు తిరుగుచుండును జోషీబాయి మెదలక నిలఁబడి యుండును.)

పృథ్వీ—ఈవిషయమున నొకచక్కని పద్యము వ్రాయవచ్చును. హిందువులకు ముఖ్యశత్రువులు హిందువులు! దీనికి ఒకచక్కని యుపమాన మీయవచ్చును. మనుష్యునకు సింహము, పులి, పాము డేగమున్నగు ననేకశత్రువులుందురు కాని మనుష్యునకు ముఖ్యశత్రువు మనుష్యుఁడే. సింగము, పులి అడవులలో నుండును. పాము కన్నములో నుండును. డేగ ఆకాశమున నుండును. వీని శత్రుత్వము మనుష్యున కంత హానికరము గాదు కాని మనుష్యులు ద్వేషించుకొనినచో చాల హాని గలదు. అట్లు గానిచో అహంజ్ఞానమునకు ముఖ్యశత్రు వహంకారమనియుఁ జెప్పవచ్చును. అట్లుగానిచో—

జోషీ—మీజన్మమంతయు నిటుల నుపమల వెదకుటయందే కడపెదరా?

పృథ్వీ—ఇందు హాని యేమున్నది? ఇది చాల గొప్పకార్యము. ఉపమలు ప్రపంచములో నెన్నియో గూఢతత్త్వముల విశదీకరించును. మఱియు నుపమలు వాస్తవికప్రపంచమందును, మనోరాజ్యమందును సర్వత్ర వికాసము ఒక్కవిధముననె ప్రవహించుచున్నటులఁ జూపించును. వాని సంబంధముల నెల్ల చూపించువాఁడే ఉత్తమకవి. ఆసంబంధముల నెల్లఁ జూపించుట కుపాయము ఉపమ యొకటియే. కాళిదాసు సర్వోత్తమకవిగా ఎందుకు గణింపఁబడుచున్నాఁడు? ఈఉపమా ప్రభావముననే ఉపమా కాళిదాసస్య! ఆహా! కాళిదా సెంత గొప్పకవి! కాళిదాసూ! నీకు కోటినమస్కారములు. అయితే జోషీ! బాదుషాదర్బారు విషయమై నేను క్రొత్తగా వ్రాసిన పద్యమును నీవు వినలేదా? మంచిది వినుము

జోషి—స్వామీ! మీరింక నిట్టి నిస్సారకవిత్త్వమును వ్రాయుట విడువుఁడు.

పృథ్వీ—(క్రొంచెము సేపు నిలఁబడి (గుడ్లు పెద్దవిచేసి) నన్ను కవిత్వము వ్రాయుట మానుమందువా? ఇంతకంటె కత్తిపెట్టి నాకుత్తుక గోయరాదు? ఔరా! నన్ను కవిత్త్వము వ్రాయుట మానుమందువా?

జోషి—మీరు క్షత్రియులరు, బికనేరు మహారాజగు రాయసింహునకు సోదరులరు కాని యిపుడు బాదుషాను బొగడు బట్టురాజులైతిరి. అసారవచనరచనయందే మీరీ దుర్లభమానవజీవితమును గడపుచుంటిరి మీకు లజ్జ యగుట లేదా?

గీ॥ మాతృదేశ స్వతంత్రతాభూతికై ప్ర
తాపుఁ డొకవంక హృదయరక్తమును గార్ప
క్షత్రియుఁడవయ్యు తుచ్ఛభోగములఁ గోరి
యిచట జీవితముం బుచ్చు టుచితమగునె॥

పృథ్వీ—(పచారు చేయుచు) 'భిన్నరుచిర్హి లోకః' ఇదియు నాకాళిదాసు చెప్పినదే. జనులకు రుచి ఒక్కవిధముగా నుండదు. ఒక

నికి సంగీతము పాడుట యిష్టము. ఒకనికి వినుట యిష్టము. ఒక రికి వంటచేయుట యిష్టము. ఒకరికి తినుట యిష్టము. ప్రతా పునకు యుద్ధముచేయుట యిష్టము. నాకు పద్యముల్వ్రాయుట యిష్టము. ప్రతాపుఁడు కత్తిపట్టినాఁడు. నేను కలముపట్టినాను.

జోషి—ఆహా! ఎంతఘనకార్యము అయితే మీరీకావ్య ప్రపంచములో అసార విషయముల కసారసాదృశ్యముల వెదకుట యందే మీ జీవితమును గడుప నిశ్చయించుకొంటిరా?

పృథ్వీ—అన్నమాటయే. కాళిదాసు, భవభూతి, మాఘుఁడు పోయిన మార్గముననే నేను పోఁగోంటిని. ఇందు నేను సిగ్గుపడవలసిన సంగతి నాకేమియు గోచరించుటలేదు. కవిత్వము వ్రాయుట యేమియు చెడ్డపని కాదుగదా?

జోషి—చెడ్డపని గాదు కాని దానికిది సమయముగాదు.

సీ॥ తనుఁగాచు దిక్కును గనక భారతమాత
యెలుఁగెత్తి యొకవంక నేడ్చుచుండ
సర్వధర్మముల శ్రేష్ఠమగు హిందూధర్మ
మొకచిక్కి నాశమ్ము నొందుచుండ
రాజపుత్రైక శరణ్య మార్యప్రతిష్ఠ
యొక క్రేవఁ దుది యూర్పు నూర్చుచుండ
భారతవీరుల బాహాబలం బాత్మ
హత్యకై యొకవంక నడరుచుండ

గీ॥ కత్తిపట్టెడు చేతను గలముపట్టి
రణమున జయప్రశస్తుల వ్రాయుటుడిగి
మొగలుల ముఖస్తుతుల వ్రాసి ప్రొద్దుపుచ్చు
నుత్తమ క్షత్రియున కిది యుచితమగునె?

కవిత్వము వ్రాయుటే నీ కభిమతమగుచో

సీ॥ విద్యుత్ప్రవాహగర్భితమైన భావమ్ము
భారతీయాత్మలఁ బరుగులెత్త

ప్రావృట్పయోదగర్జనబోలు బాష హిం
దువుల యీనాటి నిద్దుర వారింప
వడగట్టి దివిచిన వరవీరరస మార్య
హృదయమాలిన్యమ్ము నెల్లఁ గడుగ
నూత్నచైతన్యమ్ము నొసఁగు సంగీతమ్ము
జాతి నెల్లను నొక్కచక్కిఁ జేర్ప

గీ॥ మానవులు మానవత్వము మగుడఁ బూన
న్యాయహస్తము రాజ్యదండమును దాల్ప
వైభవ యధర్మమకుటమ్ము నేలఁగూలఁ
బాప మడుగంట నొక్క కబ్బమును బాడు॥

సీ॥ ఎవ్వానిగీత మాలించి త్రింశత్కోటి
గళములు జయరవమ్ములఁ బొనర్చు
ఎవ్వానిపాటకు హిందులస్వాతంత్ర్య
లేకస్వరమ్ము వహించి మ్రోయు
ఎవ్వానియుపదేశ మెల్ల భారతమాతృ
సుతులఁ గర్తవ్యవిజ్ఞులను జేయు
ఎవ్వానియుద్గార మెలమి నార్యులకతీ
త్జ్ఞాపనమున నుత్సాహమొసఁగు

గీ॥ అట్టి రాష్ట్రీయకవియె పూజార్హుఁడెందు
వానిజన్మంబు ధన్యమై వఱలుచుండు
బొల్లుకైతలఁ బొట్టలఁ బోసికొనెడు
కవులుఁ గవులేని యింకఁ గాకవులుఁ గవులె॥

నాధా! అట్టి గీతమును గాని కావ్యమునుగాని వినిపింతు రేని నేనును మనసార్గ్గవిందును

పృధ్వీ—అనఁగా నేను కొఱతవేయఁబడగా నీవు కనులారఁ జూచుచు నుందువు అనియే కాదు?

జోషీ—అయ్యో! నాధా! మీకింత ప్రాణభయమా! మీరు మీప్రాణములను దుచ్ఛముగనెంచిగీతమును బాడఁజాలనివో నింక మీరు

గీతము వ్రాయఁబనిలేదు దేశమును, జాతిని, ధర్మమును, మను ష్యత్వమును సర్వమును విడిచి అహోరాత్రములు యవనస్త్రూ ట్టును బొగడుచుండుటయా! ఆహా! అక్బరు మీకేమి మందు మాకులఁ బోసి ఈ విధముగ తనదర్బారులో "చిత్తము చిత్తము" అనుటను నేర్పినాఁడు?

పృథ్వీ—ఇదుగో ఇప్పుడు నీవు తొందరగా చెప్పిన ఈ మాటలన్నియు కొంచెము అటుఇటు మార్చి ఒకవృత్తములో నిమిడ్చిన నొక చక్కని కబ్బమగును (తలయూచి) ఎంతచక్కని భావములు!

జోషీ—మీతో మాట్లాడుటయే వ్యర్థము.

పృథ్వీ—తెలిసికొంటివిగదా? ఇంక నెప్పుడు నిట్టివ్యర్థప్రలాపమును జే యక నాకు తృప్తికరముగ చక్కనివంట తయారుచేయించుము. పోయి వంటఅయిన దేమో చూచిరమ్ము.

(జోషీ నిష్క్రమించును)

పృథ్వీ—(తిరుగుచు) ప్రతాపసింహా! నీవు ఇల్లువాకిలి వదలి ఒంటరిగా నొట్టిచేతులతో బాదుషా నెదిరించి యేమిచేయఁగలవు? అసంభ వవిషయముఁగూర్చి నీవింత వ్యర్థ ప్రయత్న మేలచేసెదవు? రమ్ము మా సంఘములోఁ జేరుము. మంచిమంచి భోజనము, ఉంకుట కొకమేడ, దర్బారులో మర్యాద ఇవన్నియు దొరకును. పనికి మాలిన మూర్ఖత్వముతో నొక యాదర్శమును నిలఁబెట్టి క్షత్రి యపురుషులతో వారిస్త్రీల కేల పోట్లాట పెట్టెదవు?

(నిష్క్రమించును)

---

## ద్వితీయ దృశ్యము

స్థానము—హాల్దీఘాటు, సలీము శిబిరము సమయము—ఉదయము

[సలీముడేరాలో దౌలతు, మేహరు ప్రవేశింతురు.]

మేహరు—శాహజాదా ఇక్కడలేదు.

దౌలతు—లేదు.

మేహా—నే నిక్కడనే కూర్చుండి అతనిరాక చూచెదను.

దాల—నేఁడు నీవు చాలకోపముగా నున్నావు

మేహా—ఉండనా? నేను యుద్ధముచూడవలెననుగం పెడాసతో ఇచ్చటకు వచ్చితిని. కాని యిక్కడ నెక్కడను యుద్ధమనుమాటయే లేదు ఒట్టిమాటలే వినిపించుచున్నవి. నేనుండఁజాలను గోళ్ళుగిల్లుకొంటు నే నిక్కడ నొక్క గడియయైనను ఉండఁజాలను. నేఁడే యిక్కడనుండి పోయెదను

దాల—నీమాట నాకేమియు నర్థమగుటలేదు. వచ్చువఱకు చంపిచంపి యుద్ధము చూడవచ్చితివి. యుద్ధ మారంభము కానుండ మఱల వెళ్లెదననిగోల!

మేహ—యుద్ధమెక్కడ? నేటికి పదియేనురోజులనుండి యుభయ సైన్యము లూరక యెదురుపడి నిలఁబడియున్నవి ఒకమాఱును యుద్ధము జరుగలేదు. నే నింక నుండఁజాలను. ఇప్పుడేవెళ్లెదను—అదుగో శాహజాదాసలీముకూడ వచ్చినాఁడు!

(సలీము సుసజ్జితవేషముతోఁ బ్రవేశించి వారిని జూచి ఆశ్చర్యపడును.)

సలీము—ఆఁ! మీరిచ్చట కేల వచ్చితిరి?

దాల—నేఁడు మేహరు చాల కోపముగా నున్నది

సలీము—ఎందుకు?

దాల—ఇప్పుడే వెళ్లిపోవుటకు సిద్ధముగానున్నది.

సలీము—ఎందుకు?

మేహరు—(లేచి) ఎందుకేమిటి? ఎక్కడనైన యుద్ధము జరుగుచున్నదా? పిటికి రాజపుత్రులును పిటికి మొగలులును మట్టి బొమ్మలువలె నిలఁబడినారు. మధ్యమధ్య ఒక కేకమాత్రము వేయుచుందురు. ఎక్కడను యుద్ధమును లేదు యుద్ధ వాద్యములును లేవు ఇదియే యుద్ధమగుచో నింకచాలు నన్నింటికి పంపివేయుము నే నిక్కడ నుండను

సలీము—బాగున్నది. అదియెట్లు ? నిన్నిప్పు డాగ్రా పంపుట మాటలా

మేహరు—అదియంత నాకు తెలియదు. రేపు ప్రొద్దున నన్నాగ్రాకు పంపిన సరే. లేనిచో (నేలతన్నుచు) పెద్ద యాపద తెచ్చిపెట్టెదను.

సలీము—అది యేమి?

మేహ—నేను స్వయముగవెళ్ళి మహారాజ మానసింహునితో నేని చెప్పెదను లేక ప్రాణములేని విడిచెదను నాకు రెండును సమానములే. ఒకటేమాట (తలయాడించుచు బింకముతో) ఇంక నేనిక్కడ నొకరోజుగూడ నుండఁజాలను.

సలీము—ఆనాడువచ్చెదనని గందరగోళము చేసితివి నేఁడు వెళ్లెదనని ఇంతకు ఆడవాళ్ళస్వభావ మెక్కడకుఁ బోవును? ఆనాడు నాకాళ్ళపైఁబడుట తరువాయిగా ఇక్కడకువచ్చుటకు నీవేమిచేయ లేదు?

మేహ—ఆనాటిశేషము నేఁడు పూర్తిచేసెదను. (సలీము పాదములు పట్టుకొనును) అన్నా! నేను పెద్దపొరపాటుచేసితిని. నేను వీరులతో యుద్ధమునకు వెళ్లుచుంటినిగదా అనుకొంటిని కాని ఇక్కడకువచ్చి చూచితినిగదా అందఱు పిఱికిపందలే. మీకు ఒక గొఱ్ఱెకున్నంత సాహసముగూడ లేదు. అందుకనియే నీకాళ్ళపైఁ బడుచున్నాను చేతనగుచో రేపే ఏదో నిర్ణయము చేయుము లేనిచో నన్ను తిన్నగాఇంటికిఁ బంపుము. నాకు యుద్ధముపై మొగమొత్తినది

సలీము—మంచిది లెమ్ము. నే నిప్పుడే మానసింహునివద్దకు వెళ్ళుచున్నాను. తర్వాత ఏమి చేయవలయునో అదిచేసెదను కాని నీవు మహాదృష్టముచే నాకు చెల్లెలవై పుట్టితివి. గనుక నే నీ వాకము సాగుచున్నది (ప్రస్థానము)

దాల—మంచి పన్నుగడపన్నితివి

మేహ—ఎందుకు పన్నను? లేనిచో మఱియెట్లు?

(ఇంతలో శక్తసింహుఁడు శాహజాదాసాహబ్! శాహజా దాసాహబ్! అని పిలుచుచు డేరాలోనికి వచ్చును అచ్చట ఇద్దఱ పిల్లలను జూచి "క్షమింపుఁడు" (అని వెడలిపోవును.)

దాల—వీ రెవరు?

మేహ—ఈయన ప్రతాపసింహుని తమ్ముఁడు శక్తసింహుడని వింటిని. చాల సుందరుఁడు, ఏమి?

దౌల—ఆఁ—అయితే—

మేహ—సలీము చెప్పినాఁడు శక్తసింహుఁడు చాల చదువుకొనిన వాఁడట, అందును వ్యంగ్యోక్తులనుగూడ బాగుగ నెఱుఁగును. చూచితివా వచ్చినాఁడు. వెంటనే క్షమాపణగోరి వెళ్ళినాఁడు. కొంచెమాగిన సంభాషణ జరిగెడిది. ఈ యుద్ధరంగమున అంతఘోషా లేకున్న మాత్రము బాధ యేమి? వాస్తవమునకు ముసల్మానుల ఈ చెడు అలవాటు నాకిష్టములేదు దీనిపేరుచెప్పిన నాయొడలు మండిపోవును మన సౌందర్యసంపద నలుగురు చూచిన మాత్రముననే శూన్యమయిపోవునా?— మంచిది. పద. మనడేరాలోనికిఁ బోదము. ఏమి ఆలోచించుచుంటివి? పదపోదము. (దౌలతు చేయి పట్టుకొని మేహారు నిష్క్రమించును.)

## —* తృతీయ దృశ్యము *—

స్థానము—మానసింహునిడేరా. సమయము—మధ్యాహ్నము.

[సలీము మహాబత్ఖాను ఎదురుగ నిలఁబడి మాటాడుచుందురు ]

సలీము—ఏమి ఖాన్ సాహెబ్! ప్రతాపసింహునివద్ద ఎంతసైన్యమున్నది?

మహా—గూఢచారులు చెప్పినదానినిబట్టి దాదాపు ఇర్వది రెండువేల సిపాయీలు ఉందురు. ఇదిగాక భిల్లసైన్యము వేఱుగనున్నది.

సలీము—ఇర్వది రెండువేలేనా! (బట్ట దులుపుకొనుచు) ఏమేని యగుఁగాక. నేను ప్రతాపుని సాహసమును బొగడుచున్నాను. కేవలమిర్వది రెండువేల సైనికులతో ఇంతగొప్ప, బాదుషాను ఎదిరించిన యాతని నొకమాఱు నేను చూడఁగోరుచున్నాను.

మహా—యుద్ధసమయమున వారిని తప్పక చూడఁగలరు. ఆయన యెప్పుడు సైన్యమునకు వెనుక నుండడు. అందఱకు ముందుగ ఆయనయే యుండును.

సలీము—మహాబత్! ఈయుద్ధముయొక్క జయాపజయములు నీ చాక

చక్యము నీ పరాక్రమము మీాదనే ఆధారపడియున్నవని మేమం దఱము ననుకొనుచున్నాము. (బట్టదులుపుకొనుచు) నీవు నీ పిన తండ్రికి తగిన భ్రాతృవ్యుఁడ వగుదువో కాదో ఇపుడుచూచెదము.

మహా—ఈయుద్ధ పర్యవసానమును నేను బాగుగ నెఱుఁగుదును. మేవాడు సైన్యముకన్న మన సైన్యము నాలుగురెట్లున్నది. అదియును గాక మనవద్ద ఫిరంగులున్నవి. ప్రతాపునివద్ద లేవు. అందులో నేఁడు సాక్షాత్తు మహారాజ మానసింహుఁడు మొగలు సేనాపతి.

సలీము—మానసింహుని ప్రశంస వినివిని విసిగిపోతిని. యుద్ధముమాట రాగానే బాదుషాగారుకూడ మానసింహుని నామమునే జపించెదరు. మానసింహుఁడే దేవుఁడు కాఁబోలు. లేకమానసింహుఁడు లేకున్న మొగలు సామ్రాజ్యము నిలువనే నిలువదు కాఁబోలు.

మహా—కాకున్న నిది యసత్యమా? పోనీ మీారే చెప్పుఁడు. కాకేశసు మొదలుకొని ఆర్యాను వఱకును, హిమాలయము మొదలు కొని వింధ్యాద్రివఱకును మానసింహుని సహాయము లేకుండ మొగలు లేదేశమును సంపాదింపఁ గలిగిరి? బాదుషాగారు ఈ విషయము బాగుగ నెఱుఁగుదురు. వారు ప్రతాపసింహునిఁ గూడ బాగుగ నెఱుఁగుదురు. కనుకనే వారు ఈయుద్ధమునకు మానసింహుని బంపిరి

సలీము—చాలులేవయ్యా! నేను చాలవిన్నాను. వినివిని చెవులు తడికలు గట్టినవి. మానసింహుఁ డంత వీరుఁడగుచో తానే రాజ్యము చేయరాదు? మొగలుల కాళ్లకడఁబడి యెందు కేడ్వవలయును?

మహా— శాహజాదా సాహబ్! ఇవియన్నియు దైవలీలలు.

(మానసింహుఁ డొకమానపటమును బట్టుకొని ప్రవేశించును.)

మాన—శాహజాదాసాహబ్! సలామ్. మహాబతాఖన్! బందగీ మేవాడు సైన్యమంతయు విశేషించి కోమలమీారుకు పడమటనున్న కొండలలోనున్నది. కోమలమీారుకుఁ బోవు త్రోవ చాల ఇరుకుగ నుండును. దానికిరుప్రక్కలను చిన్నచిన్న గుట్టలున్నవి. వానిపై

రాజపుత్రులును విలుకాండ్రగు భిల్లులును, నిలఁ బడియున్నారు. ఈ పటము చూడుఁడు.

మహా—(పటమందుకొని) అయితే కోమలమీరు వఱకును బోవుట చాల కఠినమా?

మాన—కఠినమే కాదు. అసంభవము, రాజపుత్రులపై ఊరక కలియఁ బడుట సరికాదు. మనము మొదలక కూర్చుండి వారిదాడిని నిరీక్షింతము

సలీము—వహ్వా! మన మెంతవఱకిటుల కూర్చుందుము?

మాన—వీఁగనంతవరకును కూర్చుందము. నేను భోజనసామగ్రి వగైరాల యేర్పాటంతయు పూర్తిగ చేసితిని.

సలీము—ఇది యెన్నటికిని వీలులేదు. మనమే ముందు వారిపై కలియ బడుదము,

మాన— శాహజాదాసాహెబ్! మనము శత్రువుల యాక్రమణమునే నిరీక్షింపవలయును. మహాబత్ఖాన్! పొమ్ము. ఇదియే నా హుకుము

సలీము—కాదు ఇది యెన్నటికిని కాఁజాలదు. (మహాబత్ఖానుతో) నీవు రేపుప్రొద్దున దాడివెడలుటకు సైన్యమును సిద్ధముగనుంచుము.

మాన—శాహజాదాసాహెబ్! సైన్యమునకు నాయకుఁడను నేను

సలీ—అయితే నేనూరక తమాషాచూచుటకే యిచ్చటకు వచ్చితినా?

మాన—మీరు బాదుషాకు ప్రతినిధిగ నిచ్చటకు వచ్చితిరి,

సలీ—అనఁగా?

మాన—అనఁగా నిదియే, మీరూరక నామమాత్రమునకు ఒకఫర్మానావలె ఒక ఆనవాలువలె బాదుషాపక్షమున నిచ్చటకు వచ్చితిరి. మీరురాక మీకుబదులుగ బాదుషాగారి పాదరక్ష యిచ్చటకు వచ్చినను పని జరిగెడిదే.

సలీ—ఆఁ! ఇంతసాహసమా? (ఒరనుండి కత్తిదూయును)

మాన—శాహజాదాసాహెబ్! కత్తిని ఒరలోనుంచుఁడు వ్యర్థకోపముఁ బూనుటచే నేమి లాభము? మనయుభయులము పోరాడినచో

మీరు నన్ను గెలువఁజాలరని మీరెరుంగుదురు. మఱియు ఈ సైన్యమంతయు నాయధికారమున నున్నది కాని మీయధికారమునఁ గాదు. ఇదియు మీరెఱిఁగినదియే.

సలీ—మీరు నాయధికారములో లేరా?

మాన—లేను. నేను బాదుషా యధికారములో నున్నాను. ఈ యుద్ధములో నేను వారివలన సంపూర్ణాధికారమును బొంది వచ్చితిని. వీలగునంతవఱకు మీపనులన్నియుఁ జూచి యూరకుందును. మీ వ్యవహారము కొంచెము ముదురుచున్నట్లు తోఁచినచో పిచ్చివారికివలె మీకు చేతులకు కాళ్లకు సంకెళ్లు తగిలించెదను. నే నీ విషయమై యేమేని చెప్పుకొనవలసియున్నచో బాదుషాగారితో చెప్పికొందును. మహాబత్ఖాన్! నాయాజ్ఞానుసారమే పని జరుగవలయును. (మహాబత్ఖాను మెదలక సలీమునకు సలాముచేసి పోవును తర్వాత మానసింహుఁడును సలాము చేసి పోవును)

సలీ—మంచిది. ఈయుద్ధము పూర్తి కానిమ్ము, దీనికి ప్రతిక్రియ చేసెదను. ఔరా! ఇతని కింత సాహసమా! (త్వరగా డేరానుండి వెడలిపోవును.)

---

## చతుర్థ దృశ్యము.

స్థానము—యుద్ధభూమిలో శక్తసింహుని శిబిరము

సమయము - అపరాహ్ణము.

[శక్తసింహుఁడు ఒంటరిగా నిలఁబడియుండును]

శక్త—ఇదియే మేవాడు. ఇదియే నాజన్మభూమియగు మేవాడు! నేఁడు నామాటమీఁదనే మొగలసేన వచ్చి స్వర్ణప్రసువగు నీ మేవాడు భూమిని నిండియున్నది. శీఘ్రముగ నే ఈభూమిపై తత్సంతాన రక్తస్రవంతులు ప్రవహింపఁ గలవు. ఈభూమితనసంతానమున కొసఁగిన రక్తమును ఇపుడు తిరిగి తీసికొనును ఇస్తేవాయనం పుచ్చుకొంటే వాయనం. లెక్క తేలిపోయినది. ప్రతాప్! ఇప్పుడు మన యిద్దరతగాదాకూడ పరిష్కృతమగును.

నీవు నన్ను మేవాడునుండి వెడలఁ గొట్టితివి, ఇప్పుడు నీ యా ఋణమును నేను తీర్చుకొందును. రావణుఁడు విభీషణుని ఒక తన్ను తన్ని వెడలఁ గొట్టెను విభీషణుఁడు తనపగదీర్చుకొనెను. నీవును నన్ను వెడలఁ గొట్టితివి. నాపగ నేఁడు తీర్చుకొందును. నేడు నిన్ను మేవాడునుండి వెడలఁ గొట్టెదను. మేవాడునంతను ధ్వంసము జేసెదను. తగులఁ బెట్టెదను. తర్వాత ఆశ్మశానముపై ప్రేతవలె తిరిగెదను. ఇంతయే జేసెదను. ఇంతకంటె నెక్కువ యేమియు లేదు నేను మేవాడు రాజ్యమును గోరుట లేదు. మొగలుల బహుమానమును గోరుట లేదు. ఇందు ఏవిధమైన ద్వేషముగాని, లోభముగాని, హింసగాని, ఏమియు లేదు. నా పైఁ బ్రతాపుని ఋణమొకటి యున్నది. దానిని దీర్చుకొనుటకై వచ్చితిని. నాచేతనగునంతవరకు ప్రాకృతికా న్యాయమునకు, సాంఘిక దురభిప్రాయమునకు, రాజనిరంకుశత్వమునకు ప్రతిక్రియ గావించెదను. జాతి చాల పెద్దది. దాని ముందు నేను చాలచిన్నవాఁడను. నే నొంటరిగ నా యుద్దేశ్యమును నెరవేర్పఁ జాలమిచే సహాయార్థము మొగలులఁ గొనివచ్చితిని. ఇందు నాది యన్యాయమని యెవ్వరనఁగలరు? నేనేమియు నన్యాయము చేయలేదు. పైఁగా నేనొక పెద్దయన్యాయమును న్యాయము వైపునకుఁ గొంపోవుచుంటిని. ఔచిత్యశాంతికి భంగము వాటిల్లెను. మరల ఆశాంతిని నేను స్థాపింపఁ బోవుచున్నాను. ఇందు నాదేమియు నన్యాయము లేదు.

[మేహరున్నిసా ప్రవేశించును.]

శక్త— (ఉలికిపడి) ఎవ్వరు?

మేహ—నేను మేహరున్నిసాను. అక్బరుబాదుషాకన్యను.

శక్త—(మర్యాదగ) బాదుషాకన్య నాడేరాలోనికా?

మేహ—మీరు ప్రతాపసింహుని తమ్ములుగదా. ఆయన శత్రుసైన్యములోని కెట్లు వచ్చితిరి?

శ క్త—(కొంచెము వెల్లపోయి మెల్లగా) అవును. నేను ప్రతాపసింహుని శత్రుసైన్యములోనికి వచ్చినమాట వాస్తవము. నేను పగతీర్చుకొనుటకై వచ్చితిని.

మేహ—అయితే మీయుద్దేశ్యముకంటె నాయుద్దేశ్యము చాల గొప్పది నేను మైత్రిచేయుటకై వచ్చితిని. (శక్తసింహుఁడు విస్మితుఁడగుట చూచి) మీకు ఆశ్చర్యమెందుకు?

శ క్త—నేనాలోచించునది—

మేహ—మంచిది. మీరు ఆలోచింపుఁడు. నేనును ఆలోచించెదను.

(కూర్చుండును)

శ క్త—(మఱియును విస్మితుఁడై) మీరిచ్చట కెందుకు దయచేసితిరో అడుగవచ్చునా?

మేహ—ఎందుకు అడుగఁగూడదు? చక్కఁగ అడుగవచ్చును. నే నొక పెద్దసంకటములోఁ బడితిని.

శ క్త—సంకటమా! ఎట్టిసంకటము?

మేహ—చాల పెద్దసంకటము. సలీము నా సోదరుఁడని మీ రెఱిగియే యుందురు. నేనును దాలతున్నిసాయును యుద్ధము చూచుటకై వచ్చితిమి. ఇదియు మీకు తెలిసియే యుండవచ్చును. నే నేమో యిచ్చటకు యుద్ధము చూడవచ్చితిని గాని ఇక్కడ యుద్ధమను మాటయే లేదు. ఇరుపక్షముల సైన్యమును ఒకరివంక నొకరు చూచుకొనుచు పడియుండుటయె నాకిక్కడ కనఁబడుచున్నది ఇదే చూచుటకు నేనేమియు నిచటకు రాలేదు. ఇంక మీరే చెప్పుడు. నే నిక్కడ కూర్చుని కూర్చుని యేమి సేయుదును? ఇంతదనుక దాలతున్నిసాతో కబుర్లుచెప్పుచుంటిని. ఇప్పుడదికూడ నిద్రపోయినది. ఎక్కడిదినిద్రయో గానిది. ఈ గందరగోళములో నే పెద్దమానిసి కేని నిద్రపట్టునా? ఇప్పుడు నే నొంటరిగా నేమి చేయుదును! మీరును ఇచ్చట నొంటరిగానుండుటగాంచితిని. కొంచెము సేపు మీతో సంభాషింప వచ్చునుగదాయనివచ్చితిని. సలీము మీరు పెద్ద విద్వాంసులని చెప్పినాఁడు.

(శక్తసింహుఁడు మఱియును విస్మితుఁడగును.)

మేహ—మీరిపుడు చాల ఆలోచనలోఁ బడినట్లు కనిపించుచున్నారు. నేను బాదుషాగారి పుత్రికనే. కాని మాతల్లి రాజపుత్రస్త్రీ. నేనిచటకు యుద్ధము చూడవచ్చుటయు, అందులో ఇంతకుమున్ను మీతోఁ బరిచయములేకయే నేను హఠాత్తుగ మీడేరాలోనికి వచ్చుటయు, మాకు అనుల్లంఘనీయమగు ఘోషాపద్ధతిని నేను విడనాడుటయు మీకు వింతగ నున్నవికాఁబోలు.

శక్త—అవును అదియునుగాక మీరు నాడేరాలోనికి వచ్చిన సంగతి యెఱిగిన సలీముగాని బాదుషాగాని యేమందురు?

మేహ—మీరు భయపడకుఁడు. బాదుషాగారు ఏమియు ననరు. నా మాట వారికి ధర్మశాస్త్రప్రవచనము. ఇంక సలీమా? పాపము వాఁడేమిచేయును? నే నతనికి సోదరిని. మాయిద్దఱవయస్సు నొకటియే. అదియునుగాక మీకెఱిఁగియే యుందురు ఆడవాళ్లు చిన్నవయస్సుననే పెద్దబుద్ధిగలవారగుదురు. గాన నే నేది చెప్పినను వాఁడు తప్పక చేయును కాదనఁడు. ఆఁ! జ్ఞాపకము వచ్చినది మీకు పెండ్లి అయినదా?

శక్త—లేదు. ఇంకను గాలేదు.

మేహ—ఇది గొప్ప వింతసంగతియే.

శక్త—ఏమి? ఇందు వింత యేమున్నది?

మేహ—మీకు పెండ్లి కాలేదు. ఇది సామాన్యపు వింతయా? నాకును బెండ్లి కాలేదు. మీకు పెండ్లి అయి మీతో మీభార్యకూడ ఈ యుద్ధమునకు వచ్చియున్నచో మాకు చక్కగ స్నేహము కలిసెడిది కాని మీకు పెండ్లియే కాలేదు. ఇంక నెట్లు?

శక్త—ఇది నా దౌర్భాగ్యము.

మేహ—దౌర్భాగ్యమో సౌభాగ్యమో తెలియదు. కాని యీపెండ్లి చేసికొను నాచారము చిరకాలమునుండి వచ్చుచున్నది. ఆప్రకారము అందరు నడువవలయును. ముందు నాకీసంగతిచెప్పుడు. ప్రణయినీ ప్రణయుల తొలిపలుకు లెట్లుండును? వానిని విను

టకు చాల కుతూహలముగ నున్నది కావ్యములందును, నవల లందును వ్రాసిన విధముగనె సంభాషణము జరుగుచో చాలతమా షాగా నుండును. ఒక్కఁడనును—ప్రేయసీ! నీవు లేకున్న నేను బ్రదుకఁజాలను. దీనికి జవాబు—"ప్రియా! నిన్ను చూడకున్న నాప్రాణము లెగిరిపోవుచున్నవి." అని వచ్చును ఇంతకుమున్ను వీరు ఒకరినొకరు చూచుకొన్నవారు గారు. రెండు మూడు రోజులలోనే ఈమాటలు! ఒకఁనిజూడకున్న నొకరు బ్రిదుకఁ జాలరు!

శక్త—ఇంతవరకు మీ రెవ్వరిపాశమందును జిక్కుకొనినట్లులేదు

మేహా—లేదు. నేటివరకు నాకట్టి యవకాశము రాలేదు. నే నింతవఱ కెవ్వరిని ప్రేమింపలేదు. ఒకరు నన్ను ప్రేమింతురను భయ మును నాకు లేదు.

శక్త—ఏమి?

మేహా—ఎవ్వరి నేని ప్రేమింపుచో మొదటిసంగతి ప్రేమింపఁబడువారి యాకారము అందముగ నుండవలయునఁట. నేను కావ్యము లలోఁ జదివితిని. ప్రేమింపఁబడు పురుషులందఱు కంతులో జయం తులో వసంతులో కావలయును స్త్రీలు రతులో నిర్జరసతులో కావలయును. అనాకారయగు రాజపుత్రికకథను ఇంతదనుక నే నెక్కడను జదువలేదు. అయితే అనాకారయగు రాజపుత్రికను నేను చూచితిని.

శక్త—ఎక్కడ?

మేహా—అద్దములో. నాముఖము బొత్తుగ బాగుగలేదు అయితే నా కనులు అంత చెడ్డవికావు కాని అవి చెవులవఱకు వ్యాపింప లేదు. కనుబొమ్మలు రెండును దగ్గఱ కలసియుండిన బాగుండు నని వింటిని, గాని నాకనుబొమ్మలకు చాల ఎడముగలదు. అది యునుగాక నాముక్కు మధ్య కొంచెమెత్తుగానుండిన బాగుం డెడిది కాని చైనావారి ముక్కువలె అణఁగి పోయినది. అయితే మా అమ్మముక్కు మా నాయనముక్కు మాత్రము మంచివే.

తర్వాత నా బుగ్గలుకూడ గులాబిపువ్వులవలెలేవు. సారాంశము నేను చూచుటకు బాగుగ లేనన్నమాట. అయితే మాడాల తున్నిసా చూచుటకు చాల అందముగా నుండును. నేను అనాకారినయిన లోటును అది తీర్చినది. అయితే ఇందు నాకే ఎక్కువలాభము. ఏమన, రేయింబవళ్లు నాకనులకొక సుందర ముఖము కనిపించుచుండును. ఇంక నది పగలు రాత్రి అద్దము ముందు కూర్చుండదు గదా

[యోగినివేషమున ఈర ప్రవేశించును.]

శక్త—ఎవరు?

ఈర—నేను ప్రతాపసింహుని పుత్రికనగు ఈరను.

శక్త—ఈరా నీవునాడేరాలోని కెట్లువచ్చితివి? నీకీ సన్యాసినీవేషమేమి? నేను స్వప్నమును గాంచుచుంటినా?

ఈర—లేదు బాబూ. ఇది స్వప్నము గాదు. నేను నిజముగ ఈరను. మిమ్మొకమారు చూచుటకై యిచ్చటికివచ్చితిని. (మేహారువంక జూచి) ఈమె యెవరు?

శక్త—ఈమె అక్బరుబాదుషా పుత్రిక మేహారున్నిసా (తనలో) ఇదియెంత వింతసంగతి. నాడేరాలోని కేకకాలమున మొగలసార్వభౌముని కన్యయు రాజపుత్ర ప్రభునికన్యకయు స్వయముగ వచ్చినారు

(మేహారు ఈరావద్దకుం బోయి అమె బుజముపై చేయివేయును)

మేహా—రాణా ప్రతాపసింహుడు మీకు తండ్రియా?

ఈర—అవును శాహజాదీసాహాబా!

మేహా—నేను శాహజాదీని గీహజాదీనిగాను. నేనువట్టి మేహారున్నిసాను నేను బాదుషాకూతునైనమాట వాస్తవము. కానినావంటి కూతుళ్లు ఆయనకు లక్షతొంబదిమంది కలరు. వారిలో నావంటిది ఒక్కతె హెచ్చినను, తగ్గినను వచ్చునది పోవునది యేమియు లేదు. నేను అనేకపర్యాయములు ఆయనతో యుద్ధమునకు వెళ్ళుటకు ప్రయత్నించితిని. కాని ఆయన యెప్పుడును నన్ను తీసికొని పోలేదు. ఈమాఱు బలవంతముగ సలీముతో వచ్చితిని

నాతో మామేనకూతురుకూడ వచ్చినది. దానిపేరు చాలతున్నిసా.

ఈర—ఆమె ఎక్కడనున్నది?

మేహ—స్వస్థముగా నిద్రబోవుచున్నది. దానినిద్ర విచిత్రమైనది. గిల్లినను మెలకువరాదు. మీరే చెప్పుఁడు ఈ గందరగోళములో నెవ్వరికైన నిద్రవట్టునా?

ఈర—పితృవ్యా! మీతోఁ గొంత చెప్పవలసియున్నది.

మేహ—ఆఁ చెప్పుఁడు, నేనిచ్చట నుంటినని మీరేమియు సందేహింపవలదు. మీరీమాట మీ పినతండ్రికి దక్క మరి యెవ్వరికిని తెలియగూడదనుకొన్న మీరు నాపై విశ్వాసముంచుఁడు నా తల కోసినను నే నెవ్వరికినిఁ జెప్పను. వీలగుచో నేనును మీమాటలలో నేకీభవించెదను. లేకున్న మొదలక విందును. మీ పేరు ఈరగాదూ? ఎంతచక్కనిపేరు. ఆకారముగూడ ఎంతసౌమ్యమైనది. ఆఁ సంభాషణప్రారంభింపుఁడు. ఊరకుంటిరేమి? మీరు మాట్లాడుచునుండుఁడు. ఇంతలో నేను పోయి చాలతున్నిసాను బిలుచుకొని వచ్చెదను. అది మిమ్ముచూచి సంతోషించును

(పరుగెత్తుకొని పోవును)

శక్త—విచిత్రపు పిల్ల!—ఈరా! నీవు ఒంటరిగనే వచ్చితివా?

ఈర—అవును,

శక్త—నీవు కుశలముగ నిచ్చటకు చేరగల్గితివా?

ఈర—కుశలముగ జేరుటకే నేనీ యోగినీవేషమును ధరించితిని.

శక్త—ప్రతాపునకు నీవిక్కడకువచ్చు సమాచారము దెలియునా?

ఈర—లేదు నేను వారితోఁ జెప్పిరాలేదు.

శక్త—ప్రతాపసింహుఁడు క్షేమముగ నున్నాఁడా?

ఈర—శరీరముచే క్షేమముగనె యున్నాఁడు.

శక్త—ఆయన యేమి చేయుచున్నాఁడు.

ఈర—ఆయనకిప్పుడు యుద్ధపు పిచ్చ యెక్కినది.

సీ. ఒకవేళ సైనిక ప్రకరంబు గుమిగూర్చి
కదనశిక్షణమును గఱపుచుండు
ఒకవేళ రిపుభట వ్యూహంబు భేదింప
మొనసి మంత్రులతోడ ముచ్చటించు
ఒకవేళ ఘనగభీరోక్తుల సామంత
రాజపుత్రులకు నుత్తేజమొసఁగు
ఒకవేళ గట్టినమ్మకముగ లట్టి వే
గులను వైరులగుట్టు తెలియఁబంచు
గీ. యుగయుగమ్ములనుండి హాయిగను హిందు
ప్రజల రాణాచియై పన్నివాసిగనిన
భరతఖండంబు నేటికిఁ బరవశత్వ
మందెనని రార్చు నొకవేళ నశ్రువులను॥

శక్త—మావదినగారెట్టులున్నది?

ఈర—ఆమెయు బాగుగనె యున్నది. కాని రెండురోజులనుండి ఆమెకు నిద్రలేదు నాయనగారి తలవంపుదిక్కున కూర్చుండి పారా వేయుచున్నది నాయనగారు నిద్రలో యుద్ధస్వప్నములనే గాంచుచున్నారు. ఒకప్పుడు నిద్రలో వారు "కలియబడుఁడు. కలియబడుఁడు" అని అరచుచుందురు. ఒకప్పుడు ఎవ్వరినోకసరు చుందురు ఒకప్పుడు "భయము విచారము ఏమియు లేదు." అనియనుచుందురు. ఒకప్పుడు "శక్తా! తుదకునీవే నీజన్మభూమి వినాశమునకుఁ గారణమైతివా" అనుచు నిట్టూర్పు విడుచుచుండును.

(ఇద్దఱును గొంతసేపు మౌనముగ నుందురు.)

ఈర—(తలవంచుకొని, పితృవ్యా!

శక్త—ఈరా!

ఈర—మీరు నాయనగారికి సోదరులయ్యును వారిశత్రువులగు మొగలులలోఁ జేరుటకును, హిందువులయ్యును హిందువులకు శత్రువులగుటకును ఏమేని కారణమున్నదా?

శక్త—మీనాయన నిరపరాధుఁడగు నన్ను దేశమునుండి వెడలఁగొట్టెను. ఇదియే దానికి కారణము.

ఈర—నేనును ఆ బ్రహ్మహత్యా వృత్తాంతము వింటిని. ఏదేశమును నాశము చేయుటకై మీరు అస్త్రమును గ్రహించితిరో దానిని గాపాడుటకే యా దరిద్రబ్రాహ్మణుఁడు తనప్రాణము లర్పించెను. పితృవ్యా! ఒకమాఱు మీరు మీ పూర్వవృత్తాంతమును స్మరింపుఁడు

గీ॥ మృత్యుముఖమునుండి తప్పించి దరికిఁ
జేర్చి కాపాడె గోవిందసింగు తొలుత
పిదప నినుఁ దనకడకు రప్పించి యింత
దనుక మోయున్న సాకె ప్రతాపవిభుఁడు॥

పితృవ్యా! మీ రాగోవిందసింహునకును, మీ యన్నయగు ఆ ప్రతాపసింహునకును విరుద్ధముగ నిపుడు ఖడ్గము ధరించితిరి గదా? మీ ప్రాణదాతల ప్రాణములు దీయుటకే యిపుడు సిద్ధపడితిరిగదా?

శక్త—ఈరా! నీవు చెప్పినది నిజము. కాని నన్ను అన్యాయముగ దేశమునుండి వెడలఁగొట్టిన యన్నకు విరుద్ధముగ ఖడ్గము గ్రహించితినని నీవు చెప్పలేదు.

ఈర—ఇది నిజము. అయితే పితృవ్యా! సోదరుఁ డేదేని భయమూహించి యపరాధమును జేసినచో నింక ప్రపంచములో క్షమయను వస్తువు లేదా? క్షమ కేవలము నిఘంటువులందును, కథలయందును నుండునదియేనా? పితృవ్యా! మీ రొకమాఱు ఇటు చూడుఁడు

సీ॥ కాలితో రాచి నాఁటదున్ను ప్రజలకే
సకలధాన్యముల నొసంగు ధరణి
ప్రతిదినమ్మునుబై (బడి మేయు పసులకే
ప్రోఁజిగురాకులఁ గూర్చు ప్రాను
కఱకుగానుగ నిడి కరముఁ బీడించు వా
రికె గుప్తరసము నర్పించుఁ జెఱకు

తనకు వేగకును బంధము వేసి పిదికెడు
జనుల దుర్గమ్ముల దనుపు మొదవు
గీ॥ సంద్రమునఁబుట్టు క్రూరబాష్పమ్ము మింట
ఘనముల సృజించు ఘోరగర్జనము సేయు
చల్లపడి పిండిసుమధుర జలముఁగురియు!
క్షమయ లేకున్న నింక విశ్వమ్ము గలదె?

పితృవ్యా! ఈప్రపంచములో హింస, ద్వేషము, వివాద ఇవి దక్క వేఱొండు లేదా?

శక్త—ఈరా! ప్రపంచములో క్షమ యున్నమాట వాస్తవము అట్లే ప్రతిశోధనమనునదిగూడ కలదు. నేను ప్రతిశోధనమునే శ్రేష్ఠముగ తలంచుచుంటిని.

ఈర—పితృవ్యా! దేనికి ప్రతిశోధనము? దేశనిష్కాసనమునకా? నాయనగారు దోషములేకయే మిమ్ము దేశమునుండి వెడలఁగొట్టిరా? బ్రహ్మహత్యా కారణంబగు నాటిద్వంద్వ యుద్ధమును జేయుటకు తొలుత ఎవ్వరు ప్రసంగించిరి? నాయనగారు మిమ్ము దోషములేకయే వెడలఁగొట్టి రనుకొనుఁడు. అయినను అంతకు మున్ను ప్రేమపూర్వకముగ మిమ్ము తమవద్ద నుంచుకొని పుత్రునివలె పోషింపలేదా?

శక్త—కాని అంతకుమున్ను నేను అన్యాయముగ వెళ్ళఁగొట్టఁబడితిని.

ఈర—ఆ అన్యాయము నాయనగారు చేయలేదు. రాణాఉదయసింహుఁడు చేసినదానికి నాయనగారు బాధ్యులు గారు. వారు మీకొకమాఱు ఆశ్రయము నిచ్చిరి. మఱల విడనాడిరి ఇందు ప్రతిశోధనమునకుఁ బనియేమి? ఉపకార మివ్విధమున మరవఁదగినదియును అపకారము మరవరానిదియునా?

శక్త—(స్తంభితుఁడై) స్వగతము. నిజముగ నిది నాపొరపాటేనా? అట్లే కాకున్న ఈపసికూనవేయు ప్రశ్నపై నేను నిరుత్తరుఁడనగుదునా? (కొంచెమాలోచించి) ఈరా! నీమాట కేమి యుత్తర

మీయవలయునో నాకు తోఁచకున్నది. మంచిది. ఈవిషయమై ఆలోచించెదను.

ఈర—పితృవ్యా! ఈసమస్య యేమియు నంత కఠినమైనది. గాదు. మీరును దీనిని తెలిసికొనలేనంత మూఢులు గారు. మీప్రతి శోధము న్యాయసంగతమే యనుకొందము అయినను అపరాధి నాయనగారే గాన వారిపట్లనే మీప్రతిశోధము న్యాయ్యము. దేశముపట్లఁ గాదు. పాప మీజన్మభూమి మీకేమి యపరాధముచేసినది? దీనిపై మీకింత ద్వేష మెందుకు? ఏదేశమును రక్షించుటకై నాయనగారు తన ప్రాణముల గూడ నిచ్చుటకు సిద్ధముగనుండిరో దానిని ధ్వంసము చేయుటకై మీరిపుడు ఈ మొగలసైన్యమును బిలచుకొని వచ్చితిరి.

గీ॥ తండ్రికొమరులకును నన్నదమ్ములకును
వర్ణములకును నన్యోన్యవైరములను
గల్పనముచేసి యొక్కపక్షమునఁ జేరి
పరనృపుల్ తమపని చక్కపెట్టుకొంద్రు॥

పితృవ్యా! అట్టిచో పరరాజుల ప్రయత్న మక్కఱలేక యేమీలో మీరు గలఁతలుపడి అందొకరు వారిపక్షమునఁ జేరి దేశమును వారిచేతిలోఁ బెట్టుటయు జాతిని వారికి పాదాక్రాంతముఁ జేయుటయు నుచితమా? ఇది మనుష్యుల ప్రతిశోధముగాదు-రాక్షసుల ప్రతిశోధము. ఇద్దరు అన్నదమ్ములు ఒండొరులలోఁ గలతపడి మాతృహత్యకుఁ బాల్పడుటయా? ఆహా! జన్మభూమిపై నింత నిర్దయతయా!

శక్త—కాని ఈరా! నేను బాల్యమునుండియే జన్మభూమ్యుత్సంగము నుండి వేఱుసేయఁబడితిని.

ఈర—అయినను అదిమీకు జన్మభూమియె

శక్త—నామమాత్రమునకే. నాపై దాని ఋణ మేమియు లేదు.

ఈర—ఋణము లేకుండఁ గాక నిరపరాధియగు దానిని మొగలులపాదములచేఁ ద్రొక్కించుట అన్యాయము అత్యాచారము గాదా?

ప్రతాపసింహుఁడు మీవిషయమై అన్యాయము చేసినచో ఆయన
యే దానికి బాధ్యుఁడుగాని మేవాడుగాదు

శక్త—(కొంచెమాలోచించి) ఈరా! నీవుచెప్పునది న్యాయ్యముగనే కను
పట్టుచున్నది. అయిననుఇంకనాలోచించి చూచెదను. నేనొనర్చు
నదియే అన్యాయమని తోఁచినచో యథాసాధ్యముగ దానికిఁ
బ్రతిక్రియ చేసెదనని ప్రతిజ్ఞ చేయుచున్నాను— కానిచాల ముం
దుకు వచ్చితిని. ఇప్పుడు వెనుకకు మఱలుటకు దారి లేదు.

ఈర—పితృవ్యా! నేను యుద్ధమునకే విరోధిని. నేను నాయనగారిని
యుద్ధవ్యవసాయమునుండి నిరంతరము మరల్చుచు వచ్చితిని.
కాని వారునామాట విన లేదు. అయినను ఈమారుయుద్ధమగు
నపుడు నాకు నాయనగారియెడలనే సహానుభూతి యుండును.
వారు నాకు తండ్రియనియు మొగలులు నాకు శత్రువులనియుఁ
గాదు? మొగలులు ఆక్రమించువారును, నాయనగారు ఆక్రమిం
పఁబడువారును అని. మొగలులు ప్రబలులు, నాయనగారు దు
ర్బలులు అని.

శక్త—ఈరా! తప్పు నాయదియే. నీవు చెప్పినది నిజము. ఇంక సాధ్య
మగునంతవఱకు దీనికి ప్రతిక్రియ చేసెదనని ప్రతిజ్ఞ చేయుచు
న్నాను.

ఈర—భారతమాతకు జై. మీ ప్రయత్నము సఫల మగుగాక. నాకు
సెలవిండు. ఇంక నేను వెళ్ళెదను.

శక్త—పద. నిన్ను పంపించివచ్చెదను.

ఈర—అక్కర లేదు. నేను యోగినిని! నన్నెవ్వరు నడ్డగింపరు. మంచిది
పితృవ్యా! నేనుపోవుచున్నాను. నమస్కారము.

శక్త—మంచిది అమ్మా! చిరంజీవివి కమ్ము

(ఈర నిష్క్రమించును.)

శక్త—గొప్ప విద్వాంసుఁడననియు బుద్ధిమంతుఁడ ననియు నాకు పెద్ద
గర్వము కాని నేఁడీబాలికచే ఓడింపఁబడితిని నిజముగ నెంతొక
పెద్ద యన్యాయమునకుఁ బ్రవర్తకుఁడ నయితినా? ఇందు అపరా

ధము నాదియేనా? కొంచె మాలోచించెదను. (విచారించుచు నిలఁబడును ఇంతలో దాలతున్నిసాను దీసికొని మేహారున్నిసా ప్రవేశించును.)

మేహారు—ఈర ఎక్కడ?

శక్త—వెళ్ళిపోయినది.

మేహా—వెళ్ళిపోయినదా? ఔరా! ఏటిమాట! నేను దాలతును దీసికొనివచ్చినది ఈరతో ఈమెకు పరిచయముచేసి మేమందఱము కలసి మాటాడుకొందముగదాయని ఇంతలోనె మీరు ఆమెను బంపివేసితిరి. ఔరా! ఇది యేటి సౌమ్యత!

శక్త—క్షమింపుఁడు. మీ రీమెను పిలచుటకు వెళ్లినమాట నేను మఱచితిని.

మేహా—వహ్వా! ఎట్లు మఱచితిరి? బహుశః నను పిలువకుండ మీడేరా లోనికి నచ్చినందుకు ఫలితముగాఁబోలు ఇది. కాని నేనెవ్వతెనో మీ రూహింపలేదు అక్బరుబాదుషాకూతునిమాట. మీరు మఱచెదరుగాక. ఒక భద్రస్త్రీని నిర్లక్ష్యముచేయుట యుక్తము కాదు. నేను స్వయముగ నింతశ్రమపడి దాలతు నింత శ్రమపెట్టి ఇక్కడకు తీసికొనివచ్చినది మీ యాకారమును జూచుటకా?

శక్త—అట్లె అయినమాత్రము బాధయేమి?

మేహా—అవును నిజముగ మీ యాకారమును దర్శనీయమే; కాని మీముక్కు కొంచెము చిన్నదిగ నుండుచో చాల బాగుగ నుండెడిది.

శక్త—ఈమెయేనా మీ మేనత కూతురు

మేహా—అవును ఈమెయే దాలతున్నిసా. ముఖమెంత చక్కనిదో చూచితిరా?—దాలత్! కొంచెము ముసుఁగు తీయుము

దాల—పో (ఇంకను ముసుగువేసుకొనును)

మేహా—ఓసీ! కొంచెము ముసుఁగుతీయుము ఇందు నష్టమేమున్నది? నీముఖమేమియు గులాబుజామునుగాదుగదా చూడగ నేనోటిలో వేసికొందురని భయపడుటకు? నామాట విని కొంచెము ముసుఁ

గు తీయుము తర్వాత ఇంటికి వెళ్ళి అద్దములో బాగుగ జూచుకొనుము ఏమేని అరగినఁగాని చెడిపోయినఁగాని, నీ యిచ్ఛ వచ్చినది చేయుము. ఈ మూదిరిసిగ్గు నాకు బాగుగ నుండదు. ముసల్మానుల కిదియొక పాడుఅలవాటు శక్తసింహాజీ ఇది నేను ఒప్పుకొందును. మీపూర్వులుమీ పద్మిని ముఖమును అలాఉద్దీనుకు చూపింపకున్నచో నేఁడుచిత్తూరు ఇతిహాసము మరియొక విధముగనుండెడిది! దౌలత్! ఇంక ముసుఁగు తీయుము. (బలాత్కారముగ ముసుఁగు తీయును.) ఇదుగో ఇప్పుడు బాగుగ చూడుడు. చూచితిరా ఎంత చక్కనిదో?

శక్త—చక్కనిది యగుటలో నేమియు సందేహము లేదు. నేటిదనుక నే నిట్టి సౌందర్యమును ఎక్కడను జూడ లేదు. ఈమె నెట్లు ప్రశంసింపవలయునో తెలియకున్నది.

మేహ—మంచిది. మీరు ప్రశంసింపకుఁడు. నేనే ప్రశంసించెదను.

గీ॥ ధ్వాంతమయరాత్రి వీణారవంబు విధము
ఘనవిపినమందున గులాబికలికి పగిది
కలితమధుమాసమునఁ దొలిగాడ్పువోలె
నలరుచున్నది యిపుల నుత్పలదళాక్షి॥

వర్ణన బాగుగ నున్నదియా లేదా?

దౌల—ఓసీ! ఏమ్మ్ర

మేహ—యౌవనారంభమున ప్రథమ ప్రేమస్వప్నమువలె.

[దౌలతు రెండుచేతులతో మేహరునోరు మూయును

మేహ—విడువుము, విడువుము. నాకు ఊపిరి సలుపుటలేదు. (శక్తసింహునితో) నేను ఆఖ్యాయికలలో నెన్నియో రూపవర్ణనములు చదివితిని. నేను స్వయముగఁగూడ చాలబాగుగ వర్ణింపఁగలను. హాఫిజ్ ఫైజీలుగూడ అట్లు వర్ణింపఁజాలరు.

శక—ఎట్లు?

మేహ—ఈరూపమును నిర్మించిన దైవము దీనియందు ఇంకను చక్కదనము పెట్టుటకు ప్రయత్నించినచో ఇది ఇంకను చెడిపోయె

డిది. ఇంతకంటె చక్కనిది యగుటకు వీలులేదు. (దౌలతుతో) ఏమి దౌలత్! నీ వీయనవంక రెప్పలార్పక యేల చూచుచుంటివి? శక్తసింహుని ప్రేమలోం బడితివా?

దౌల— పో, నా నీకీమాటలు బాగుగనుండవు.

మేహ—ఆఁ. అన్నియు ప్రేమలక్షణములుగ నే కనుపించుచున్నవి. రెప్పయార్పక చూచుట, రెండుచూపులు కలియునపుడు తలవంచుకొనుట, చెవులవరకు ముఖమంతయు ఎఱ్ఱపడుట, దీనిపై నెవ్వరేని పరిహాసముచేసినచో, పో నాకీమాటలు బాగుగ నుండవు. అనుట - పుస్తకములలో వ్రాసిన సంగతులన్నియు బాగుగ సరిపోవుచున్నవి ఓసీ! ఏమి పనియది? ఈయన మాయలోం బడుట లేదుగదా! ఈయన రాజపుత్రుఁడు. మనము మొగలులము. అయినను ఇందు బాధయేమి! నాయన్న మహమ్మదీయుఁడు అమ్మ రాజపుత్రస్త్రీ. వారును పెండ్లి చేసికొనిన వారేకదా. (దౌలతు వెళ్లబోఁగా శక్తసింహుఁడు ఆమె నడ్డగింపఁ బోవును. ఆమె పరుగున వెళ్లిపోవును.)

మేహ—ఔరా! మీకును ఆలక్షణమె కనుపట్టుచున్నది లేకున్న ఆమె నడ్డగించుటకు మీ కేమి యధికారము? కాని యుద్ధరంగమునకు వచ్చి ప్రేమపాశమునఁ జిక్కుకొనుట యింతవరకు నే నెక్కడను జదువలేదు. అదనెఱిఁగి పని చేయుఁడు. ఇక నెన్నడు నిట్టి పని చేయకుడు. (నవ్వుచుఁ బోవును.)

శక్త—ఇద్దరు విచిత్రబాలికలు. దౌలత్ ఎంతసుందరియో మేహరు అంత విదుషి. దౌలతును మాటిమాటికి చూడవలయు ననిపించును. మేహరుకూడ చూడఁదగినదే. వీరెంత చపలలు. ఎంత రసికలు. ఎంత ఆనందమయులు. - విచిత్రబాలికలు.

పంచమ దృశ్యము.

స్థానము— హల్దీఘాటు, ప్రతాపుని శిబిరము.

సమయము—అర్ధరాత్రి.

(ప్రతాపుఁడు వక్షముపై రెండుచేతులు ముడుచుకొని దూరమున నేదియో చూచుచు నిలఁబడును)

ప్రతా— (శుష్కస్వరముతో) మానసింహుఁడు నాయాక్రమణమును నిరీక్షించుచున్నాఁడు. నేను ఆతని యాక్రమణమును నిరీక్షించుచున్నాను. నేను ముందుగ ఆతనిపై నాక్రమణ సేయను. పర్వతసంకులమగు ఈకోమలమీరు మార్గమును గాచియుండెదను. నేను వారిపై నాక్రమణసేయువాడనె కాని అక్కడ ఎనుబదివేలు సుశిక్షిత మొగలసైనికులు గేరు. ఇంక నిచ్చట ఇర్వదిరెండువేలే నవశిక్షితులగు రాజపుత్రులు గలరు. అదియునుగాక మొగలులవద్ద ఫిరంగులున్నవి నావద్ద లేవు. ఔరా! ఇప్పుడు నాకు ఏబదిఫిరంగులైనను దొరికినచో వానికి నాకుడిచేయి కోసి యిచ్చుటకు సిద్ధముగా నున్నాను. ఇంక నాకేమియు నక్కఱలేదు. ఏబదిఫిరంగులు కావలయును.

(ప్రతాపుఁడు ఇటునటు వేగముతో తిరుగుచుండును. ఇంతలో గోవిందసింహుడు వచ్చును.]

గోవిం— రాణాజీకి జై

ప్రతా— ఎవ్వరు? గోవిందసింహుఁడా?

గోవిం— ఔఁ రాణాజీ!

ప్రతా— ఇంతరాత్రి నేలవచ్చితివి?

గోవిం— ఒకవిశేషవార్త యుండుటచే

ప్రతా— ఏమియది?

గోవిం— మానసింహుఁడు తనయభిప్రాయము మార్చుకొనినాఁడు.

ప్రతా— ఎట్లు?

గోవిం— శక్తసింహుఁ డాయనకు కోమలమీరునకుఁగల సుగమమార్గ

మును జూపించెను. అందుచే మానసింహుఁడు కొందఱ సైనికు
లకు ఆమార్గమునఁబోవుట కాజ్ఞాపించెను.

ప్రతా—శక్తసింహుఁడా?

గోవిం—అవును రాణాజీ! సలీమునకును మానసింహునకును సైన్య
ము నడిపించు విషయములో వివాదము గలిగెను సలీము మన
పై నాక్రమణము సేయుట కాజ్ఞాపించెను. కాని మానసింహుఁ
డాయాజ్ఞను నిరోధించెను అటుపిమ్మట శక్తసింహుడు వచ్చి
మానసింహునకు కోమల మీారుమార్గమును జూపించెను. ఇప్పు
డు మానసింహుఁ డామార్గమున మొగలులఁ బంపుటకు నిశ్చ
యించుకొనెను

ప్రతా—(నిట్టూర్పు విడిచి) గోవిందసింహాజీ! ఇప్పు డెక్కువ కాలవిలంబ
ము పనికిరాదు. రేపు ఉదయమే శత్రుసైన్యములపై నాక్రమణ
ము సేయునదిగా సామంతుల కాజ్ఞాపించుము. మనము వారి
యాక్రమణమును నిరీక్షింపవలదు. మనమే ముందుగ నాక్రమణ
ము సేయుదము. పొమ్ము.

(గోవిందసింహుఁడు పోవును)

ప్రతా—(తిరుగుచు తనలో) శక్తసింహా! శక్తసింహా! ఆఁ ఇది తప్పక
శక్తసింహునిపనియే శక్తసింహుఁడు మేవాడు ధ్వంసము చేయు
నని చెప్పిన ఆజోస్యుని మాట నాకు జ్ఞాపకమున్నది. ఇంక నేమి
యు ఆశలేదు ఇంక నాజోస్యుని మాటయే సత్యమగును.

ఉ॥ చేవదలిర్ప నాయుదయసింహుఁడు నాజనకుండు ధైర్యసం
భావితచిత్తుఁడై మునలుమానులబాడి కెదిర్చి వెన్కకుం
బోవక పోరియున్న రనపుత్రులమూట చితౌరుకోట నే
డీవిధి పారతంత్ర్యమయహీనతకుఁ నతశీర్షమాన్కొకో॥

ఉ॥ ప్రాణములన్ దృణమ్ములుగ భావనచేసి యవార్యశౌర్య పా
రీణత నాలమందు చెలరేగు తురుష్కభటాళినెల్ల హై
రాణనుబెట్టి నీమపరిరక్షకు నాజయముల్లు ఫత్తెయుల్
ప్రాణములిచ్చి ధన్యతములయ్యిరిగాదె చితౌరుదుర్గమా!

మంచిది. నేను చితౌరు నుద్ధరింపఁజాలనిచో దానికై ప్రాణము లీయఁగలను (వెనుకనుంచి లక్ష్మి ప్రవేశించును)

లక్ష్మి—నాథా! మీరెంకను మేలుకొనియే యున్నారా?

ప్రతా—ఇప్పు డెంత ప్రొద్దు పోయినది?

లక్ష్మి—రెండుజాములైనది! మీ రింతదనుక నిద్రపోలేదా?

ప్రతా—నాకు నిద్రపట్టుటయే లేదు

లక్ష్మి—చింతచేతనే మీకు నిద్రపట్టుటలేదు. మీ రీచింతలనెల్ల విసర్జింపుఁడు సంగ్రామము క్షత్రియుని కార్యము. జయాపజయములు దైవాధీనములు. ఏమి కానున్నదో అగును జీవనమరణములు క్షత్రియుని లీలామాత్రములు ఇంక చింత యెందుకు?

ప్రతా—రేపుప్రొద్దున మొగలసైన్యముల ముట్టడించుట కాజ్ఞనొసఁగితిని. ఇప్పు డాయాలోచనచేతనే నాతల తిరుగుచున్నది. ఒడలి యందలి రక్తమంతయు నెత్తికెక్కినది. నాకు నిద్రవచ్చుటలేదు.

లక్ష్మి—ఎట్లైన మీరీచింతను విసర్జింపుఁడు. రేపు యుద్ధమగును అందు మీ రెంతయు నాలోచన చెయవలసి యుండును. పరిశ్రమచేయవలయును. గాన ఇప్పుడు కొంచెము నిద్రింపుడు ప్రొద్దున మీశరీరమునకు నూతనప్రాణమును, నూతన తేజమును, నూతనోత్సాహమును గలుగును

ప్రతా—నేను నిద్రింపవలెనని యనుకొనుచున్నాను. గాని నిద్రవచ్చుట లేదు. నిద్రించుటచే శరీరము చుఱకనగ నుండుననియు, నూతన ప్రాణము, నూతన తేజము నూతనోత్సాహమును గలుగునని యు నెఱుఁగుదును. కాని నాకు నిద్రవచ్చుటలేదు. ఇప్పుడు నాకంటి కెవ్వరు నిద్రనీయఁగలరు!

లక్ష్మి—రండు. నేను నిద్రపుచ్చుటకు ప్రయత్నించెదను.

(ఇద్దఱును డేరాలోనికిఁ బోదురు.)

షష్ఠదృశ్యము

---

స్థానము—శిబిరబహిర్భాగము, సమయము—అర్ధరాత్రి
[మేహరున్నిసా ఒంటరిగ పాడుచు తిరుగుచుండును]

గీతము

వానిని ప్రేమింప నీవు వలదని వారింతు నెపుడు
మానక సంతతము నాదుమనము వానిపదములఁ బడు
అతనిపొత్తు దెంపిపోనఁగ జతనముసేసినకొలంది
అతనికు మతియు బలపడి సాధ్యముగాకుండును గడింది
బలిమిని ప్రేమస్రవంతి బంధింపఁగఁ గట్టవేతు
తలఁగక యస్రువులధార దాని త్రెంచు నేమిసేతు

(దాలతు ప్రవేశించును)

దాల—ఏమి వదినా! నీవింత ప్రొద్దుపోవువరకు మేల్కొనియుంటివా?

మేహ—నీవు నిద్రించుచుంటివా?

దాల—నాకు నిద్రవచ్చుట లేదు.

మేహ—నాకు నదియే స్థితి. నిద్రవచ్చుటలేదు.

దాల—నీ కెందుకు నిద్రపట్టుటలేదు?

మేహ—వహ్వా! నేనును సరిగా నిదియే నిన్ను అడుగ నెంచితిని. ఊహ యెట్లు కలసినదో చూడుము. అయితే నీకు నిద్ర యెందుకు పట్టుట లేదు?

దాల—మాట నిట్లే టలాయించెదవా?

మేహ—ఇంక చాలును దీనికి జబాబు నావద్ద లేదు నేను నీకు ఓడితిని. మంచిది వినుము. రాత్రి నీకును నాకును గడచి నది ఇద్దరమును మేలుకొనియే యున్నాము. ఇద్దఱకును మేలు కొని యుండుటకు కారణమును ఒకటియే- నిద్ర రాక పోవుట. నిద్ర రాకుండుటకు కారణముకూడ ఇద్దఱకును ఒకటియే. అది నీవును చెప్పఁజాలవు. నేనును చెప్పఁజాలను

దాల—ఎందుకని?

మేహ—చెప్పుచుంటినిగదా ఆకారణము చెప్పఁజాలము.

దాల—అయినను చెప్పుడు.

మేహ—నీయందిదే పెద్దదోషము అయిన దానికి కానిదానికి పట్టు పట్టెదవు అదుగో వినుము. నీకేమేని వినఁబడుచున్నదా?

దాల—ఏమి?

మేహ—ఆ మొగల సైనికు లెంత గాఢముగ నిద్రించు చున్నారో చూడుము

దాల—నేను నిద్ర యెందుకు వచ్చుట లేదు? అని అడుగుచున్నాను

మేహ—వారి గుఱ్ఱము ఇచ్చుటకు విన బడుచున్నది

దాల—ముందు నామాటకు జవాబిమ్ము.

మేహ—ఆ రాజపుత్రుల కాగడాలు నీకు కనుపించుచున్నవా?

దాల—అడిగిన మాటమాత్రము చెప్పవు.

మేహ—వారు ఫారా వేయుచున్నారు కాంబోలు

దాల—పో. నీమాటలు నేను వినను.

మేహ—కాదు కాదు. విను.

దాల—ఊఁహూ. నేను వినను

మేహ—కాదు. విను.

దాల—ఊఁహూ. నీవు మాట్లాడకుము.

మేహ—కాదు నేను మాట్లాడెదను.

దాల—నేను వినను.

మేహ—కాదు. నీకు వినకతప్పదు.

(దాలతు ముఖము త్రిప్పికొని నిలఁబడును మేహారు ఆమె ముఖమును తనవైపునకుత్రిప్పఁగోరును. కాని ఆమె అట్లేయుండును.)

మేహ—అయితే వినవుకాదు! (ఆవలించి) నాకు నిద్ర వచ్చుచున్నది. ఇంక నేను వెళ్ళి నిద్రించెదను.

దాల—ఎక్కడకు వెళ్లెదవు? చెప్పి వెళ్లుము.

మేహ—ఇప్పుడు విననని అంటివిగదా?

దాల—లేదు నే నేదియో ఆలోచించుచుంటిని.

మేహ—నేను నాలోచించు చుంటిని.

దాల—ఏమి?

మేహ—నేననుకొనినది సరియగునా కాదాయని. ఇపుడు నాకది సరి యని యే తోఁచుచున్నది. నేను గ్రంథములలోఁ జదివిన దంత యు సరిగా సరిపోవుచున్నది. ఇట్టి స్థితిలో మానవులకు రాత్రి యంతయు నిద్రపట్టదు వారు చాటుమాటుగ అది నాకు లభిం చునా లభింపదా యని ఆలోచింపుచుందురు. అన్నిటికంటె పెద్దవిచారము తన్నెవరేని చూచిరో తన విషయ మెవరేని తెలిసికొనిరోయని కాలు గాలి పడినవానికి మొదటి విచారము తన్నెవరేని చూచినారేమోయని.

దాల—తుదకు నీవు నాకుగూడ దాఁచి యుంచెద వెందుకు? నీప్రియుని నే నేమియు లాగికొనను.

శక్త—(దాలతో రెండు చేతులతో మేహారు కోరు మూయును. మేహారు ఆమె చేతులు విడిపించుకొనును)

మేహ—ఏమి? నీ వ్యాధిని నను బాగుగ కనిపెట్టితినా? తలవంచు కొంటివి. సిగ్గువచ్చినదా?

దాల—పో.

మేహ—మంచిది పోవుచున్నాను (వెళ్ళఁబోవును)

దాల—ఎక్కడకు బోయెదవు? ఒకమాట వినుము

మేహ—(తిరిగి) ఏమి చెప్పెదవో చెప్పుము. మరల నూరకుంటివేమి? చెప్పుము నేను నీవ్యాధిని బాగుగ కనిపెట్టితినా?

దాల—ఆఁ వదినా తెలసికొంటివి. ఇంతకు ఏమేని ఆశయున్నదా?

మేహ—ఆశయా? ఏమి ఆశ? స్పష్టముగా నేల చెప్పవు. ఈ పొడుపు కథ లెందుకు? మంచిది ఉండనిమ్ము. నాకు తెలసినది లెమ్ము. ఆశ యెందుకు లేదు? ఇది యేమియు క్రొత్త సంగతి కాదు. మొగలులకు రాజపుత్రులకును తరుచు వివాహములు జరుగు చునే యుండును

దాల—కాని వారు ఇష్టపడనిచో.

మేహ—ఇష్టపడరని యెట్లను కొంటివి?

దౌల — ఆయనకు చాల గర్వము, ఆయన రాజపుత్రుఁడు రాణా ఉదయసింహునకుఁ బుత్రుఁడు,

మేహ — నీవును గర్వితుఁడగు హుమాయూన్ మొగలు బాదుషాకు దౌహిత్రివి. నీవెవరికి తీసిపోదువు?

దౌల — వీఁగుచో —

మేహ — ఒకమాఱు ప్రయత్నించి చూడుమందువు కాదు! మంచి? ఈ పని నాకు విడిచిపెట్టుము, కాని — ఈ పనికి మఱియొకరు పూను కొనినచో చాల బాగుగనుండును

దౌల — ఏమి?

మేహ — ఇంక నీ ప్రసంగము విడువుము ఈ సంఘటన విద్యలో నేను కృతకార్య నగుదునో కానో చూచెదను

దౌల — తుదకు ఏమగునని నీ వూహించుచున్నావు?

మేహ — ఊహించుట గీహించుట నాకేమియు తెలియదు. ఈ పని యగునని మాత్రమే నాకు తెలియును. నేనుపట్టినపని ప్రాణముపోయినను తుద నెగ్గింపక విడువనని నీవును ఎఱుఁగుదువు, వాస్తవమునకు ఈపనిలో నాకును కొంత యానందమున్నది.

దౌల — అనఁగా?

మేహ — శక్తసింహునితో నీకు ప్రథమ సమావేశము చేసినది నేను ఇప్పుడా సమావేశమును సఫలము చేయక నా కెట్లు నిద్రపట్టును. ఇంత కష్టపడి పరికరములన్నియు పోగుచేసియుంచితిని ఇప్పుడు భవనము ను నిర్మింపనిచో నా కష్టమునకు ఫలితమేమి? నే నేపనిని అసంపూర్ణముగా విడువను, మంచిది వెళ్ళి నిద్రపొమ్ము. తెల్లవారవచ్చినటులున్నది,

దౌల — రమ్ము పోదము నీతో నింక నేమని చెప్పుదును!

మేహ — ఏమియు చెప్పనక్కఱలేదు, నీవు పొమ్ము నే నిప్పుడే వచ్చుచున్నాను. (దౌలతుపోవును) ఖుదా! రక్షింపుము. పాప మీ దౌలతు తానెవనిని ప్రేమింపుచున్నదో నేనును అతనిని ప్రేమింపుచున్నానని యెఱుఁగదు. కాని ఈ సంగతి దానికి తెలియఁగూడదు. ఖుదా!

ఈవిషయము మనయిద్దరకే తెలియవలయును. నాకుదొంతున్ని సామనోరథమును దీర్చు శక్తి నిమ్ము. ఇంక నామనోరథ మది యే నెరవేరఁగలదు. నాకై నేనేమియుఁ గోరుటలేదు. ఈశ్వరా! నాకు నా మనోరథము నెరచుకొను శక్తి నిమ్ము నా కోమల హృదయమును గఠోర మొనరింపుము, నాహృదయమునఁ బుట్టిన ప్రేమావేగము పరిశల్యాగ విధానమునఁ బరిణతము గాఁగాక.

## సప్తమదృశ్యము.

స్థానము—హాల్దీఘాటు యుద్ధభూమి. సమయము—ప్రభాతము

(ప్రతాపుఁడును పెక్కు రాజపుత్రులు నిలఁబడియుందురు)

ప్రతా—సోదరులారా! నేఁడు యుద్ధదినము ఎన్నినాళ్ళనుండియో నేను మీకుగఱపిన రణశిక్షకు నేఁడు పరీక్షాదినము సోదరులారా! మొగల సైనికుల సంఖ్య ముందు మనసైనికుల సంఖ్య చాలా స్వల్పమని నే నెఱుఁగుదును రాజపుత్ర సైనికులు స్వల్పసంఖ్యాకులయ్యును వారియందు శక్తి యున్నది—వారియందు బలము న్నది. నాకు మీతో నొకమాట చెప్పుటకు లజ్జయగుచున్నది; నోటమాట వచ్చుటలేదు కన్నుల నశ్రుధార గట్టుచున్నది.

గీ॥ మనవలెన్ దేశమునకయి ప్రాణ మిడఁదగిన
వారు, రాజపుత్రకులు మేవాడు ప్రభులు
నామాతమ్ముండు నాభ్రాతృ నందనుండు
వైరులంగూడి మనపైకి వచ్చిరిపుడు॥

కానిందు నాశిబిర మేమియునంత గొడ్డువోవలేదు సాలుంబర పతి, ఝాలపతి, చండుఁడు, ఫత్తాపుత్రులు నీయుద్ధమున నాపక్షమున నున్నారు ఈ యుద్ధమున న్యాయము మన పక్షముననే యున్నది, ధర్మమును మనపక్షముననె యున్నది, రాజపుత్ర కుల దేవతలును మనపక్షముననే యున్నారు, రాజపుత్ర వీరులారా!

మన మీ యుద్ధము నొకరి కపకారముచేయు తలంపుతోఁ జేయుట లేదు. మొగలులు మనస్వాతంత్ర్యమును హరించిరి. దానిని తిరిగి రాఁబట్టుకొనుటకై మనము యుద్ధము చేయుచున్నాము

సీ॥ దేశమాతకుఁ బరాధీనత దొలఁగించి
స్వాతంత్ర్యసుఖము నొసంగుటకును
హైందవసుందరుల్ పొందుసంకటములఁ
బాపి వారికి దారి చూపుటకును
భయలోభముల పాఁబడి కృశియించెడు
హిందూమతి ముద్ధరించుటకును
నివురుగప్పిన క్షాత్రనిబిడ తేజోవహ్ని
నిల నధర్మంబు దహించుటకును

గీ॥ ప్రతినదాలిచి సంగర రంగమందు
నుఱుకుచున్నాము, విజయమ్ము నోటమియును
ఈశ్వరాధీనములు, వాని నెంచబోక
పోరుడీ బీరమున రాజపుత్రులార॥

వీరవరులారా! నేటిదినము మనకు చాల గౌరవప్రదము. మాతృదేశోద్ధరణమునకై మన మీసంగరమును చేయుచున్నాము.

సీ॥ ఈ సంగరమ్మె ఢిల్లీ సార్వభౌముని
యుచ్చసింహాసన • మూఁచివైచు
ఈయుద్ధమే భారతీయ చరిత్రలో
స్వర్ణాక్షరమ్ముల వ్రాయఁబడును
మీ రక్తబిందువే • మీవీరసంతతి
నుదుటఁ గుంకుమపువ్వువిధము మెరయు
మీవీరగాథలే భావికవీంద్రుల
కవితకు జీవమ్ము గలుగఁజేయు

గీ॥ భరతఖండమ్మునందు నపారవిక్ర
మోర్జితంబగు నొకజాతి యుండెననుచుఁ

క్రీతి ముక్కున క్రేలిడి లాతిజాతి
వారు మీా శౌర్యములఁ జదువంగఁ గలరు.

సోదరులారా! మీా రిది జ్ఞాపక ముంచుకొనుఁడు. మనకు ప్రతి పక్షులు మఱియెవ్వరును గారు సాక్షాత్తు అక్బరు బాదుషా. ఇప్పు డీ యుద్ధమున వచ్చినది. అయన కుమారుఁడగు సలీమును, సేనాపతియగు మానసింహుఁడును గాన మన మిపుడు శత్రువుల కనుగుణమగు యుద్ధ మును జేయ వలయును

అందఱు—జై రాణాప్రతాపసింహునకు జై

ప్రతా—రామసింహా! జయసింహా! మీారు బేదనోర్ప్రభువగు నాజయ మల్లుని పుత్రులనుమాట మరవకుఁడు. చిత్తూరుదుర్గమును రక్షిం చుచుండగా మీాతండ్రిని అక్బరు చాటునుండి తుపాకిపేల్చి చంపెను. సంగ్రామసింహా! ఏసిసోదియావీరుఁడు పదియారేండ్ల ప్రాయమున తనతల్లితోడను భార్యతోడను కలసి చిత్తోరుదుర్గ మున ఘోరసంగర మొనరించెనో ఆఫత్తాప్రభునివంశమున మీారు జన్మించితిరి. వారి కవమానమును రానీయకుఁడుసుమా. గో విందసింహా! రోహిదాసూ! ఝూలాపతీ! మానా! మీాపూర్వు లుగూడ స్వాతంత్ర్యసంగ్రామమునఁ బ్రాణములు విడిచిరి. నేఁడు కూడ నట్టి స్వాతంత్ర్యసంగ్రామమే జరుగుచున్నదని తలఁపుఁడు. వారికీర్తిని స్మరించి సమరానలమున నుఱుకుఁడు. (ప్రస్థానము.)

అందఱు—జై రాణాప్రతాపసింగునకు జై (ప్రస్థానము)

(కొంచెము దూరమున భేరీవాద్యము వినబడును)

దృశ్యాంతరము (౧)

స్థానము—హాల్దీఘాటు యుద్ధక్షేత్రము, సమయము—ప్రభాతము.

(సలీము మహాబత్ఖాను నిలచియుందురు)

మహా—శాహజాదాసాహెబ్! మీారు ప్రతాపసింహుని గురుతించితిరా?

సలీము—లేదు.

మహా—అదుగో ఎదురుగ ఎఱ్ఱజెండా కనుపించుచున్నదా? దానిక్రింద

నే వారు నిలఁబడియున్నారు. వారి నల్లగుఱ్ఱ మెంతగొప్పది! ఆ విశాలవక్షము, ఆ దేదీప్యమానమగు ముఖము, హస్తమున ఖడ్గము, ప్రక్క బల్లెము ఆయనయే ప్రతాపుఁడు.

సలీము—ఆయనకుడిప్రక్క నున్న దెవరు?

మహా—ఝాలవాడు ప్రభువగు మానా.

సలీము—ఎడమప్రక్క నో

మహా—సాలుంబరప్రభువగు గోవిందసింహుఁడు.

సలీము—చూడుఁడు అందఱు ముందుకు వచ్చుచున్నారు. వారి ముఖములందు విశ్వాసము, దృఢత్వము ప్రతిఫలించుచున్నవి. వారు మనమీదికి దండెత్తి వచ్చుచున్నారు ఇంక మనసైనికులఁ జూడుఁడు రాతిబొమ్మలువలె నెట్లు నిలఁబడియున్నారో వీరే దండెత్తవలయును.

మహా—కాదు. మానసింహ మహారాజు హుకుము ముందుగ వారినే దండెత్తనీయవలయునని.

సలీము—కాదు ఇది వెఱ్ఱితనము. మనమే శత్రులపైఁ గలియపడవలెను.

మహా—కాదు శాహజాదాసాహబ్! రాజామానసింహుని హుకుము వేఱు.

సలీము—మానసింహుని హుకుమా! మానసింహునిహుకుము నావద్ద కాదు ఎవ్వఁడక్కడ? నా అయిదువేల రౌతులను బిలువుము. నేను శత్రులపైకి దాడివెడలెదను.

మహా—శాహజాదాసాహబ్! మీరు వ్యర్థముగ ఈప్రజ్వలితానలమున నుఱుకుటకు ప్రయత్నింపకుఁడు.

సలీము—మహాబత్! నీవును నామాట వినవా? పొమ్ము. ఇప్పుడే వెడలి పొమ్ము.

మహా—చాల మంచిది. (ప్రస్థానము)

సలీము—మానసింహున కింత సాహసమా! ఒకసామాన్య సైనికుని పాటి శక్తియును నాకు లేదా? ఎవ్వరును నన్ను లక్ష్యపెట్టుట

లేదు ఓయీ గర్వోన్మత్తా! మానసింహా! నీకింత తలపొగరా! మంచిది ఈయుద్ధము సమాప్తముకానిమ్ము. నీయాగడ మడంచెదను (ప్రస్థానము)

దృశ్యాంతరము (౨)

స్థానము—హల్దీఘాటు యుద్ధక్షేత్రము, సమయము—అపరాహ్ణము.
(రాజపుత్రులును సర్దారులును ఖడ్గపాణులై అశ్వముల నధిష్ఠించి యుందురు.)

ప్రతా—మానసింహుఁడెక్కడ?

మానా—అతఁడు తనడేరాలో నున్నాఁడు రాణాజీ! మీరు మీకిరీటమును నాకొసంగుఁడు.

ప్రతా—ఎందుకు?

మానా—దీనినిఁబట్టి మిమ్ము అందరు గుఱుతించుచున్నారు.

ప్రతా—అయిననేమి?

మానా—శత్రుసైన్యమ్ములు మిమ్ము గుఱుతించి మీవైపునకే సాగి వచ్చుచున్నవి,

ప్రతా—మంచిది, రానిమ్ము- ప్రతాపసింహుఁను పొంచి దాఁగి యుద్ధముచేయుట నెఱుఁగడు సలీము, మహాబతు, మానసింహుడు వీరందఱకు నేను ప్రతాపసింహుఁడనని తెలియవలెను. వీరికి బలము సాహసము నున్నచో నాయెదుటకు వత్తురుగాక.

మానా—రాణాజీ!—

ప్రతా—మానా! ఇంక నూరకుండుము. ఈతఁడేనా సలీము?

రోహి—అవును రాణాజీ! (ఖడ్గపాణియై సలీము ప్రవేశించును.)

సలీము—నీవేనా ప్రతాపసింహుఁవు.

సలీ—నేను సహాజాదాసలీమును. రమ్ము నాతో యుద్ధము చేయుము. (ఇద్దఱును యుద్ధము చేయుదురు. సలీము వెనుకకు తగ్గును. పెక్కు సైనికులతో మహాబత్ఖాను వచ్చి ప్రతాపునిపై కలియబడును. సలీము అచ్చటనుండి వెడలిపోవును)

ప్రతా—ఎవరు మహాబతా?

గీ॥ పూజ్యవంశమ్మునన్ జీడ పుర్వ్వావోలె
పుట్టితివి నీదుపుట్టుక బుగ్గిగాను
ఓ కులాంగార! మాతృఘాతీ! కలంకి
కలుషమతివి మహాబతుఖాను వీవె? (కన్నులు మూసికొనును)

మహా—అవును నేనే (మహాబతు సైనికులతో ప్రతాపునిపై గలియు బడును ఇంతలో వెనుకనుండి కొందరుసైనికులు వచ్చి ప్రతాపునిపై గలియబడుదురు ప్రతాపునికి చాల దెబ్బలు తగులును.

మానా—ప్రతాపుని కాపాడవచ్చి దెబ్బలు తగిలి క్రింద పడిపోవును)

మానా—రాణాజీ! నాకు పెద్దదెబ్బలు తగిలినవి.

ప్రతా—ఆఁ! మానా పడిపోయెనా?

మానా—రాణాజీ! నేను చచ్చిపోయినను మఱేమియు చింతలేదు. మీరుమరలిపొండు ఇటు శత్రువులు గుంపులు గుంపులుగా వచ్చుచున్నారు. లేకున్న చాఁకష్టము.

ప్రతా—మానా! నీవు చచ్చుట నెఱిఁగినవాఁడవును నేను ఎఱుఁగని వాఁడనునా? రానిమ్ము శత్రువులను.

(మహాబతుతో యుద్ధము చేయుచు చేయుచు ప్రతాపుఁడు శాలుజాతి పీఁచుఁగుల ప్రోగుపైఁ బడును మహాబతు ప్రతాప్రనితల నఱుకఁబోఁవును ఇంతలో పెక్కుసైనికులతో గోవిందసింహుఁడు వచ్చును.

మానా—గోవిందసింహా! రాణాజీని రక్షింపుము.

(గోవిందసింహుఁడు మహాబతుపైఁ గలియఁబడును. ఇరుపక్షముల సైనికులును పోరాడుచు అక్కడనుండి వెడలిపోదురు.)

మానా—రాణాజీ! మనకింక విజయము కలుగునను ఆశ యేమియు లేదు. దాదాపు మన సైన్యమంతయు మడసినది. ఇంక మీరు మరలిపొండు.

ప్రతా—లేదు. ఎన్నటికిని లేదు పోరాడెదను. బొందిని ప్రాణమున్నంతదనుక పోరాడెదను. నేను యుద్ధక్షేత్రమునుండి పాఱిపోవుట యెఱుఁగను, తెమ్ము, నాకత్తి తెమ్ము.

మానా—కాదు రాణాజీ! మీరు మరలిపొండు. చూడుడు శత్రువుల పెద్దదండు వచ్చుచున్నది

(ప్రతా—రానిమ్ము కత్తి యెక్కడ? (క్రింద పడియున్న ఒకకత్తిని దీసికొని) నాగుఱ్ఱ మెక్కడ? (ప్రస్థానము)

మానా—హా రాణాజీ! మీ రేమిచేయుచున్నారు! ఇందఱమొగలసైనికుల నెవ్వ రడ్డగించఁగలరు? ఈమూఱు రాణాప్రాణములు తప్పక పోవును. హా ఈశ్వరా! నీసంకల్ప మిదియేనా?

## అష్టమదృశ్యము

స్థానము—శక్తసింహుని శిబిరము. సమయము—సాయంకాలము

శక్తసింహుఁడు—(నిలఁబడి) ఏమిభయంకరయుద్ధము! ఏమిభయంకరయుద్ధము! ఫిరంగులమ్రోఁతలు, ఉన్మత్తసైనిక వీరాలాపములు, హయహేషలు, గజబృంహితములు, భేరీభాంకారములు, మరణోన్ముఖసైనిక సీత్కారములు! అబ్బా! ఏమియుద్ధము! ఒకవంక ఇసుకవేసిన రాలని అసంఖ్య మొగలభటులు! రెండవవంక కేవలము ఇర్వదివేల రాజపుత్రులు! ఒకవైపున పెద్దపెద్ద ఫిరంగులు రెండవవైపున కేవలము బల్లెములు కత్తులు! ఆహా! ప్రతాపసింహుని సాహసమెంత విలక్షణమైనది! ప్రతాప్! ప్రతాప్! నీవు ధన్యుఁడవు. నేడు నేను నాకనులతో నీయద్భుత విక్రమమును జూచితిని. నాకనులనుండి నిరంతర ప్రేమబాష్పములు ప్రవహింపుచున్నవి. నేఁడు నాహృదయము భక్త్యభిమానములతో నీపాదములపై నొరగఁగోరుచున్నది. ప్రతాప్! నేఁడు ప్రతిమొగల సేనాపతి నోటనుండియు నీశౌర్యప్రశంసయే వెలువడుచున్నది. ఆప్రశంసను వినిఅభిమానముచే నాయొడలు పెఱుగుచున్నది. అన్నా! ప్రతాప్!

ఉ॥ తావకసద్గుణమ్ములఁ బ్రతాపము నేఁ దెలియంగలేక దో
షావిలమైన చేతమున స్వర్గముపండెడు మాతృభూమి నే

నీవిధి స్వీయసోదరుల నెత్తురుటేరులఁ బాఱఁజేసితిర్
బావనరాజపుత్రకుల పాంసనుఁడ న్గయశమ్ము దాల్చితిర్

అన్నా! నన్ను క్షమింపుము. ఈమొగలసైనికులను ఈసుందర నిరుపమరాజ్యమునకుఁ బిలుచుకొని వచ్చినది నేనే. లజ్జాపరితాపములచే నాతల దించుకొని పోవుచున్నది.

[మహాబత్ఖాను ప్రవేశము]

శక్త—చెప్పుఁడు యుద్ధసమాచారము లేమి?

మహా—వహ్వా! చాల గొప్పప్రశ్న. ఒకచెంప ఘోరసంగ్రామము జరుగుచుండ, జనులందఱు చచ్చుచుండ, తగుదునమ్మాయని మెదలక హాయిగ డేరాలో పడియుండిరా! ఇదియే పౌరుషము?

శక్త—అయ్యా! వినుఁడు. నాకు మీతో నెట్టి సమాధానమును జెప్పుట కవసరము లేదు. నేను నాస్వేచ్ఛచే నీయుద్ధమునకు వచ్చితిని. నే నెవ్వరికిని నౌకరును గాను

మహా—మీ రెవ్వరికిని నౌకరు గారా? అయితే ఇన్నినాళ్ళనుండియు మీరు బాదుషాగారి దర్బారులో కేవలము స్తోత్రపాఠోద్యోగమున నేయుంటిరా?

శక్త—కొంచెము జాగ్రత్తగా మాట్లాడుఁడు

మహా—ఏమి?

శక్త—నాబుద్ధి యిపుడు సరిగా లేదు, లేకున్న ఈయుద్ధావసరమున నెవ్వఁడేని నేను నాడేరాలో కూర్చుండియుందునా?

మహా—చాలుచాలు ఈ ప్రగల్భములు చాలింపుఁడు మీపరాక్రమము చూచితిమిలెండు.

శక్త—మీరు అట్లే తలంచుచో రండు నాపరాక్రమము కొంచెము మచ్చుచూపెదరు (కత్తిదూయును)

మహా—ఆ రండు నేను సిద్ధముగ నున్నాను (కత్తిదూయును.)

తెరలో—ప్రతాపుని వెంబడించుడు నాకు వాని సిరము కావలయును

శక్త—ఆఁ! ఇది సలీముమాటగా నున్నది. ప్రతాపుఁడు పాఱిపోయెనా? ఆతని ప్రాణముదీయుటకై మొగలులు వెంబడించు చున్నారు

కాబోలు మంచిది. సాహేబ్! మీరు కొంచెము మాగుఁడు నే నిప్పుడే వచ్చుచున్నాను నాగుఱ్ఱము! (త్వరగా పోవును.)

మహా—ఈతఁ డొక వింత మానిసి. ఈతఁడు తప్పక ప్రతాపుని ప్రాణములు హరించుటకై వెళ్ళినాఁడు ఆహా! ఈశ్వరసృష్టి వైచిత్ర్యము! ప్రతాపుఁడు తనయన్నకుమారుని కత్తిఁ వేటున నేలఁ గూలెను. ఇప్పుడు తనతమ్మునిచే ప్రాణముబువాయ నున్నాడు. (విచారముతో పోవును.)

---

నవమ దృశ్యము

స్థానము—హల్దీఘాటు, ఒకచిన్ననదిఒడ్డు, సమయము—సాయంకాలము

((ప్రతాపుఁడు ఒకచచ్చిన గుఱ్ఱముపై దలపెట్టుకొని పడియుండును.)

ప్రతా—ఇంక నేమున్నది! అంతయు పోయినది. మూఁడునాళ్ళలో నే సర్వము సమాప్తమైనది మా పదియేనువేల సైనికులు చని పోయిరి నా ప్రేమాస్పదమగు అశ్వము చేటకముకూడ చనిపో యినది. శస్త్రాహతుడనయి ఈవిధమున ఈనదియొడ్డున బడి యుంటిని న న్నిక్కడకు గొనివచ్చినదెవరు! నాపురాణమిత్ర మగు నీ యశ్వమే, నన్ను సంకటమున జూచి ఇది పాఱిపోయి నచ్చెను నే నెంత యాపినను, కళ్ళెము లాగిపట్టినను లక్ష్యము సేయక నన్నిక్కడకు గొనివచ్చినది. తన ప్రాణమును దక్కించు కొనుటకై. కాదు. నన్ను కాపాడుటకై ఇది తనప్రాణము లిచ్చి నా ప్రాణములు గాపాడినది. ప్రియతమా!

ఉ॥ ఘాసము మెక్కు జంతువవు కావుటకైనను స్వామిభక్తి నీకా
వీసము బోల లేరెవరు నీఋణ మేనెటు దీర్చువాఁడ నా
కోసము మేను వాసితివి కూరిమి నెచ్చెలివైన నీదు వి
శ్వాసము నెన్నఁడుంగా మరవఁజాలను జేటకఘోటకాగ్రణీ!

ప్రాణబంధూ! నీవిటుల పాఱివచ్చుచుండ వెనుకనుండి "ఓకాలా శ్వారూఢా! నిలువుము" అనుమాట వినఁబడినది. అతఁడు నేను పాఱి పోవుచుంటి ననుకొనెను గాబోలు. చేటక్! ప్రియ చేటక్! నీవెందుకు

పాఱిపోయి వచ్చితివి? మన మిద్దరము యుద్ధమున ఒక్క మారుగనే చచ్చెదము వారముకదా చూడుము శత్రువులు నవ్వుచున్నారు. ప్రతాపుఁడు యుద్ధమునుండి పాఱిపోయె ననుచున్నారు. చేటక్! మరణ సమయమున నీవు నాయధికారము నెందుకు మన్నింప లేదు. ఎంత ఆపినను నీవెందు కాగలేదు? చూడుము నేనిపుడు సిగ్గుచే చచ్చిపోవుచున్నాను. నాతల తిరుగుచున్నది.

(శస్త్రధరులై ఖురాసాను ముల్తాను రాజులు ప్రవేశింతురు.)

ఖురా—ఇదుగో ప్రతాపసింహుఁ డిక్కడ పడియున్నాఁడు

ముల్తా—ఇతఁడు చచ్చిపోయినాఁడు

ప్రతా—(లేచి) నేను చావలేదు. ఇంకను జీవించియున్నాను. ఇంకను యుద్ధము ముగియ లేదు కత్తి దీయుఁడు.

ముల్తా—ఆఁ ఆఁ

ఖురా—అవశ్యము (ఇద్దరు ప్రతాపునితోఁ బోట్లాడు చుందురు.)

తెరలో—ఓకాలాశ్వారోఢా ఆగుము

ప్రతా—ఇంకను సైనికులు వచ్చుచున్నారు. ఇంక ఆశలేదు

ముల్తా—ఇంక కత్తి క్రింద పెట్టుఁడు

ప్రతా—చేతనగుచో పెట్టింపుఁడు,

(మరల యుద్ధమగును. ప్రతాపుఁడు మూర్ఛితుఁడై క్రిందపడును. ఇంతలో శక్తసింహుఁడు వచ్చును )

శక్త—ఆగుడు.

ఖురా—మఱియొక కాఫిరు వచ్చినాఁడు

ముల్తా—వీనినిగూడ చంపుము

శక్త—అయితే చావుఁడు. (వారియిద్దఱను క్రిందపడగొట్టి చంపును) ఇంక నేమియు భయము లేదు ఇంకఁ బ్రతాపసింహుని కేయాపత్తియును రాఁజాలదు. అన్నా !—అరే! వీరికి స్మృతియే యున్నట్లులేదు. సెలయేటినీటిని దెచ్చెదను. (నీరుదెచ్చి ప్రతాపునినోటిలోఁ బోయును ) అన్నా! అన్నా!

ప్రతా—ఎవ్వరు? శక్తా!

శక్త—ఇంకను మేవాడుసూర్యుఁ డస్తమింపలేదు. అఁ—అన్నా! నేనే.

ప్రతా—శక్తా! నేను నీచేతిలో ఖైదీనయితిని కాని నాకు సంకెలలు తగిలించి మాత్రము మొగలులదర్బారునకుఁ గొంపోవకుసుమా! ముందుగ నీచేతితో నాతల నఱికి దానిని మీప్రభువున కుపహారముగఁ గొనిపొమ్ము. నన్నీజీవితావస్థలోఁ బట్టుకొనిపోకుము. యుద్ధక్షేత్రమునఁ బోరుచుఁబోరుచు ప్రాణములు విడువవలయునని నాకు పెద్దకోర్కె యుండెడిది కాని సకాలమున నా గుఱ్ఱము చేటక్ కళ్లెములాగినను ఆగక యుద్ధభూమినుండి పాఱిపోయి వచ్చినది. దానినిఆపుటకు నే నెంతయో ప్రయత్నించితిని. కాని యాగలేదు యుద్ధములోఁ జచ్చుగౌరవము నాకుఁ దక్కినదికాదు. నాకు సంకెలలు తగిలించి నన్నింకను లజ్జితునిఁ జేయవలదు. నన్ను చంపివేయుము. సోదరా! శక్తా! కాదు కాదు. నిన్ను సోదరా యని నాపై నీకు జాలిపుట్టింపను నేఁడు నీవు విజేతవు, నేను విజితుఁడను నీవు చక్రమునకు పైనను౦టివి నేను క్రింద నుంటిని నీవు నిలఁబడియుంటివి, నేను నీపాదములకడఁ బడియుంటిని. ఇంక నిన్నేమియుఁ గోరను. నిన్నుగోరునది యిదియొక్కటే నీవు నాకు సంకెలలు తగిలించి తీసికొనిపోవద్దు కాని చంపుము నేనెప్పుడేని నీ కేదేని యుపకారము చేసియున్నచో దానికి బదులుగ నా యీ చిన్నిప్రార్థన నెఱవేర్పుము, నా కీభిక్ష పెట్టుము. నా యీ యంతిమవాంఛను దీర్పుము నన్ను చంపుము కాని నన్ను కట్టి తీసికొని పోవద్దు ఇదుగో నావక్షము దీనిపై ఖడ్గప్రహారము చేయుము.

శక్త—(కత్తి పాఱవేసి) అన్నా! మీ యీ విశాలహృదయమున నాకు స్థానమిండు.

ప్రతా—అయితే శక్తా! ఇప్పుడీ మొగల సైనికులనుండి నన్ను రక్షించినది నీవేనా?

శక్త—అన్నా! మీరు వీరుల కాదర్శ స్వరూపులు, స్వదేశ సంరక్షకులు రాజపుత్రకుల తిలకులు. మిమ్ము ఘాతుకులచేతిలో నెందుకు

చావనిత్తును? నే నిన్నినాళ్ళవరకు మీ మహాత్త్వము నెఱుఁగకుంటిని ఒకనాఁడు మీకంటె నేనే శ్రేష్ఠుఁడ ననుకొంటిని మీరు మరచియుండరు ఈ విషయము తేల్చుకొనుటకే నాఁడుమీతో ద్వంద్వయుద్ధము చేసితిని కాని నేఁడీయుద్ధములో మీరే శ్రేష్ఠులు నేనే. క్షుద్రుఁడను అని తెలిసికొంటిని మీరు వీరులు నేను కాతరుఁడను నేను నైచ్యముతో పగదీర్చుకొనుటకై నాజన్మభూమిని ధ్వంసము చేసితిని అయినను నేను మిమ్ము రక్షింపజాలుటనుబట్టి చూడ మేవాడురక్షణ మవశ్యంభావిగఁ గనుపట్టుచున్నది. మీరు రాజపుత్రకుల దీపకులు, వీరసింహులు, పురుషోత్తములు, నన్ను క్షమింపుఁడు.

గీ॥ కన్నతండ్రియు మదిఁ గనికరము లేక
నన్ను నిలువెళ్ళగొట్టనాఁడు దగికి
జేర్చి కాపాడినట్టి యచింత్యకరుణఁ
జూపి నాతప్పులన్నియు సైఁపుమన్న॥

ప్రతా—తమ్ముఁడా! తమ్ముఁడా! ఇద్దఱు కౌఁగిలించుకొందురు.

# రాణా ప్రతాప సింహ

## తృతీయాంకము

### ప్రథమదృశ్యము

స్థానము—సలీముగది  సమయము—అపరాహ్ణము,

[శత్రుప్రాప్తియై కోపావిష్టుఁడగు సలీము కూర్చుండి యుండును. ఎదుట శక్తసింహుఁడు నిలఁబడియుండును సలీముకు దగ్గఱగ ఆమేరు, మార్వాడు చందేరీరాజులును, పృథ్వీరాజును నిలఁబడి శక్తసింహుని వంక చూచు చుందురు.]

సలీము—శక్తసింహా! నిజము చెప్పుము. ప్రతాపసింహుని ఆవిధముగఁ గాపాడి పాఱిపోఁజేసినందుల కెవ్వరు బాధ్యులు ?

శక్త—శాహజాదాసాహబ్ ! మీరు మంచిప్రశ్న వేసితిరి. ప్రతాపసింహుఁడు యుద్ధరంగమునుండి బుద్ధిపూర్వకముగ పాఱిపోలేదు. వారికి ప్రాప్తించిన ఈయపకీర్తికి వారు బాధ్యులు గారు.

ఆమేరు—స్పష్టముగఁ జెప్పుము వారి పాఱిపోవుట కెవ్వరు బాధ్యులు?

శక్త—వారి గుఱ్ఱము చేటక్.

పృథ్వీ—(దగ్గును)

సలీము—వారు పాఱిపోవుటలో నీవేమియు సహాయము చేయలేదా?

శక్త—లేదు. నేనేమియు సహాయము చేయలేదు.

బికనేరు—అయితే ఖురాసాను ముల్తానురాజు లెందుకుజచ్చిరి ?

శక్త—కత్తిపదును నుండుటచే.

పృథ్వీ—(నవ్వు నాపికొనుటకై దగ్గును)

ఆమేరు—శక్తసింహా ! నీవు పరియాచకమున కిచ్చుటకు పిలువబడ లేదు. ఇది కచేరీ.

శ_క్త—అట్టులా! ఇది కచేరియా! మహారాజా! నేనిది య త్తవారి యిల్లు అనుకొంటిని. నేను పెండ్లికొడుకును, సలీము పెండ్లికూతురును, మీరందఱు వదినలు మఱదళ్లు ననుకొంటిని.

పృధ్వీ—(ప్రయత్నించినను నవ్వు ఆగదు)

సలీము—శక్తా! స్పష్టముగా సరియైన యుత్తరమిమ్ము.

శ_క్త—యువరాజా! నన్నేమని అడుగఁదలఁచుకొనినచో స్వయముగ మీరేయడుగుడు. ఈస్తుతిపాఠకుల మాటలు విన్న నాకు అతి కాలిమంట నెత్తికి వచ్చును.

సలీము—మంచిది, నేనే అడుగుచున్నాను చెప్పుము. మొగల సేనాపతులగు ఖురాసాను ముల్తానురాజులను ఎవ్వరు చంపిరి?

శ_క్త—నేను,

చందేరీ—ఇది నేను మొదటనే తెలిసికొంటిని.

శ_క్త—అవును. మీరు గొప్ప తెలివిగలవారు గదా.

పృధ్వీ—(మార్వాడ పతివంకఁ జూచును.)

సలీము—నీవు వారి నెందుకుఁ జంపితివి?

శ_క్త—నాయన్నయగు ప్రతాపుఁడు శస్త్రాహతుఁడై స్మారకము లేక పడి యుండెను. ఆస్థితిలో వారిద్దఱు ఆయనను చంపఁబోవుచుండిరి. నాయన్నను గాపాడుటకై నేను వారినిద్దఱను జంపితిని

ఆమేరు—అయితే నీవేనా యీపని చేసినది? నీవు చాల కృతఘ్నుఁడవు, మోసగాడవు, కాతరుఁడవు.

శ_క్త—జయపురాధిపతీ! నేను కృతఘ్నుఁడను గావచ్చును, మోసగాఁడను గావచ్చును. కాని కాతరుఁడనుగాను ఇద్దఱు పఠానులు కలసి రణ పరిశ్రాంతుఁడై క్రిందఁబడియున్న యొక వీరుని వధించుటకుఁ బ్రయత్నించు చుండనే నొక్కఁడను వారితో నెదురుపడి యుద్ధముచేసి వారినిఁజంపితిని. నేను హింసమాత్రము చేయలేదు.

సలీము—పోనిమ్ము. నీవు విశ్వాసఘాతుక కృత్యముచేసితినని యొప్పుకొనుచుంటివి గదా?

శక్త—త్రికరణశుద్ధిగా. యువరాజా! ఇందు ఆశ్చర్యమేమి? నేను మొదటినుండియు విశ్వాసఘాతకుఁడనే నేనీసమయమున మరల విశ్వాసఘాతుకత్వము చేయుటలో వింతయేమి? నేనింతకుమున్ను మొగలులతోఁ గలిసి నా దేశము, నాధర్మము, నాసోదరుఁడు వీరి విషయమై విశ్వాసఘాతుకుఁడను గాలేదా? ఇప్పుడు మరల నింకొకమాఱు విశ్వాసఘాతుకుఁడనైతి ననుకొనుఁడు ఇందు వింతయేమి? బాదుషా నన్ను విశ్వాసఘాతుకుఁడనని యెఱింగియే నాకు ఆశ్రయమొసంగలేదా? ప్రతాపుని అన్యాయ యుద్ధములో జంపుటకునై నేనొకమాఱు విశ్వాసఘాతుకుఁడను జేయఁబడియే యుంటిని అయితే ఈమాఱు ప్రతాపునిఁ జంపుటకు బదులుగ నేనాతనిని అన్యాయ హింసనుండి తప్పించితిని—ఆప్రతాపుఁడు మాత్రమెవరు? నాసోదరుఁడు. ఎట్టిసోదరుఁడు?—నిరాయుధుఁడయి నాలుగురెట్ల సేనతోఁ బోరఁగల వీరుఁడు స్వదేశరక్షణమునకై అడవులందును గొండలందును పెక్కుఇడుములుపడు మహాత్ముఁడు. మాజాతికి, మాదేశమునకు ఏకమాత్రమాధారము.

పృథ్వీ—(ప్రతాపుని యత్నములన్నియు వ్యర్థములను భావముతో తల యూపును.)

మార్వాడు—(చందేరీపతి చెవిలో నేదియో చెప్పును).

ఆమేరు—కొండదొంగయు రాజద్రోహియునగు ప్రతాపుఁడే కాదు?

శక్తి—ప్రతాపుఁడు రాజద్రోహి ఇంకమీరు గొప్ప దేశభక్తులు అవునా భగవాన్దాస్!

సలీము—అయితే ప్రతాపుఁడు రాజద్రోహి కాఁడనియా నీయభిప్రాయము,

శక్తి—ప్రతాపసింహుఁడు రాజద్రోహియును, అక్బరు బాదుషా చిత్తూరునకు న్యాయమైన ప్రభువునా? అట్లుగాదు రాజనైతిపరిభాషా శబ్దముల కర్థము విచిత్రముగ నుండును.

సీ॥ పరదేశములపైనఁ బడి దోఁచుకొనుట మా
రణము సేయుటను నాక్రమణమంద్రు
బలిసినపై నొక్కదుర్బలుని దేశమ్మును
హరియించుటను విజయంబటంద్రు
తాదోచుకొనిన రాష్ట్రమును శాసించుట
యమలశాంతి స్థాపనమనియంద్రు
చేతకానితనమ్ముచేత బానిసయయి
వర్తించుటను రాజభక్తియంద్రు
గీ॥ పోయిన స్వకీయవస్తువుఁ బొందఁగోరి
తోడరి కృషిసల్పువాని విద్రోహియంద్రు
నీచు ఘనుఁడంద్రు మఱి ఘనుఁ నీచుఁడంచుఁ
బలికెదరు రాజనీతి ప్రపంచమందు॥

పృథ్వీ—(అసమ్మతినిఁ ప్రకటించుటకు తలయూడించును.)

సలీము—అయినచో నీవు బాదుషాగారి నేమందువు?

శక్త—బాదుషాను భారతవర్షమందలి ప్రధానచోరుఁడందును చోరుఁడు సొమ్ములను దోఁచుకొనును బాదుషా రాజ్యముల దోచుకొనును ఇదియే భేదము.

పృథ్వీ—(అత్యాశ్చర్యముతో నోరు తెఱచును).

(సైనికులు శక్తసింహుని బంధింతురు.)

సలీము—శక్తసింహా! నీకేమిశిక్ష విధింపఁబడునో ఎఱుఁగుదువా?

శక్త—అంతగా విధించిన మృత్యువును విధించెదరు. అంతకంటె గొప్ప శిక్ష లేనే లేదు. నేను క్షత్రియుఁడను. చావునకు వెఱువను. నేను చావుకు వెఱచువాఁడనేయగుచో అసత్యము పలికి యుండు వాఁడను మఱియు నాకెట్టిభయమేని యున్నచో నాయంతట నేను మొగలుల శిబిరమున కెన్నఁడునురాను. సత్యమును జెప్పుటకై నేనిచ్చటకు వచ్చినపుడు మొగలులు నాసత్యమును మెచ్చుకొని నన్నుక్షమించెదరని నేను తలఁచియుండలేదు. నేను చాలదినములనుండి మొగలుల సహవాసము చేసితిని. వారి

స్వభావమును బాగుగ నెఱుఁగుదును. అక్బరుని స్వభావముగూడ నేను బాగుగ నెఱుఁగుదును. అతఁడు మాయావి, అవివేకి, కపటి, రాజనీతి విశారదుఁడు ఇంకనీవో మూర్ఖుఁడవు నిరక్షరకుక్షివి, విద్వేష ప్రధానుఁడవు, రక్తలోలుపమగు పిశాచమవు

పృధ్వీ—(జాలిగ శక్తసింహునివంక చూచును)

సలీము—నీవు ఇంటనుండి వెడలఁగొట్టగా మొగలాల ఎంగిలికి ఆసించి వచ్చిన విశ్వాసములేని కుక్కవు. ఇంకను గన్నులెఱ్ఱచేయుచుంటివా? మోసమునకు శిక్షమృత్యువు. దానికిముందు ఈ అవసరనై వేద్యము గానిమ్ము. (తన్నును, వీనిని కైదులోనుంచుఁడు. తర్వాత నితఁడు వేఁటకుక్కల కెఱయగును (ప్రస్థానము)

శక్తి—ఒక్కక్షణమాత్రము నన్నెవఁడేని విడిచిపెట్టుఁడు. తర్వాత ఏశిక్ష విధించినను సరియే ఒక్కమాఱుమాత్రము విడిచిపెట్టుఁడు. (పృధ్వీరాజు జాలితో శక్తసింహునిఁ జూచును. శక్తసింహుఁడు విడిపించుకొనుటకు ప్రయత్నించుచుండ సైనికులు అతనిని గొనిపోవుదురు.)

## ద్వితీయదృశ్యము.

స్థానము—దౌలతున్నిసాగది సమయము—అపరాహ్ణము

[మెహారు, దౌలతు నిలఁబడియుందురు మెహారు పాడును.]

గీతము.

ప్రేమ విషమయమ్మటంచు నామదిగుఱితెంతునేని
ఈమహితవ్యథలఁ బొందనేల గ్రోలియుందుదాని?
ప్రేమసుఖము గడుస్వల్పము ప్రేమపీడ గడునధికము
ప్రేమసుమము శుష్కము, గాఱించు తగులఁగంటకము.

దౌలతు—(మెహారును జఱచుచు) ఇంతకు ఏమైనది?

మెహా—ఆహా! “ప్రేమసుఖమెంత గొప్పదై వెలయుచుండు?”

దౌల—గొప్పదా?

మెహా—చాలగొప్పది “ఒక్కక్షణమున నే యస్తమొందుచుండు”

దౌల—ఏమి దానిగొప్పతనము?

మేహ—దాని గొప్పతనము చెప్పనలవిగాదు. ఎదను బహువేదనలను నొందించుచుండు'

దౌల—పో నేను వినను

మేహ—కొంచెము విందు!

దౌల—ఊఁహూ నేను వినను.

మేహ—మంచిది. వినకుము. అయితే శక్తసింహుఁ డేమిచేయును?

దౌల—(ఔత్సుక్యముతోఁ జూచును)

మేహ—పాపమాయన అన్నప్రాణము కాపాడుటకై వెళ్ళి తనప్రాణములపైకి తెచ్చుకొనినాఁడు

దౌల—మెహర్!

మేహ—కాని సలీము మంచిపనిచేసినాఁడు ఇట్టివారికి ఇట్టిశిక్షయే విధింపఁబడవలెను ఇందు సలీముదోప మేమియు లేదు.

దౌల—మేహర్! ఏమి అట్లనెదవు?

మేహ—నేనేమి చేయుకును. నేను చేసినదంతయు సరిగానే చేసితిని. కాని సలీము అంతయు పాడుచేసినాడు.

దౌల—అయితేసలీము శక్తిసింహునకు మరణదండనము విధించెనా?

మేహ—అతనియాజ్ఞ కర్థమిదియనియే నాతలంపు.

దౌల—కాదు. నీవు పరిహాసము చేయుచున్నావు

మేహ—మంచిది. పరిహాసమే యనుకొనుము. కాని శక్తసింహునకు మాత్ర మిది పరిహాసముగాదు. అతఁడెంత వీరుఁడేని కానిమ్ము. అతని ప్రాణముమాత్ర మతనికి ప్రియమైనదే.

దౌల—తుదకు సలీము ఇట్టి శిక్ష నేల విధించెను?

మేహ—ఈశ్వరుఁడు శక్తిసింహుని సృజించుటలో కొంచెము లోపము చేసెనని అతఁడు బాగుగ గ్రహించెను.

దౌల—ఏమి లోపము?

మేహ—లోపమిదియే. ఆతని చేతులుకాళ్ళు మొదలయిన అవయవము లన్నియు యథాస్థానమునఁ జక్కగనే కూర్చబడినవి. కాని

అతని మెడకాయపై తలకాయ చక్కగా కూర్చబడినట్లు నలీమునకుఁ దోఁచలేదు గనుకనే యతఁడు ఈ లోపమును దీర్చుటకై శక్తసింహుని తలతీయుట కాజ్ఞాపించెను. ఇంతకన్న మరియేమియు లేదు, ఇందు అద్భుత మేమన శక్తసింహుఁడు దీని కేమియు మారుసెప్పలేదు.

దాల— దేనికి మాఱు?

మేహా— దేనికిమాఱా! ఇదియే తలకాయ సరిగాకూర్పఁబడినదో లేదో కాని యది జన్మకాలమున ఈశ్వరునిచే ప్రసాదింపబడినది. ఈశ్వరసృష్టికి ప్రతివిధానము సేయుటకు మనమెవ్వరము? ఎవ్వఁడేని వచ్చి నాతల తెగవేయు ననుకొనుము నేను నిలఁబడి యుందును. నాతలకాయవచ్చి నా కాళ్ళకడఁబడి దుమ్ములో దొర్లు చుండినచో అప్పుడేమగును? ఊరకుంటివేమి? చెప్పుము. నీ ముఖము వెల్లబోయిన దేమి?

దాల— వదినా! ఇప్పుడాయనను రక్షింపవలయునన్నచో నీవే రక్షింపఁగలవు. ఆయనకు మరణదండము విధించినచో నేనొక్కదినమేని బ్రతుకఁజాలనని నమ్ముము. నేను ఒట్టుబెట్టి చెప్పుచున్నాను. ఆయన చనిపోయినచో నేనును విషము దిని ప్రాణత్యాగము చేసెదను.

మేహా— నీవు ప్రాణత్యాగము చేయుచో చేయుము, దీనికింత గర్వ మెందుకు? నీకు పూర్వమే యెందరో ప్రేమకై ప్రాణత్యాగము చేసియున్నారు. నేను గ్రంథములలో నిట్టి కథలెన్నియో చదివితిని. ప్రాణత్యాగము చేసెద నని ఇంతగా చాటించి చెప్పుట కది యేమియు నంత పౌరుషకార్యముగాదు. ఇంతకు నీవు ప్రాణత్యాగము చేసినప్పటి మాటకద. పోనిమ్ము నీవు తప్పక ప్రాణత్యాగము చేసెదవే యనుకొందము. నీవంటి వా రిదివరకు లక్షతొంబదిమంది చేసినారు.

దాల— అయితే ఆయనప్రాణము రక్షించుట కేమియునుపాయము లేదా?

మేహా— (గంభీరభావముతో తల వంకించి) నీవు నీప్రాణము నొసఁగు

టయే దానికి ఉపాయము. ఆ ఉపాయము నీవు చేయనే చేయుదువు. ఇంతకంటె వేఱు ఉపాయము లేదు. ఇదుగో ఒక సంగతి. నీవు ప్రాణత్యాగమే చేయుచో చిరకాలము భూమిపై నీ పేరు నిలచు పద్ధతిపై చేయుముసుమా!

దాల—అది యెట్లు?

మేహ—నీవు నీ శృంగారభవనములో ముఖమల్లు పరచిన సోఫాపైఁ గూర్చుండుము ఎదుట నొకచక్కని ముక్కాలిపీటపై నొకజరీబట్ట పరచి దానిపై నొకవెండిగిన్నె యుంచుము. దాని నిండ విషముండవలయును. తెలసినదా? ఆగిన్నెను బంగారుచేతులతో నెత్తి యొక చక్కని పద్యముగాని కీర్తనగాని పాడుము. అప్పుడు దానిని మెల్లగా నీబింబాధరము వద్దనుంచుము. త్రాగునప్పుడు గడ్డము పైకి నెత్తఁ గూడదు తర్వాత వీణనుమేళగించి శక్తసింహుని నుద్దేశించి త్రిశగతిలోసింధుకమూచి రాగములోనొకకీర్తన పాడుము. అట్లుపాడుచుఁ బాడుచుకూర్చుండియే ప్రాణత్యాగము సేయుము, చేతులుకాళ్ళు నేమియుకదలించగూడదుసుమా? నీవీవిధముగఁ బ్రాణత్యాగము సేయుచో ప్రపంచములో కొంతకాలము నీపేరుండును నీబొమ్మలు చిత్రించెదరు. ముందువారికి నాటకములు వ్రాయుటకు సామగ్రిదొరకును.

దాల—ఏమిపదినా! నీకుపరిహాసము చేయుటకిదియే సమయము దొరకినదా?

మేహ—పరిహాసమున కింతకంటె మంచిసమయమేది చెప్పుము? మీరిద్దఱు నొక్కమాఱు మాత్రమే కలసికొనిరి. అదియును ఏపొదరింటిలోనో, ఏయమునాతీరముననో ఏవెన్నెలరాత్రిలోనో ఏనొకయందో కాదు—యుద్ధభూమిలో, ఒక మామూలు డేరాలో. కలసికొనిరి. అదియును ఏకాంతమునఁగాదు, అక్కడ మఱియొక మానిసియుండెను ఆమానిసియే విమ్మలను సమావేశ పఱచినది. ఒక్కమాఱు ఒకరినొకరు హఠాత్తుగ చూచుకొనిరి, దానికే యీప్రేమ—ఈప్రాణత్యాగము, ఈప్రపంచము

శూన్యమగుట!—ఇంతకంటె పరిహాసమునకు విషయమేది?

దాల—ఏమిఏదినా! నిజముగ దీనికేమియు నుపాయము లేదా? నీవీ వ్యవహారములో నేమియు చేయఁజాలవా? నిజముగ నీవు వెళ్ళి సలీముతోఁ జెప్పిన ఆతఁడు ఆయనను క్షమింపకుండునా?

మేహ—నీవొక పని చేయుదో నిదియంతయు నగును.

దాల—నీవు ఏది చెప్పిన అదియే చేసెదను ప్రపంచములో మానవునకు సాధ్యమైన దెల్ల చేసెదను?

మేహ—నీవు ఏదో పెద్దజబ్బు వచ్చినట్లుగా మెదలక పడియుండుము చూచువారు చచ్చినదో లేక చావునకు సిద్ధముగనున్నదో యని తలఁచునట్లుండవలెను అంతట హకీములు, వైద్యరాజులు, ఆయుర్వేద పంచాననులు, కవిరాజ కంఠీరవులు వచ్చి తలయొక మాత్రవేసి చివరకు చేతఁగాక సలాము పెట్టిపోదురు. అప్పుడు నేను సలీముతో ఈ మందు మాకులవలన లాభము లేదు ఈ రోగమున కొక చట్కా క్రియయున్నది. అది శక్తిసింహున కొక్కనికే తెలియును, అతనిని పిలువుము, అందుచే అప్పుడు శక్తసింహుడు వచ్చి చట్కా ప్రయోగముచే నీజబ్బు కుదిరించును. అతనితో నీకు పెండ్లియగును. తర్వాత సంగీతము—యవనికాపతనము.

దాల—మేహర్! నేనెన్నియేని అపరాధములు ననుచితములు చేసి యుందునుగాక. అయినను నేను నీ దాలతును (ఏడ్చును.)

మేహ—ఇదియేమి దాలత్! నిజముగ నీవేడ్చుచుంటివా? వద్దు వద్దు ఏడ్వకుము ఇదుగో నావంక చూడుము. ఛీ ఏడ్వకుము ఏమియు భయము లేదు. శక్తసింహుని నేను రక్షించెదను. ఆతని నేను రక్షింపఁజాలనిచో నిట్టిసమయమున నేను పరిహాసము చేయుదునా దాలత్! ఇందు నీ దోషమేమియు లేదు. దోషములన్నియు నావే నేనే మీయిద్దఱను సమావేశపఱచితిని నేనే మీయిద్దఱకును హృదయములందు అనురాగమును రగులగొలిపి దానిని ఈస్థితికి దెచ్చితిని నేను శక్తసింహుని రక్షించుటయే కాదు అతనితో నీకు వివాహము కూడ చేసెదను. నేనేపనిని ప్రారంభింతునో దానిని

తుదముట్టించునంతవరకు మాననని నీవెఱుఁగుదువు. నే నీశ్వర సాక్షిగ చెప్పుచున్నాను, నీశక్తసింహుని నేనుతప్పకరక్షించెదను. పొమ్ము. ముఖముకడుగుకొనుము. ఏడ్చుటచే క్షణములోనే నీ కన్నులు వాచినవి. పొమ్ము ముఖము కడుగుకొనుము.

(దౌలతు పోవును.)

మేహ—(గద్గదస్వరముతో) దౌలత్! నా యీపరిహాసముక్రింద నెట్టి అగ్ని అణఁగియున్నదో నీవెఱుఁగవు. శక్తిసింహా! నేను నాహృదయమునుండి నిన్నెంత బహిష్కరింపఁ గోరుచుంటినో అందు నీవంత స్థిరముగఁ బాదుకొనుచున్నావు నేనెంతయో అణచుచుందును, ఎంతయో పరిహాసము చేయుచుందును. కాని ఈ యగ్ని చల్లారుటలేదు. నేను తొలుత నీరూపమునకును, నీపాండిత్యమునకునే ముగ్ధురాలనైతిని. నేడు నీశౌర్యమునకును, నీమహాత్త్వమునకును గూడ ముగ్ధురాల నగుచుంటిని. ఈయగ్ని అంతకంతకు రగులుకొను చున్నది. కాదుకాదు. నేను దీనిని అణచి వేసెదను. నాసుఖమునకై కాదు అమాయిక బాలిక యగు నీదౌలతున్నిసా సుఖమునకై ఈశ్వరా! నాహృదయ నిగూఢమగు ఈ విషయము దానికి తెలియకుండుగాక. తెలిసినచో దానికి దుఃఖమగును—అపారదుఃఖమగును

(అలక్షితభావముతో సలీము ప్రవేశించును)

సలీము—మేహర్!

మేహరు—ఎవరు? సలీమ్!

సలీము—నీవు ఒంటరిగా నుంటివేమి? దౌలతు ఎక్కడ?

మేహ—లోపలికివెళ్లినది. ఇప్పుడేవచ్చును, ఏమిసలీమ్! నీవు శక్తసింహునకు మరణదండము విధించితివా?

సలీము—అవును.

మేహ—అది యెప్పుడు జరుగును.

సలీము—రేపు ఉదయము అతఁడు వేటకుక్కల కెఱయగును,

మేహ—సలీమ్! నీవింకను పిల్లవాఁడవయిన మాట వాస్తవమే కాని

ఇతరుల ప్రాణములతో చెరలాటమాడు వయస్సుమాత్రము కాదు.

సలీము—ఆహా! ఇది చెరలాటమా? నేను కచేరీలో తీర్పుచెప్పితిని.

మేహ—తీర్పా! ఈతీర్పువేరిట నింతవఱకు ప్రపంచములో లక్షలకొలఁది మనుష్యుల ప్రాణములు తీయఁబడినవి తీర్పుచెప్పుటకు నీ వెవ్వఁడవో కొంచెమాలోచించికొనుము.

సలీ — నేను బాదుషా కొమరుఁడను. తీర్పుచెప్పుటకు నాకధికారమున్నది.

మేహ—నేను బాదుషా కూతురను. తీర్పు చెప్పుటకు నాకును అధికారమున్నది.

సలీ—ఇంతకు నీ అభిప్రాయమేమి?

మేహ—నా అభిప్రాయమిదియే నీవు శక్తసింహుని విడిచిపెట్టుము

సలీ—నీవు చెప్పుటచేతనా?

మేహ—అవును నేను చెప్పుటచేతనే (సలీము పకపకనవ్వెను) సలీమ్! ఇది నవ్వఁదగిన మాటకాదు. తక్కినది యేదియెట్లున్నను నీవు శక్తసింహుని విడువక తప్పదు లేనిచో—

సలీ—లేనిచో నేమి?

మేహ—లేనిచో నేను స్వయముగ వెళ్ళి నాచేతులతో ఆయనను వదలించెదను ఈ ఆగ్రాలో నన్ను అడ్డగించువా రెవ్వరును లేరు, అందఱును బాదుషాకూతురగు మేహరున్నిసా నెఱుగుదురు

సలీ—నాయనగారు మితిమీఱిన గారాబముచేసి నిన్నీస్థితికిఁ దెచ్చిరి.

మేహ—ఈమాటలతోఁ బనిలేదు నీవు శక్తసింహుని విడిచిపెట్టెదవా లేదా చెప్పుము.

సలీ—నీవెఱుఁగవా? శక్తసింహుఁడు వీరులగు మన సేనాపతుల నిద్దఱను హత్యసేసినాఁడు.

మేహ—హత్యచేయలేదు. ఎదుటఁబడి పోరాడి చంపినాఁడు.

సలీ—లేదు. అతఁడు చాల విశ్వాసఘాతుకత చేసినాఁడు. తొలుత మొగల పక్షమునఁజేరి—

మేహ—సలీమ్! ఇది విశ్వాసఘాతుకతయేయైనను స్వర్గీయ ప్రతిభా

మండితము. శక్తసింహుఁడు తన సోదరుని ఆపదనుండి రక్షింపక అతనిని చంపియున్నచో నీవు ఆయనను ప్రశంసించువాఁడవు కాఁబోలు.

సలీ—అవశ్యము.

మేహ—కాని ఇట్టి స్థితిలో నే నాయనను ఏవగించెడిదానను. ప్రపంచములో ప్రభుసేవకుల సంబంధ మెక్కువదో అన్నదమ్ముల సంబంధ మెక్కువదో నీవు చెప్పఁగలవా? ఆపరమేశ్వరుఁడు మానవులను ఈప్రపంచములోనికిఁ బంపునపుడు ఒక్కని ప్రభునిగను ఒక్కని సేవకునిగనుచేసి పంపలేఁడు. కాని అన్నదమ్ముల సంబంధము మొదటినుండియు నుండును. అది ఈజన్మములో విడిపోదు శక్తసింహుఁడు తన యన్నతోఁ బోరాడి మీవద్దకు వచ్చినపుడే ఈ మేఘములు ఎక్కువకాల ముండవని యాయన తెలిసికొనవలసినది. నీవును ఈవిద్వేషము భ్రాతృస్నేహము యొక్క రూపాంతరమాత్రమని తెలిసికొనవలసినది. ఈ రూపాంతరము విరూపమును, వికటమును, కుత్సితమును అయిన నగుఁగాక. వాస్తవమున కిది ఛద్మవేషముదాల్చిన భ్రాతృస్నేహమే. ప్రతిహింసాభిలాష ఆంతరంగిక ప్రేమను నశింపఁజేయదుసుమా సలీమ్! ఎల్లప్పుడు స్నిగ్ధమధురముగ వీచుసమీరము క్షణమాత్రమే భీషణ ఝంఝావాత రూపము ధరించును.

సలీ—వహ్వా! మేహరున్నిసా! నీవు శక్తసింహుని పక్షమున వకాల్తా పుచ్చుకొంటివి. నీతో వాదముసేయుట వ్యర్థము. నీవు శక్తసింహుని పక్షమున మాట్లాడుచుంటివన్న నాశ్చర్యమేమి? నీవాతని ప్రేమించుచుంటివి గదా.

మేహ—అసత్యము, కేవలమసత్యము.

సలీ— కాదు, కేవలము సత్యము నీవొకమాఱు అతని డేరాలోనికి వెళ్ళి అతనిని కలసికొని యుండలేదా?

మేహ —నన్నిట్లు ప్రశ్నించుటకు నీ కేమియు నధికారము లేదు.

సలీ—మంచిది స్వయముగ బాదుషాగారే ప్రశ్నించెదరు లెమ్ము

మేహా—నీవు శక్తసింహుని విడిచెదవా లేనా చెప్పుము

సలీ—ఎన్నటికిని లేదు నీయిచ్ఛవచ్చినది చేయుము. (సలీము వెంటనే వెడలిపోవును. మేహారు కొంతసేపు మెదలక యాలోచింపుచు నిలఁబడియుండును.)

మేహా—(నవ్వి) అయితే ఈపని నాకు తప్పదా? నేనీపనిచేయఁ జాలనని సలీముతలంపు కాఁబోలు. మంచిది ఈపని నాచేతనగునో కాదో చూపించెదను. (ప్రస్థానము)

## తృ తీ య దృ శ్య ము .

స్థానము. చెఱసాల—సమయము—ప్రభాతము.

శక్త—రాత్రిగడచినది దానితోబాటు నా యీ క్షుద్రజీవితమును గడచినది. నేటి ప్రభాతము నాజన్మమున కంతిమప్రభాతము నేఁడు నా యీ సుందరకోమల గౌరశరీరము రక్తసిక్తమై మట్టిలోదొర్లును, అందఱును నా యీ అంతిమ భీషణదృశ్యమును జూడఁగలరు. నెనొక్కఁడనే చూడఁజాలను. నేను! ఇంతకు ఈ 'నేను' ఎవఁడను ఎక్కడనుండి వచ్చితిని, నేఁడు ఎక్కడకు పోవుచుంటిని ! ఎంత ఆలోచించినను తెలియుటలేదు. గణితమువల్లను తేలుటలేదు. దర్శనశాస్త్రములవల్లను తేలుటలేదు. నేనెవఁడను ! నలుబది సంవత్సరములకు పూర్వము ఈ 'నేను' ఎక్కడనుంటిని ! రేపు నే నెక్కడ నుందును ! నేఁడీ ప్రశ్నపరిష్కారమగును—ఎవరు?

[దీపముచేతఁ బట్టుకొని మేహారున్నిసా ప్రవేశించును.]

మేహా—నేను మేహారున్నిసాను.

శక్త—మేహారున్నిసా! అక్బరు బాదుషాకూతురు !

మేహా—అవును.

శక్త—మీా రిక్కడ కెందుకు వచ్చితిరి.

మేహా—మీా ప్రాణము కాపాడుటకై వచ్చితిని.

శక్త—నా ప్రాణము కాపాడుటకా? నాకు బ్రదుకవలయునను కోరిక యేమియు లేదు.

మేహ—(ఆశ్చర్యముతో) ఏమి? మీకు బ్రదుకవలయునను కోరిక లేదా? మీకీ సుందరప్రపంచమును విడిచిపోవుటకు విచారము లేదా?

శక్త—లేదు. ఏమాత్రమును లేదు నాకీ ప్రపంచము చాల ప్రాతపడి పోయినది. ప్రతిదినము ప్రొద్దున ఒకసూర్యుఁడే ఉదయించును. రాత్రి ఒక్కచంద్రుఁడే కనుపించుచుండును. అప్పుడప్పుడు చీఁకటిగనుండును, నిత్యము ఆవృక్షములే, ఆజంతువులే, ఆపర్వతములే, ఆనదులే, ఆయాకాశమే కనిపించుచుండును నాకీ ప్రపంచము చాల ప్రాతపడిపోయినది. మరణానంతరము ఆలోకమునకు వెళ్ళి చూచెదను అక్కడ నేమేని క్రొత్తవస్తువు లున్న వేమో.

మేహ—మీకు మీజీవితముపై నేమియు ప్రేమ లేదా?

శక్త—ఏమియు లేదు. నేను ఇన్నినాళ్ళవఱకు ఈజీవితమును దఱచిచూచితిని. కాని నాకిది యసారముగఁ గనుపట్టినది ఇంక మృత్యువెట్టుండునో జూచెదను నిత్యము దానిప్రతాపము చూచుచుంటిని. కాని దానివిషయమై నాకేమియు తెలియలేదు నేఁడు తెలిసికొందును.

మేహ—మిమ్ము ప్రేమించువారిని విడుచుట మీకు కష్టముగాదా?

శక్త—నన్ను ప్రేమించువా రెవ్వరును లేరు. ఉన్నచో కష్టముగ నుండు నేమో. నేనింతదనుక ఎవ్వరిని ప్రేమించుట నేర్చుకొనలేదు. నన్నును ఎవ్వరును ప్రేమింపలేదు. నేనెవ్వరికిని ఋణస్థుఁడను గాను. అందఱి ఋణమును దీర్చివేసితిని. (స్వగతము) కాని ఒక ఋణముమాత్రము మిగిలియున్నది. సలీము నన్ను కాలితో తన్నిను ఆఋణముఁ తు దీర్పలేదు ఈపనియొకటియే మిగిలినది.

మేహ—అయితే మీరీశిక్షనుండి విముక్తులు కాఁగోరుట లేదా?

శక్త—ఆఁ, అవశ్యము గోరుచున్నాను. ద్దొద్దిసమయము వఱకే విము

క్తుఁడనుగాఁ గోరుచున్నాను. ఋణముతీర్చిన పిమ్మట నేను స్వయముగనే వచ్చి పట్టు పడెదను మీకు చేతనగుచో ఒక్కమారు నన్నీ చెఱసాలనుండి విడిపింపుఁడు.

మేహ — పహారేదార్! (పహారేదారువచ్చి నమస్కరించును) వీనిసంకెలలు విప్పుము.

(పహారేదారు సంకెలలు విప్పును మేహారు తనకంఠమందలి వజ్రహారమునుదీసి వానికిచ్చును)

మేహ—పొమ్ము దీనిని అమ్ముకొనుము. దీనివలన సుమారు లక్షరూప్యములు వచ్చును. ఉదర పోషణమునకింక నీ కేమియు చింతలేదు. పొమ్ము. (పహారేదారు నమస్కరించిపోవును.)

శక్త—(కొంచెము సేపు నిశ్చేష్టుఁడై యుండి పదపడి) మిమ్మొక సంగతి అడుగుచున్నాను. నన్ను విడిపించుటకు మీరింత ప్రయత్నమేల చేసితిరి?

మేహ—నన్ను మీరిది యెందు కడుగుచున్నారు?

శక్త—ఊరకయే.

మేహ—(స్వగతము) ఇప్పుడు నాయుద్దేశము చెప్పినచో బాధయేమి? ఇప్పుడే నిర్ణయమగును (శక్తునితో) మీరు మాంద్రాలతున్నిసాను నెఱుఁగుదురుగదా?

శక్త—ఆఁ ఆఁ.

మేహ—ఆమె—ఆమె మిమ్ము ప్రేమించుచున్నది.

శక్త—నన్నా?

మేహ—అవును. మిమ్ము. నాయూహ సరియగుచో మీరును ఆమెను ప్రేమింపుచుంటిరి.

శక్త—నేనా?

మేహ—అవును. మీరు.

శక్త—నేను విముక్తుఁడనగుటచే నామె కేమి లాభము?

మేహ—ఈ సంగతి ఆమెకే తెలియును. అదుగో తెల్లవార వచ్చినది. మీరిపుడు స్వతంత్రులు. బయట గుఱ్ఱము సిద్ధముగ నున్నది.

మీరాయిచ్ఛవచ్చిన చోటికి పొండు మిమ్మెవ్వరు నడ్డగించరు. మీరు దాలతును బెండ్లియాడఁగోరినచో—

శక్త— పెండ్లియా! హిందువునై మహమ్మదీయ స్త్రీని పెండ్లియాడుటయా? ఏశాస్త్రప్రకారము?

మేహ—మీహిందూశాస్త్రము ప్రకారమే. మీపూర్వుఁడగు బొప్పరావలు మహమ్మదీయస్త్రీని పెండ్లియాడ లేదా?

శక్త— అదిరాక్షసవివాహముగదా.

మేహ—అగుఁగాక. దానసేమి? అది పెండ్లియగునా కాదా? మీరే చెప్పుఁడు. శాస్త్రము లెవ్వరు చేసిరి? వివాహమున కొక్కటే శాస్త్రము అది ప్రేమ ప్రేమచే దృఢమైన బంధనమును ఏశాస్త్రమును త్రెంపఁజాలదు.

సీ॥ వలుతిప్పలంబడి పఱతెంచెడు స్రవంతి
యుదధికి సర్వాంగ మొసఁగు నపుడు
అతిసంభ్రమమ్మున నాలింగనము సేయ
నుల్క భూతలమున నొరఁగునపుడు
మాధవీలత సుధామధురమౌ సహకార
ము ను బెనంగొని కడు మురియునపుడు
చలివెల్గు కరములఁ గలువపూముద్దియఁ
బ్రేముడిఁ గిలిగింత పెట్టు నపుడు
గీ॥ శ్రుతితతింజదివెడు పురోహితుఁ డెవండు?
కర్మకాండము గావించు కాజి యెవఁడు?
మనమునఁ బెల్లివిరియు ప్రేమస్రవంతి
నల్పబంధమ్ము లెన్నియే నడ్డఁగలవె?

శక్త—శాహజాదీ! నాకు శాస్త్రభయమిసుమంతయు లేదు. సంఘమును లక్ష్యము సేయనివారికి శాస్త్రముల విలువయేమి?

మేహ—అయితే మీరంగీకరించితిరా?

శక్త—(స్వగతము) ఇందు బాధయేమున్నది? మఱియొక వైచిత్ర్యము చూచెదము. ఇంతదనుక నేను రమణీచరిత్రమును బరీక్షించి

రొలుఁగను. అదికూడమాత్రము. బాధయేమి?
మేహ—చెప్పుడు మీ కంగీకారమేనా?
శక్త—ఆఁ అంగీకారమే,
మేహ—'ఈశ్వరసాక్షి' అనుఁడు.
శక్త—నేను ఈశ్వరునిఁ బాటింపను
మేహ—పాటింపుఁడు మానుఁడు. ముందు 'ఈశ్వరసాక్షి' అనుఁడు
శక్త—ఈశ్వరసాక్షి
మేహ—రండు
శక్త—పదుఁడు (కొంచెము దూరము నడచి తనలో) ఇంతవఱకు నాజీవితమొక విధముగ గంభీరముగ నడచినది, అందుఁ నేడొక ప్రహసనముకూడ ప్రవేశించినది.
మేహ—రండు తెల్లవార వచ్చునది.

## చతుర్థదృశ్యము.

స్థానము—పృథ్వీరాజు అంతఃపురము, సమయము=రాత్రి
(జోషీబాయివిచారముతో నిలఁబడియుండును)

జోషి—ఇంక నేమున్నది అదియు ఆఱిపోయినది రాజపుత్ర స్థానమున కంతకు నొక్కటే దీపము వెలుఁగుచుండెడిది—తుదకు నదియు నాఱిపోయినది ప్రతాపసింహుఁడు మేవాడనుండి వెడలిపోయి నాఁడు. ఇప్పుడు అడవుల యందును, కొండలందును ద్రిమ్మరుచున్నాఁడు. హా! దురదృష్ట భారతవర్షమా!

సీ॥ తీరవే యింకను భారతమాతకు
పరదాస్యమునఁజెందు పరిభవములు
ఆఱవే యింకను న్యాయశోషకములౌ
యవనుల దుర్విక్రమాగ్ని శిఖలు
ఎండవే యింకను హిందూమహాధర్మ
దేవత బాష్పనదీజలమ్ము

తలయెత్తదే యింకఁ గలితశౌర్యాదార్య
భూషితయగు రాజపుత్రజాతి
గీ॥ దీర్ఘకాలమ్ము భారతదేశమాత
బానిసగనుండు విధమె కన్పట్టుచుండె
మంచిరోజులు మాహిందుమాతకింక
లేవు లేవిల దైవమ్ము లేదు లేదు॥
(వ్యగ్రభావముతో పృథ్వీరాజు ప్రవేశించును.)

పృథ్వీ—జోషి! జోషి!

జోషి—ఏమి?

పృథ్వీ—దర్బారులోని క్రొత్తసమాచారము వింటివా?

జోషి—నేనెక్కడనుండి విందును?

పృథ్వీ—చాలగొప్పసంగతి.

జోషి—ఏమయ్యెను?

పృథ్వీ—ఏమయ్యెనని చెప్పుదును? చాలగొప్పసంగతి అయినది—ఊర కుంటివేమి?

జోషి—ఇంక నేమిచేయుదును?

పృథ్వీ—మంచిది వినుము, శక్తసింహుఁడు కైదునుండి పాఱిపోయినాడు

జోషి—పాఱిపోయెనా?

పృథ్వీ—తానొక్కఁడే పాఱిపోలేదు, దాలతున్నిసాకూడ (పాఱిపోవుటనుసంకేతించును).

జోషి—ఆఁ!

పృథ్వీ—ఇంతయే కాదు. మఱియొకటి. సలీము మానసింహునిపై ద్రోహారోపణముచేసి బాదుషాగారికొక జాబువ్రాసెనని చెప్పితిని గదా.

జోషీ—అవును.

పృథ్వీ—నిన్న బాదుషాగారు గుజరాతునుండి తిరిగివచ్చిరి.

జోషీ—ఎందుకు?

పృథ్వీ—వీరితగవు తీర్చుటకై—ఇంకనెందుకు? ఇదిసామాన్యపుతగవా?

ఒకవైపున మానసింహుఁడు. రెండవవైపున సలీము—ఒకవైపున రాజ్యము, రెండవవైపున కుమారుఁడు. బాదుషా వీరిద్దరిలో నెవ్వరిని విడువఁజాలరు. ఇంకతగవు తీర్చవలయును.

జోషీ—ఎట్లు?

పృథ్వీ—ఇటు సలీముతో 'మానసింహుఁడు మన ఆశ్రితుఁడు, పోనిమ్ము!' అనును. అటుమానసింహునితో 'మహారాజా! సలీము కుఱ్ఱవాఁడు వానిమాట మీరు పాటింపకుఁడు' అనిచెప్పును.

జోషీ—రాణాప్రతాపసింహుని సమాచారమేమేని తెలిసినదా?

పృథ్వీ—ఇంక సమాచారమేమున్నది. దొరగారు అడవులన్నియు చెడ తిరుగుచున్నాఁడు. అక్బరు బాదుషాతో యుద్ధమాయని నేను మొదటనే యంటినిగదా. ఎంతవఱకు విఱ్ఱవీగుచు తిరుగఁగలఁడు. అయినది వలలోబడినాఁడు

జోషి—నాథా! మీరుక్షత్రియులు గారని నేనెఱుఁగుదును. కాని మీసోదరుని ఒక విజాతీయుఁడు పరాజితునిఁజేయ నాపరాజయమునకు మీరింతగ చంకలు కొట్టుకొనునంతటి నీచులనియు, పిఱికిపందలనియు, నేనెఱుఁగను. (ఏడ్చుచు పోవును.)

పృథ్వీ—అంతయు తెలిసినది, ఇది పట్టిఉద్రేకము. దీనిచే నేమిప్రయోజనము అయితే ఒక సంగతియున్నది. ఇది యెన్ని అనినను మెదలక సహించును, గాని ప్రతాపుని నెవ్వరేని పల్లెత్తిమాట యనిన తాచుపామువలె పడగవిప్పి బుసకొట్టును అయితే నేను పాము పడగవిప్పి బుసకొట్టుటను ఎన్నఁడును జూడలేదు. కాని ఇట్లేయుండునని యూహించుచున్నాను. (ప్రస్థానము)

———o———

## పంచమదృశ్యము.

స్థానము—అగ్బరునిగది. సమయము—ప్రభాతము

(అక్బరు పచార్లు త్రొక్కుచుండును. సలీము ఎదురుగ నిలఁబడియుండును.)

అక్బరు—సలీమ్! మానసింహుఁడు నిన్నేమియును నమర్యాదచేయలేదు. ఆయన చేసినదంతయు నాహుకుమును బట్టియే.

సలీము—ఇంతకంటె నాకేమి యమర్యాదయుండును? నేనింత పెద్ద సామ్రాజ్యమునకు యువరాజును. మానసింహుఁడొక సామాన్య సేనా నాయకుఁడు. హల్దీఘాటు యుద్ధమున ఆయన నాయాజ్ఞను లక్ష్యపెట్టనేలేదు. తాను ప్రత్యేకాజ్ఞల నొసఁగెను. అదియు నొకమాఱుగాదు. అనేక పర్యాయములు.

అక్బరు—ఉఁహూ! అయినను నాకిందు మానసింహుని దోషమేదియు గనుపట్టుట లేదు.

సలీము—అవును మీకు మానసింహుని దోషమెందుకుఁ గనుపించును అతఁడు మీకు స్యాలకపుత్రుఁడుగదా. వాస్తవమునకు మీరే అతనిని ఇట్లు నెత్తినెక్కించుకొన్నారు.

అక్బరు—కొంచెమాలోచించి మాట్లాడుము. మానసింహుని చేదోషమో నీవే చెప్పుము.

సలీము—ఇదియే, ఆయననాయాజ్ఞకు విరుద్ధముగ పనిచేసెను.

అక్బరు—ఈయధికారము ను ఆయనకు నేనేయొసఁగితిని. ఆయన సేనా నాయకుఁడు

సలీ—అయితే నన్ను యుద్ధమునకుఁ బంపవలసిన పనియేమి వచ్చినది?

అక్బ—ఆయన వెంటనుండి యుద్ధవిషయములు నేర్చుకొందువని పంపి యుంటిని.

సలీ—మానసింహునికి తాబేదారుగ నుండియా?

అక్బ—దురభిమానమును విడువుము. నీవు ముందుముందు భారత వర్షమునకు చక్రవర్తివి కావలసినవాఁడవు యుద్ధము లెట్లు చేయవలయునో రాజకార్యముల నెట్లునడిపించవలయునో నేర్చుకొనుము. మానసింహునకు నేనెంతయు ఋణగ్రస్తుఁడను. ఆయన మూలముననే నేనీ యర్ధభారత వర్షమును—అర్ధభారత వర్షమునేకాదు ఆఫ్గనిస్తానునుగూడ జయింపఁ గలిగితిని.

సలీ—మానసింహునకు మీరు ఋణగ్రస్తులు కావచ్చును. నేనుకాను

అక్బ—ఇదుగో నీప్రగల్భములు చాలింపుము. మానవుఁడు ఇతరులను శాసించుటకు మున్ను తన్నుతాను శాసించుకొనుట నేర్చుకొన

వలయును. మానసింహుని నేను హృదయపూర్వకముగ గౌర వించుచుంటినని నీవనుకొనవలదు. నా స్వవమున కతనికి నేనెం తయు వెఱచుచుందును. అతనివలన పనులన్నియు నెరవేరిన పిమ్మట నతనిని పాతచెప్పునువలె పరిత్యజించెదను. మనపనులు ముగియువఱకు మానసింహుని గౌరవింపక మనకు తప్పదు.

సలీ—మీయిష్టము నేనుమాత్రము ఆ కాఫిరు మానసింహుని యధికార మును బొటింపంజాలను నాయవమానమునకు ప్రతిక్రియ మీరు ఆలోచింపనిచో నాప్రతిజ్ఞ వినుఁడు, నా చేతులతో నేను ప్రతి క్రియ చేసెదను మాయిద్దఱిలో నెవ్వరు శ్రేష్ఠులో చూచెదను. (కత్తిపై చేయినేయును)

అక్బ—ఇదుగో సలీమ్! నేను బ్రదికియున్నంతవఱకు బాదుషాను నేనే కాని నీవుకావు. నీబుద్ధులుచూడ సుగాఁ గనుపట్టుట లేదు. నీకు తిరుగుబాటు సంకల్ప మున్నట్టులున్నది. సామ్రాజ్యము వలయు చో తిన్నగా నడచుకొనుము. లేనిచో నీకును సామ్రాజ్యము నకును సంబంధము లేదు.

సలీ—ఈ నిర్ణయము కేవలము మీ చేతులలోనే లేదని మనవిచేయు చున్నాను. (వెడలిపోవును.)

అక్బ—(కొంతసేపు నిస్తబ్ధుఁడై యుండి) ఔరా! తల్లితండ్రు లెంతటి యవివేకులు! ఈ సంతానముకొఱకే వారు సర్వస్వము నర్పణము చేయుదురు నేను కోరినచో ఈతుచ్ఛుని కొనగోటితో గీటడం పఁగలను. నేఁడు వీనిదుర్వాక్యములను విని యూరకుండవలసి వచ్చినది. ఈశ్వరా! ప్రేమబంధనముచే జనకు నెంతదుర్బలునిఁ జేసితివి. ఇదియంతయు విని ఊరకుండవలసి వచ్చినది. ఎవరు? మేహారున్నీసా?

మేహారు—(ప్రవేశించి) అవును నేనే నాయనగారూ!

అక్బ—మేహార్! నీపై నొకపెద్ద యపరాధమున్నది.

మేహా—నేను స్వయముగ ఆవిషయము మనవిచేసికొనుటకే యిచ్చటకు వచ్చితిని. కాని సలీముఇదివఱకేఅంతయు చెప్పినటులతోఁచుచున్నది

అక్బ— చెప్పుము శక్తసింహుని ఎవ్వరు విడిపించిరి?

మేహ— నేను నాచేతులతో

అక్బ— దాలతు ఏమయినది?

మేహ— దానిని శక్తసింహునికిచ్చి పెండ్లిచేసితిని

అక్బ— (వ్యంగ్యస్వరముతో) చాలమంచిది శక్తసింహునితో అక్బరు బాదుషా మేనకోడలికి పెండ్లి! ఒక హిందువునితో మొగల కన్యకు వివాహమా!

మేహ— సమ్రాట్! ఇదియేమియు క్రొత్తవిషయముగాదు మీ తండ్రి యగు హుమాయూనుచక్రవర్తి దీనికి మార్గదర్శకులు తర్వాత మీరును ఈత్రోవనే త్రొక్కితిరి.

అక్బ— మేము కాఫిరుల కన్యలను దెచ్చుకొంటిమి గాని కాఫిరులకు మాకన్యల నీయలేదు.

మేహ— ఎట్లయినను ఒకటే.

అక్బ— ఒకటె యెట్లు?

మేహ— ఒకటియే. అదియు పెండ్లియే. ఇదియు పెండ్లియే.

అక్బ— ఒక్కటిగాదు. మేహర్!— నీ వింకను పిల్లదానవు రాజనీతి నెఱుఁగవు.

మేహ— రాజనీతి నెఱుఁగనుగాని ధర్మనీతి బాగుగ నెఱుగుదును.

అక్బ— నీవింత చిన్న వయస్సులోనే తెలసికొనుటకు ధర్మనీతి యంత సులభమనుకొంటివా? ప్రపంచములో నన్నిమతము లెందుకు పుట్టినవో ప్రతిమతమునందును ఇన్నిశాఖోపశాఖలు ఎందుకుఁ గలిగినవో నీవేమి యెఱుఁగఁగలవు? ప్రపంచములో నెందరో విద్వాంసులు, మహాత్ములు గలరు కాని మతము విషయము అందరిది తల యొక అభిప్రాయము. నే నెన్నియో వాద వివాదములు వింటిని. పారసీ, క్రైస్తవ; మహమ్మదీయ, హైందవ పండితు లెందరితోడనో మాట్లాడియుంటిని. కాని నాకేమియు తెలియలేదు. ఇంక పసిదానవు. నీవు సర్వము తెలసికొంటివి కాఁబోలు.

మేహ—సమ్రాట్! ఈ తర్కములు, ఈ యుక్తులు, ఈ ఆలోచనలు ఎందుకు? ఈశ్వరుఁ డొక్కఁడు మతమొక్కటి నీతియు నొక్కటియే మానవులు స్వార్థపరతాహంకార విద్వేషాదులకు వశులై ఇన్ని భేదములు గల్పించిరి. జ్యోతిఃపుంజరంజితమగు నీ యాకాశమును జూడుఁడు. దిగంతపర్యంతమగు సముద్రమును జూడుఁడు సస్యశ్యామలమగు పృథ్వీతలమును జూడుఁడు ఎల్లెడను ఒకయీశ్వరుని పేరే వ్రాసియున్నది. మానవు లాయనకు పరబ్రహ్మ, అల్లా, జిహోబా మున్నగు పేరులు పెట్టి ఒండొరులు తగవులాడు చుందురు ద్వేషించుకొను చుందురు. వాస్తవమునకు మానవులెల్లరు సహోదరులే. భిన్న భిన్న దేశములఁ బుట్టిన మాత్రమున మనము భిన్నులము కాఁజాలము. శక్తసింహుఁడును మానవుఁడే. దౌలతున్నిసా యునుమానవయే. వీరిలో భేదమేమున్నది?

అక్బ—భేద మున్నది. దౌలతు మహమ్మదీయ, శక్తసింహుఁడు కాఫిరు. మరియు దౌలతు భారతరాజేశ్వరుని భాగినేయి, శక్తసింహుఁడు ఇల్లువాకిలి లేక ప్రతివారి చేతను తన్నులు తిను కుక్క.

మేహ—శక్తసింహుఁడును మేవాడ మహారాణాయగు ఉదయసింహునకు పుత్రుఁడు. నేఁడు ఆయన స్వదేశ బహిష్కృతుఁడును, మీరు భారతసార్వభౌములును అయినమాట వాస్తవము రోజులన్నియు నిట్లే యుండునని ఎవరు చెప్పఁగలరు? ఒకనాఁడు అక్బరు పాదుషాగారి జనకులును శక్తసింహునివలె బహిష్కృతులై యుండిరి

అక్బ—శక్తసింహుఁడు మహమ్మదీయుఁడగుచో నాకేమియు నాక్షేపము లేదు కాని యతఁడు నీచుఁడగు కాఫిరు

మేహ—ఇంక నూరకుండుఁడు నాయనగారూ!— మీ రీ కాఫిరు శబ్దమును మాటి మాటికి ఇంత నీచకముగా ప్రయోగింపకుఁడు. మా అమ్మ— సమ్రాజ్ఞియు కాఫిరని మీ రెరుఁగరా?

అక్బ — ఆమె కాఫిరగుఁగాక నేను మాత్రముగాను, స్త్రీలు కేవలము పురుషుల సౌఖ్యమునకై సృజింపఁబడినారు వారు విలాస వస్తువులే కాని సమస్మాన్యవస్తువులుగారు నాపద్దనిట్టి స్త్రీలు వందల కొలఁది నున్నారు.

మేహ — ఆహా! భారతరాజేశ్వరుని నోటనుండి ఎట్టి మాట వినుచుంటిని. స్త్రీలు పురుషులకు విలాసవస్తువులా! ఎంతమాట! సమ్రాట్! వారికిమాత్రము మీవంటి హృదయము లేదా? ఆహృదయమునకు మాత్రము మీ హృదయమునకుఁ బలె సుఖదుఃఖానుభవ జ్ఞానము లేదా? స్త్రీలు విలాసవస్తువులా! నేను మా అమ్మవలన వింటిని, హిందువులకు స్త్రీ సహధర్మిణియఁట హిందూశాస్త్రములో "యత్రనార్యస్తు పూజ్యంతే ప్రీయంతే సర్వదేవతాః" అని వ్రాసియున్నదఁట! స్త్రీలు పురుషులకు విలాసవస్తువులా! వారును కోరినచో "పురుషులు మాకు విలాసవస్తువులు మాసౌఖ్యమునకై వారు జన్మించిరి" అని అనవచ్చును. కాని యట్లనరు వారి హృదయము చాల ఉన్నతమైనది. పతికై వారు తమసౌఖ్యమును, తమజీవితమును, సర్వస్వమును అర్పణము చేయుదురు ఇంక పురుషుల సంకుచితబుద్ధిని జూడుఁడు వారు స్త్రీలను గౌరవింపరు. ఇంక వారి యన్యాయమును, నిర్దయత్వమును జూడుఁడు — స్త్రీలు అబలలు గదాయని వారి మీఁద నెన్నియో ద్రోహములు చేయుచుందురు. తమయక్కఱ దీఱిన పిమ్మట వారి కష్టజీవితమును మఱియుఁ గష్టమయము నొనర్తురు.

అక్బ — మేహర్! నేను నీతో శాస్త్రచర్చ సేయుటకుఁగాని నీయుద్ధతో పన్యాసమును వినుటకుఁగాని కోరుట లేదు నీకుఁగాని సలీమునకుఁగాని నాయాజ్ఞల శిరసావహించుటయే కర్తవ్యము (అక్బరు కోపముతో వెళ్లును.)

మేహ — (అభిమానముతో) సమ్రాట్! నాకర్తవ్యమేదియో నేను బాగుగ నెఱుఁగుదును, పితండ్రి నాతల్లిని అవమానించునో, దాసి

నిబలె తనకు విలాసవస్తువునుగాఁ జూచునో, అట్టివానిని విడిచి పోవుటయే నాకర్తవ్యము అతఁడు తండ్రియగుఁగాక భారత వర్షమంతయు నేలు బాదుషా యగుఁగాక అతఁడు నాకు సర్వ థాపరిత్యాజ్యుఁడే—ఓదారిద్ర్యమా! విశాలమగు నోయాకాశమా! ఓశీతలసమీరా! ఓనిర్జనారణ్యమా! నేఁడు నిరాశ్రయయౌ మేహారున్నిసాకు మీయుత్సంగమున స్థానమొసఁగుఁడు నేఁడు నేను భారత రాజేశ్వరుని కన్యనుగాను, నిరుపేదనగు నొకభి క్షుకిని, రాజకన్యనగుటకంటె భిక్షుకిగ నుండుటయే నాకు శ్రే యము (నిష్క్రమించును)

షష్ఠదృశ్యము

స్థానము—ఆగ్రాలో మానసింహుని మహలు సమయము—సాయంకా లము (మానసింహుఁడు పచారు చేయుచుండును)

మాన—నాయనగారు లేఖను నావద్దకుఁబంపినది దానివివాహమునొరకై కేయని తోఁచుచున్నది. ఆవివాహముకూడ ఈమొగల కుటుం బములో అగునని తోఁచుచున్నది. ఓహో! మేమెంతటి యధో గతినిఁ జెందితిమి, పవిత్ర మేవాడువంశముతో సంబంధముచేసి ఈకళంకమును బాపుకొందు ననుకొంటిని, నాయాసయంతయు వ్యర్థమైనది ప్రతాపసింహా! నేను నీ అభిమానము నంతయు చూర్ణము చేసెదను నేను సర్వము కలిగియుండియు నావంశగౌ రవము నష్టముచేసికొంటిని. నీవు సర్వము పోఁగొట్టుకొనియు దానిని నిలఁబెట్టికొంటివి కాని యొకనాఁడు నేను నీయున్నత శిరమునువంచి నిన్ను నాతో సమానునిగఁ జేయుదును. నిన్ను అడవి అడవి త్రిప్పెదను నీశిరముపై ఆకాశమునుదక్క మఱి యేమియు నుండనీయను

[సశస్త్రుఁడై సలీము ప్రవేశించును]

మాన—[ఆశ్చర్యముతో] శాహజాదాసాహెబ్! ఆదాబ్, ఈసమయ మున తామేల శ్రమపడి వచ్చితిరి?

సలీ—మానసింహా! నేనిపుడు నీకేమియు మేలుచేయుటకై రాలేదు

నేను ప్రతిశోధమును దీర్చుటకై వచ్చితిని

మాన—ప్రతిశోధమా?

సలీ—అవును ప్రతిశోధము.

మాన—దేనికి ప్రతిశోధము?

సలీ—నీయహంకారమునకు. మహమూద్!

(మహమూదు ప్రవేశించును.)

సలీ—మహమూదు చేతినుండి ఆయుధములు దీసికొని మానసింహున కిచ్చుచు) ఈరెండు ఖడ్గములలో నీయిచ్చవచ్చినది తీసికొనుము

మాన—శాహజాదాసాహెబ్! మీకు మెదడుచెడిపోయినది మీరు ఢిల్లీశ్వరునకుఁ బుత్రులు నేను వారిసేనాధిపతిని నేను మీతో యుద్ధము చేయుదునా!

సలీ—నీకు యుద్ధము చేయక తప్పదు. నీవు బాదుషాకు స్యాలకుఁడగు భగవాన్దాసునకు పుత్రుఁడవు. నీతండ్రికిని వారికిని మధుర సంపర్కముగలదు మనకు లేదు. నీవు బాదుషాకు ఆంతరంగిక సేనాపతివి. నీయభిమానమును బాదుషా సహించిన సహించుఁగాక. నేను సహింపను నీయిచ్చవచ్చిన ఖడ్గము తీసికొనుము.

మాన—మన యిద్దఱకును పడనిసంగతి నెనెఱుఁగుదును. అయినను మీరు యువరాజులు. మీపై నేను ఖడ్గమును ప్రయోగింపఁజాలను ఏవన నేను బాదుషాగారి యుప్పుపులుసు తింటిని.

సలీ—భీరూ! నిన్నువిడువను ఖడ్గముతీసికొనుము. నేఁడు మనయిద్దఱిలో నెవ్వరెక్కువయో తెలియును.

మాన—మీరు కొంచెము శాంతింపుఁడు.

సలీ—లేదు నేనేమియు వినను ఖడ్గము తీసికొనుము. (మానసింహుని చేతికి కత్తినిచ్చును.)

మాన—(కత్తిదీసికొని) యువరాజా! మీకు పిచ్చయెక్కినదా?

సలీ—అవును మహారాజా! (మానసింహునిపైఁ గలియఁబడును. మానసింహుఁడు దెబ్బ తప్పించుకొనును.)

మాన—శాంతింపుఁడు.

సలీ—లేదు. (మరలఁ గలియఁబడును. మానసింహుని కాలికి దెబ్బతగులును)

మాన—(గర్జించి) మంచిది యువరాజా! కాచుకొనుము. (సలీముపై కలియఁబడును. సలీము దెబ్బతిని వెనుకకు తొలఁగును)

మాన—ఇప్పటికేని మీరు శాంతింపుఁడు. లేకున్న మీతలయెగిరిపోవును

సలీ—ఇంత సాహసమా! (మఱల కలియఁబడును)

(తత్తరపాటుతో (రేవ) ప్రవేశించి చేతులెత్తికొని యుభయులమధ్య నిలఁబడును)

రేవ—ఆగుఁడు, ఆగుఁడు. ఇది గృహాంగణముగాని సంగర రంగముగాదు (రేవ రూపమునఁ జూచి సలీము ముగ్ధుఁడగును. అతని చేతినుండి ఖడ్గము క్రిందపడిపోవును. అతఁడు కొంచెము సేపు తన రెండు చేతులతో కన్నులు మూసికొనును. తర్వాత కన్నులు తెఱచిచూడ రేవ అచ్చటనుండదు)

సలీ—(ఆశ్చర్యముతో) ఈమె యెవరు? మానవకాంతయా లేక దేవభామినియా?

---

## సప్తమదృశ్యము.

స్థానము—ఉదయ పురారణ్యమున ఒకపర్వత గుహాబహిర్భాగము.

సమయము—సాయంకాలము.

ప్రతాపుఁడు—(నిలఁబడి) తుదకు కోమలమీరుకూడ పోయినది. ధూర్మటీగోగుండా దుర్గములు శత్రువులకుఁ జిక్కినవి. ఉదయపురము మహాబత్ఖాను చేతిలోనున్నది. ఇవియన్నియు పోయినవి. వీని దుఃఖము నెట్లో సహింపవచ్చును. ఘటనాచక్రమునుండి వెడలిపోయినవి మఱల ఘటనాచక్రమునుండియే ప్రాప్తములగును. కాని మానారోహిదాసులారా! హల్దీఘాటు యుద్ధమున మిమ్మిద్దఱను బోఁగొట్టుకొంటిని. ఇంక మిమ్ము పొందఁజాలను.

[మెల్లగా ఈర ప్రవేశించును]

ప్రతా—ఈరా! నీవు భోజనముచేసితివా?

ఈర—ఆఁ నాయనగారూ! ఈస్థానము పేరేమి?

ప్రతా—ఉదయ పురారణ్యము

ఈర—చాల చక్కని ప్రదేశము. ఈనిస్తబ్ధ నీరవఘూర్మ పర్వతమాలిక యెంత సుందరముగ నున్నది!

(భోజన సామగ్రితీసికొని లక్ష్మి ప్రవేశించును.)

ప్రతా—పిల్లలు భోజనముచేసిరా?

లక్ష్మి—ఆ. మీకోసమే భోజనము దెచ్చితిని.

ప్రతా—నేనేమితిందును? నాకు ఆఁకలియే లేదు.

లక్ష్మి—ప్రొద్దుటనుండియు తిన లేదుకదా. ఇంక ఆఁకలి యెందుకు లేదు?

ఈర—నాయనగారూ! కొంచెము భుజింపుఁడు.

ప్రతా—మంచిది ఉంచుము.

లక్ష్మి—(భోజనముచ్చటనుంచి) ఇంక నేను వెళ్ళి పిల్లలను నిద్రపుచ్చెదను

(లక్ష్మి వెళ్ళును. ప్రతాపుఁడు ఫలమూలములుదిని జలముద్రాగును.)

ప్రతా—ఇదియే రాజపుత్రులజీవితము! పగలంతయు నిరాహారముగ నుండుటయు సాయంకాలమున ఈఫలమూలములఁదినుటయు, పగలంతయు కఠినపరిశ్రమము చేయుటయు రాత్రి కటికు నేలఁ బరుండుటయు! ఇదియే రాజపుత్రుల జీవనము!

ఉ॥ కాననమూలముల్ గసరుగాయలుకూరలె మృడసాంచితా
న్నాన సుధాశనంబురుచినొప్పును, ప్రస్తరలోష్ఠకర్కశం
బైన ధరిత్రిఁబండుటయె యంచితకోమల శయ్యకంటె సౌ
ఖ్యానుభవంబొసంగుఁగడు నద్దిర! దేశహితార్థజీవికిన్ ॥

(భిల్లనాయకుఁడగు మాహూవచ్చి రాణాకు నమస్కరించును.)

ప్రతా—ఎవ్వరు? మాహూ!

మాహూ—అవును రాణాజీ! తామువచ్చారనివిని తమ దర్శనానికై వచ్చాను.

ప్రతా—దేశభక్తాగ్రేసరా! మాహూ!

ఈర—మాహూ! బాగుగనుంటివా?

మాహూ—ఆ. అమ్మా! నీవిట్లా సిక్కిపోయినా వేం?

ప్రతా—ఇంకను ఇది బ్రదికియున్నందుకు వింతయగుచున్నది. అసలే జబ్బుశరీరము. అందులో సరియైనయుపచారము, వేళకు పాళకు అన్నము, ఉండుటకు సరియైన కొంప లేకుండుట! నేడుపగలంతయు ఇది ఏమియు తినలేదు. ఇప్పుడేకొంచెము తిన్నది

మాహూ—బద్దిరం అమ్మా! పున్నెనికి సచ్చిమోతావు ఎక్కడో పిచ్చిదానల్లేవున్నావు. జాగర్త ఇట్టాఎన్నిరోజులు ఉపాసాలు సేస్తావు?

ప్రతా—ఏమిచేయుదుముమాహూ? బెరూరు అడవిలో భోజనయత్నము చేసితిమి ఇంతలో అయిదువేల మొగలసైనికులు తరుముకొని వచ్చిరి నేను పదుగుర ననుచరులను తీసికొని ఈకొండదారిని ఈపదికోసులు నడిచివచ్చితిని. వీరిని జోలిపై తీసికొనివచ్చితిమి

మాహూ—(నిరాశ నభినయించుచు) రాణాజీ! ఇదిమీారు విన్నారా?

ప్రతా—ఏమి?

మాహూ—ఫరీదుఖాను సిపాయీాలంతా రాయగఢుకు పోయారు. ఇక్కడవారి సిపాయీాలు వేయికిందే వున్నారు

ప్రతా—ఫరీదుఖానెక్కడనున్నాడు?

మాహూ—ఇక్కణ్ణే ఇవాళ్ళవాడిపుట్టినరోజు పెద్దసంబరంచేస్తారు. మనమువాళ్ళ పైకి దండెత్తిపోదాము.

ప్రతా—కాని మనవద్ద నూరుగురేనియు మంచిసైనికులు లేరు.

మాహూ—నావద్ద కావలసినంతమంది అడవి సిపాయిలువున్నారు. రాణాగారంటే వాళ్లు పాణంకోసి యిస్తారు.

ప్రతా—అయితేపొమ్ము. వారిని సిద్ధపఱచుము నేటిరాత్రియే వారి శిబిరమును ముట్టడింతము—పొమ్ము త్వరగాపొమ్ము.

మాహూ—సిత్తం. (ఈరతో) అమ్మా! నీవొళ్లుబద్దిరం లేక పోతే వుధాగా సచ్చిపోతావు (ప్రస్థానము)

ప్రతా—భక్తవరా! భిల్లనాయకా! నీవంటి మిత్రుఁడు ప్రపంచమున దొరకఁడు. ఈదుర్దినములలో నీభిల్లసైన్యమే దేవతా వరప్రసాదమువలె నాకు సాయపడినది.

ఈర—(మృదుస్వరముతో) నాయనా!

ప్రతా—ఏమి అమ్మా!

ఈర—ఈ యుద్ధము చేయుట యెందుకు? ఈ ప్రపంచములో మనమెన్ని రోజులుందుము? ఈ ప్రపంచములోనున్న నాలుగురోజులు ఒకరి నొకరు ప్రేమించుకొనుచు ఒకరి దుఃఖముల నొకరు పోగొట్టు కొనుచు నుండవలయునా లేక జగడము లాడుచు నింకను దుఃఖ ముల దెచ్చి పెట్టుకొనవలయునా?

ప్రతా—అమ్మా! మన మొక్కరినొకరు ప్రేమించుకొనుచు నీజీవితము గడుపగలిగినచో మనకీ పృథ్వియే స్వర్గమగును

ఈర—నాయనగారూ! స్వర్గమెక్కడనున్నది? ఆకాశముననా? కాదు. ఒకనాఁడు ఈపృథ్వియే స్వర్గమగును.

సీ॥ నిరతిశయప్రేమ నిర్మల జ్యోతిచే
నలుదెసల దీప్తిమై వెలుఁగునాఁడు
భక్తియు నుపకారభావముల్ మాత్రమే
యెల్లెడ సామ్రాజ్య మేలునాఁడు
అఖిల మంగళమూలమైన స్వార్థత్యాగ
మే స్వార్థలాభమం చెంచునాఁడు
ఈర్ష్యామహాద్వేష హింసాది రాక్షస
భావముల్ పెడఁగూలఁబోయినాఁడు
గీ॥ ఈధరిత్రియె స్వర్గమై యొసఁగ మెసఁగు
నీమనుష్యులె దేవతాకృతి వహింత్రు
లేనినాఁ డీ ధరిత్రియె యౌను నరక
మీమనుష్యులె రాక్షసాకృతివహింత్రు॥

ప్రతా—అమ్మా! ఆరోజు ఇంకను చాల దూరముననున్నది.

ఈర—నాయనగారూ! ఆరోజు మనము దగ్గఱకు తీసికొనిరాక ఈవిధ మున నెత్తురు టేఱులఁ బ్రవహింపఁ జేయుచు దాని నింకను దూర మేల చేయుచుంటిమి?

(బాలకవేషముననున్న మేహరున్నిసాను దీసికొని అమరుఁడు ప్రవేశించును)

ప్రతా—ఎవ్వరు? అమరసింహా!—ఈనీవెంటనున్న దెవరు?

అమర—ఇతఁడు మానసింహుని దూతనని చెప్పుచున్నాఁడు. కానియితని మాటలపై నాకు నమ్మకము లేదు

(మేహరు ప్రతాపునివంక తెప్పవాల్పక చూచును).

ప్రతా—నీవు మానసింహుని దూతవా?

మేహ—రాణాప్రతాపసింహులు మీరేనా? ఈకుటీరమేనా మీరుండు స్థానము! మీరీఫలమూలములనే తినుచుందురా? ఈతృణశయ్య మీఁదనే మీరు పరుండునది?

ప్రతా—అవును నేనే ప్రతాపసింహుఁడను నిజము చెప్పుము. నీవెవఁడవు?

ఈర—నిజము చెప్పిన మీరు నన్ను విడిచెదరేమోయని భయముగ నున్నది

ప్రతా—నిన్ను విడిచిపెట్టవలదా?

మేహ—మీరు రాజపుత్రకుల ప్రదీపకులు మీరు మానవజాతికి గౌరవస్వరూపులు మీవిషయమై నేనెన్నియో సంగతులు వింటిని. అందు కొన్నిటిని విశ్వసించితిని. కొన్నిటిని విశ్వసింపలేను కాని నేఁడు ప్రత్యక్షముగఁ జూచితిని. మీమహిమ అద్భుతము కల్పనాతీతము. అక్బరుచక్రవర్తి ప్రభుత్వమును స్వీకరించి సగౌరవముగ నాయన యర్ధసింహాసనమునఁ గూర్చుండలేక దేశస్వాతంత్ర్యమునకై మీరెన్నియో యిడుములఁ బొందుచున్నారు. ఈవిషయమున నమ్మకము కలిగించుకొనుటకై యిచ్చటకు వచ్చి మీస్థితినిఁ బ్రత్యక్షముగఁ జూడవలసివచ్చెను. రాణాజీ! నేను మానసింహుని దూతనుగాను (భక్తివిస్మయానందములచే మేహరు మాటలాడఁ జాలదు)

ప్రతా—అయితే నీవెవరవు?

మేహ—నేను స్త్రీని

పతా—అయితే ఈవేషమున నిచటకేలవచ్చితివి?

మేహ—నేనిచ్చటకు వచ్చిన ఉద్దేశము వేఱు. కాని యిపుడు ఇక్కడనే యుండి మీపరివారమునకు శుశ్రూష చేయవలయునను ఇచ్ఛ కలిగినది.

ప్రతా—అయితే నీవెవరవో చెప్పలేదు.

మేహ—మీకు స్త్రీలపేరు వినవలసిన పనియేమున్నది?

ప్రతా—మీతండ్రి పేరేమి?

మేహ—మాతండ్రి మీకు పరమశత్రువు. కాని యిపుడు నేనుమీ యాశ్రయమునకు వచ్చితిని. మాతండ్రిపేరు విన్నను నన్ను పరిత్యజింపనని ప్రతిజ్ఞచేయునంతవఱకు నేను మాతండ్రి పేరు చెప్పను.

ప్రతా—ఎఱుఁగుదువా నేను క్షత్రియుఁడను, శరణాగతుని విడుచుట క్షత్రియధర్మముగాదు.

మేహ—నాతండ్రి

ప్రతా—ఆఁ ఆఁ చెప్పుము

మేహ—నాతండ్రి - మీకు పరమశత్రువగు అక్బరు బాదుషా

[ప్రతాపుఁడు విస్మితుఁడై తీవ్రదృష్టితో కొంచెముసేపు మేహరు వంకచూచును.]

ప్రతా—నీవు నన్ను మోసగించుటలేదు గదా?

మేహ—రాణాజీ! నేను నాజీవితములో నొక్కని మోసగించుట నేర్చుకొననేలేదు.

ప్రతా—అక్బరుకన్య నాయొద్దకేల వచ్చినది?

మేహ—నేను పాఱిపోయి వచ్చితిని.

ప్రతా—ఎందుకు?

మేహ—చెప్పెదను

ఈర—ఆఁ నేనుగుర్తించితిని, ఈమె మేహరన్నిసా.

ప్రతా—నీవీమెనెట్లు గుర్తించితివి.

ఈర—ఈమెను నేనెఱుఁగుదును నాయనగారూ! ఈమె అక్బరుని కన్య మేహరు.

ప్రతా—నీవీమె నెక్కడ చూచితివి?

ఈర—హల్దీఘాటు యుద్ధక్షేత్రమున.

ప్రతా—(విస్మితుఁడై లేచి) మేహరున్నిసా! నీవు నాకు శత్రుకన్యవయ్యును నాయాశ్రయముకోరి వచ్చితివి ఇప్పుడు నేను ఒకరికిఆశ్రయమిచ్చు స్థితిలో లేను నేనే నిరాశ్రయుఁడనై యుంటిని అయినను నీకు ఆశ్రయమొసఁగెదను నిన్ను విడువను. రమ్ము లోపలికి రమ్ము. (అందఱు గుహాలో ప్రవేశించెదరు)

# రాణా ప్రతాప సింహ

## చతుర్థాంకము

### ప్రథమదృశ్యము.

స్థానము—ఛిన్నరాదుర్గము సమయము—మధ్యాహ్నము

(శక్తసింహుఁడు ఒంటరిగా ఉద్యానమున తిరుగుచుండును.)

శక్త—సలీమ్! ఇన్నినాళ్ళవఱకు నేనీదుర్గమున మెదలక కూర్చుండియుంటిని. అందుచే నేను నీపదాఘాతమును దీర్చుకొనుట మఱచితి ననుకొనకుము. ఆగ్రానుండి వచ్చినప్పుడు నేనుకొందరు రాజపుత్ర సైనికులఁ బోగుచేసితిని. ఇచ్చటకు వచ్చి యీదుర్గమును వశపరచుకొంటిని. అంతటితో నేను నిశ్చింతుడను గాలేదు నీపై నిపగ తీర్చుకొనుటకు సమయముఁ జూచుచున్నాను. ఈపగ తీర్చుకొనుటకై నే నెందరనో నిరపరాధులను వధించితిని. ఇంక నెందర వధింపనుంటినో తెలియదు. నేనేమేని అన్యాయమును జేయుచుంటినా? ఎంతమాత్రము లేదు. శ్రీరామచంద్రుఁడును సీతారక్షణమునకై నిరపరాధులును, స్వదేశవత్సలులును, రాజభక్తులునగు వేలకొలఁది రాక్షసులను వధించెను.

[ఒకదూతవచ్చి నమస్కరించును.]

శక్త—ఏమేని సమాచారము తెలిసినదా?

దూత—ఆఁ రాణాగారు ఇప్పుడు బియారు అడవిలోనున్నారు. మానసింహుఁడు కోమలమీరును తగులబెట్టించినవార్త సత్యము.

శక్త—మంచిది రేపు ఇచ్చటనుండి ప్రయాణము కావలయును. దుర్గాధ్యక్షునిఁ బంపుము. (దూతపోవును) మానసింహా! దీనికి ప్రతిక్రియ తప్పక చేసెదను. అదుగో దౌలతు వచ్చుచున్నది.

(దౌలతు ప్రవేశించి మెదలకయుండును.)

శక్త—నీ కేమి కావలయును?

దాల—(ఏమియు తోఁచక) చల్లనినీడ కావలసినంత యున్నది. నీవింక నేమియో కోరుచున్నావు. ఊరకుంటివేమి?

దాల—నాథా!—(మరల ఊరకొనును.)

శక్త—ఏమేమి చెప్పెదవా లేక ఈమిట్టమధ్యాహ్నమున నాథా ప్రాణేశ్వరా! యనుటకే ఇచ్చటకు వచ్చితివా? ఈసమయమున ఈసంబోధనముల కేమియు విలువ లేదు. ప్రేమప్రథమాధ్యాయములో నిట్టిమాటలు కొంతశోభ నాపాదింపఁగలవు. ఇంక మన ప్రేమకు ఒక సంవత్సరకాలము పైగా నయినది, ఇప్పుడీ మిట్టమధ్యాహ్నమున 'నాథ' ప్రాణనాథ శబ్దంబులు అకాలసంగీతమువలె కర్ణకఠోరములుగ నుండును.

దాల—నాథా! పురుషుల ప్రేమ విషయమై నేనేమియు చెప్పఁజాలను. కాని స్త్రీల ప్రేమ విషయమై నేను బాగుగ నెఱుఁగుదును. అది యెప్పుడును ఒకవిధముగనే యుండు.

శక్త—అనఁగా పురుషులు లాలన కంతముండునుగాని స్త్రీలు లాలన కంత ముండదనియే కాదా?

దాల—నాథా! పతికిని పత్నికిని ఇదియేనా సంబంధము?

శక్త—పురుషునకును స్త్రీకిని ఇదియే సంబంధము. పురోహితుఁడు వచ్చి నాలుగు మంత్రములు చదివినమాత్రమున నందేమి విశేషము వచ్చునో తెలియకున్నది. ఇంక మనవివాహములో నదియును జరుగలేదు. ఇందువలన సంఘదృష్టిలో నీవు నాకు ప్రేమికవే కాని పత్నివి కావు.

దాల—(మొగ మెఱ్ఱఁబడును.) ప్రభూ!

శక్త—దాలత్! ఇప్పుడు నీవు వెళ్ళిపొమ్ము. పురుషునకు స్త్రీలయధరామృతమును గ్రోలుటయేగాక మఱికొన్ని పనులుగూడ నుండును.

(దాలత తలవంచుకొని మెల్లగ వెళ్ళిపోవును.)

శక్త—ఇదియే స్త్రీజాతి! ఎంత యసారము, ఎంత కుత్సితాకారము! ఆహా! లాలసాంధులమై మనము దీనినే ఎంతయో సుందరమని

తలంతుము. స్త్రీజాతియే యననేల మానవజాతియే నీచమగు-నొకపశుజాతి. వస్త్రభూషణములు దీసివేసినచో మానవునికంటె నాపశువే యందముగఁ గనుపట్టును. మానవశరీర మెంత కుత్సితమైనది. ఇది పుష్టికై సుందరములును. స్వాదిష్టములును, సుగంధితములు నగు పదార్థముల సేవించును ఇంక (ప్రవగింపును సూచింపుచు) నికృష్టపదార్థములను విడుచుచుండును. తుదకు శరీరపు చెమటయందుఁగూడ నెట్టిదుర్గంధ ముండునో చూడుఁడు ఇంక చచ్చినపిమ్మట ఈశరీరమును ఒకటిరెండు రోజులు నిలువ యుంచినచో ఇంక నాసుగంధము చెప్పనలవిగాదు

దుర్గాధ్యక్షుఁడు—(ప్రవేశించి) మహారాజా! రేపేనా ప్రయాణము?

శక్త—అవును. రేపు ఉదయముచే నీచేతిక్రింద వేయిమంది సైనికు లుందురు. చాలతున్నిసా ఇక్కడనున్న సంగతి యెవ్వరికిని తెలియఁగూడదు సుమా పొమ్ము

దురా—చిత్తము (నిష్క్రమించును.)

శక్త—సలీమ్! అక్బర్! ఓ మొగలసామ్రాజ్యమా! మిమ్మందఱను ఒక్కమాఱుగ కాలితో రాచివైచెదను. (ప్రస్థానము)

---

ద్వితీయదృశ్యము.

స్థానము—నౌరోజు ఉత్సవము. సమయము—సాయంకాలము

[రేవ పూలదండలు ఎదురుగనుంచి నిలఁబడియుండును. చిత్రవిచిత్రవేషధారిణులగు పెక్కుస్త్రీలు వచ్చుచు పోవుచునుందురు. రేవ మోచేయి బల్లపయి మోపి అఱచేతను గవోలమునుంచి ఆదృశ్యము చూచుచుండును సుందర వస్త్రభూషణములు ధరించిన ఒకస్త్రీ అచ్చటకు వచ్చును.]

స్త్రీ—ఇచ్చట నేమి యమ్మఁబడును?

రేవ—పూలదండలు.

స్త్రీ—తెమ్ము. చూచెదను, ఇవి యేమిపూలు?

రేవ—పారిజాతములు.

స్త్రీ—పేరు పెద్దదేగాని దండ చిన్నది, ధరయెంత?

రేవ—అయిదు మోరీలు.

స్త్రీ—ఇదుగో మోరీలు తీసికొనుము. దండ తెమ్ము. బాదుషాగారి మెడలో వేసెదను (దండ తీసికొని వెళ్లును)

రేవ—ఈమె బేగంసాహెబా. బాదుషాగా రెచ్చటను కనుపించలేదు.

మఱియొక స్త్రీ—(ప్రవేశించి) ఇచ్చట పూలదండ లమ్మెదరా?

రేవ—అవును.

స్త్రీ—తెమ్ము చూచెదను. (ఒకదండ తీసికొని దానిని విడిచి మరల రెండవ దండ తీసికొని) ఇవి యేమిపూలు?

రేవ—కడిమిపూలు.

స్త్రీ—ఇదుగో వెల (కొన్ని మోరీలిచ్చి దండతీసికొని పోవును.)

రేవ—ఇదియు నొకవిచిత్రపు ఉత్సవమే ఇక్కడ దొరకని వస్తువు లేని యు లేవు కాశ్మీరపు సేలువలు. జయపురపు స్ఫటికపాత్రలు చీనాబొమ్మలు, టర్కీ తివాచీలు, సింహళశంఖములు ఇక్కడ లేనివేవి? ఇట్టిఉత్సవము నేనెక్కడను చూడలేదు.

[పూలదండలు ధరించి అక్బరు ప్రవేశించును]

అక్బరు—ఈ దండలు గుచ్చిన దెవరు?

రేవ—నేనే.

అక్బరు—నీవు మహారాజ మానసింహుని చెల్లెలవా?

రేవ—అవును.

అక్బరు—(స్వగతము) సలీముని అనురాగోన్మాదమునకుఁ గారణము తెలిసినది. ఈమె నిశ్చయముగ భారతభావి సమ్రాజ్ఞి యగుటకు తగినదియే. (రేవతో) తెమ్ము నీవెక్కిన దండలు చూచెదను (అన్నిదండలు తీసికొని) వీనియన్నిటి వెల యేమి?

రేవ—వేయి మోరీలు.

అక్బరు—ఇదుగో నీదండలన్నియు కొంటిని. (మోరీలు అక్కడనుంచి దండలు తీసికొనును.)

రేవ—మీరు అక్బరు బాదుషాయేనా?

అక్బ—అవును. (ప్రస్థానము

---

(నాట్యప్రదర్శన) దృశ్యాంతరము. (౧)

స్థానము—నౌరోజు ఉత్సవము సమయము — రాత్రి

వేశ్యల నృత్యగానము

---

దృశ్యాంతరము (౨)

స్థానము—చీకటిమార్గము. సమయము—రాత్రి

[జోషిబాయి ఒంటరిగా దారి వెదకుచుండును. రెండవ వైపు నుండి అక్బరు ప్రవేశించును]

అక్బరు—సుందరీ! నీవిచ్చట నేమి చేయుచుంటివి?

జోషి— నేను దారి మరచితిని. బాదుషాగారు దయచేసి దారి చూపినచో —

అక్బ—నేను బాదుషానని యెట్లు తెలిసికొంటివి?

జోషి—ఈయుత్సవమునకు బాదుషాదక్క ఇతరపురుషులు రాజాలరని వింటిని

అక్బ—మంచిది సుందరీ! నీ వెవ్వతెవో నే నడుగవచ్చునా?

జోషి— నేను రాజసభాకవియగు పృథ్వీరాజునకు భార్యను మేవాడు రాజవంశమున కొడబడుచును నాపేరు జోషిబాయి.

అక్బ—నీ వీయుత్సవమున కిదియే తొలినార వచ్చుట కాబోలు?

జోషి—చిత్తము. నాకిచ్చటి దారి యేమియు తెలియదు దయచేసి దారిచూపినచో—

అక్బ—నీ కిది తెలియదు కాబోలును. ఇక్కడకు వచ్చు మార్గము సులభముగాని ఇక్కడనుండి వెళ్లుమార్గము చాల కఠినము

జోషి— మీరు దయచేసి నాకు దారి చెప్పుడు. ఇదయేనా దారి? (వెళ్ళబోవును)

అక్బ—(దారి అడ్డి) నీవు దయచేసి ఇంత దూరము వచ్చిన దానవు మఱి కొంచెము దయచేసి ఒకమారు నాగదిలోనికిరావలయును

జోపి — మీరు దాగి వదలుఁడు.

అక్బ — నీవు బొత్తుగా తెలియని దానవుగా నున్నావు. సౌందర్యవతు లగు రమణుల నేనెంతిగా గౌరవింతునో నీవెఱుఁగవు కాఁబోలు సుందరీ! — (ముందుకుఁ బోవును.)

జోపి — ఈ మహోత్సవము ప్రతిసంవత్సరమును బాదుషాగారు ఇట్టి పైశాచిక కాంక్షలఁ దీర్చుకొనుటకే చేయుచుందురని నేనెఱుఁగుదును. మఱియు బాదుషాగారు పరరాజ్యములఁ దోచుకొనుటయందుఁ బలెపరకాంతల గౌరవమును దోఁచుకొనుటయందును వీరులని నేనెఱుఁగుదును. కాని మీరు మీభవనములో కులకాంతల నట్లు పరాభవించుటకు లేశమును సంకోచింపని పరమనీచులని నెనెఱుఁగను. మంచిది. దారి విడువుఁడు.

అక్బ — రత్నభూషణములచే నిన్ను అలంకరించి ఇంటికిఁ బంపెదను.

జోపి — హా పరమేశ్వరా! ఎంతమాట వినవలసివచ్చినది.

అక్బ — నేను నీకొక చిన్న రాజ్యమునిచ్చెదను.

జోపి — నీరాజ్యములు నీభోజ్యములు నాకు తృణసమానములు,

అక్బ — (ప్రేయసీ! నీ కోపారుణవదనము నా హృదయమును మఱియు నలరించుచున్నది. నేను నీతో ఒట్టుబెట్టి చెప్పుచున్నాను ఈ రహస్యవిషయమును నే నెవ్వరికిని చెప్పను నేడు దక్క మఱల నిన్నెన్నఁడును ఇట్టికోరికను గోరను. నీగౌరవము తగ్గునని భయపడకుము ఇంకను హెచ్చును నీ గర్వోత్తమస్తకము ఇంకను ఉన్నతమగును. రమ్ము పోదము. (జోపీబాయి చేయిపట్టుకొనును)

జోపి — (చేయి విడిపించుకొని) ఓరీ అధమాధమా! కాపురుషా! లంపటా జాగ్రత్త! (అక్బరు వెనుకకు తగ్గును) నేను హిందూనారమణిని అని జ్ఞప్తినుంచుకొనుము, కొందరు కులాంగారులగు హిందూరాజులు తమకాంతలను నీయీనీచపైశాచికోత్సవమునకుఁ బంపి తమగౌరవమును బోఁగొట్టుకొని నీదుర్వ్యసనము నీగతికిఁ దెచ్చిరకాని వారిని నేను హిందువులుగ తలంచుటలేదు. నేటి

హిందువులలో పెక్కుమంది తమహిందుత్వమును బోఁగొట్టు కొనిరి నీవు చక్రవర్తివి. నీవే ప్రజలకు తల్లివి తండ్రివి. కుల కాంతలయెడ నీకిట్టి దుష్ప్రవర్తనము తగదు ఇంకనన్ను స్పృశింపకుము. లేనిచో (కత్తిదూసి) నీ యధమజీవితము నంతమొందించెదను. మఱియు నాహితోక్తి నాలింపుము.

సీ॥ సామాన్యుఁడే శౌర్యశాలి రావణుఁడు సీ
తను బట్టి వంశనాశనము గనఁడె
మనుజమాత్రుఁడె సుయోధనుఁడు సానుజుఁడయి
ద్రౌపది పరిభూతి ద్రుగ్గిపోఁడె
శాసనీయుఁడె లోకశాసకుండగు శౌరి
బృందచే దుదకు శపింపఁబడఁడె
అలతులే యలత్రిమూర్తులు సాధ్వి యనసూయఁ
గవ్వించి బాలురై కట్టువడరె

గీ॥ పతుల నిజదైవతములని మతిఁదలంచు
సతుల కహితమ్ముగోరు దుర్మతుల కెందు
నిహపరంబులు సున్నయుం చెంచి బుద్ధి
గలిగి వర్తించెదేని మంగళము గలుగు॥

అక్బ—సుందరీ! నీవు వ్యర్థముగ గోపించితివి పవిత్రస్వభావముగల సతులను నేను హృదయపూర్వకముగ గౌరవించెదను అట్టివారియిచ్ఛకు విరుద్ధముగ నేనెన్నఁడును బ్రవర్తింపను అక్బరొకమహావ్యక్తి గాకున్నను అతఁడు మహాత్మ్యమును గురుతింపఁగలఁడు రమ్ము నిన్ను బయటకు బంపెదను. (అక్బరునివెంట జోషిబాయి వెళ్లును.)

తృతీయ దృశ్యము

స్థానము—పృథ్వీరాజుగది సమయము—రాత్రి.

(పృథ్వీరాజు కవిత్వము వ్రాయుచుండును)

పృథ్వి—గీ॥ బ్రహ్మలోకమ్ము నల పరబ్రహ్మమాడ్కి

అల్లవె కుంరమ్ముక్ దానవారియటుల
స్వర్గలోకమ్ము నలశచీపతివిధంబు
భరతఖండంబు నేలు నక్బరు విభుండు॥

పైమూడుపాదములందును అల, అల్ల, అల అని మూడు వడి కట్టు రాళ్ళు పడినవి మరియు నాల్గవపాదమున గోడపై పిల్లివాటముగ తద్ధర్మకాలముగాక "భరతఖండంబు నక్బరు నేలుచుండె" అని వర్తమానకాలముంచిన ప్రకరణోచితముగ నుండెడిది. కాని యతి భంగమునచ్చును యతిభంగమోలేక దీనిని విధించినవారికి మతిభంగమో తెలియదు. కాని ఒక్కొకప్పుడు ఇది ప్రాణాలు తీయును. ఇట్టిసమయములందు యతిభంగమున కనుమతియిచ్చినవీరిపుట్టి యేమియునింగిపోవునో తెలియకున్నది. అయితే—

(జోషి. బాయి ప్రవేశించును)

పృధ్వీ—ఏమిజోషి! ఉత్సవము చూచివచ్చితివా?

జోషి.—ఆఁ స్వామీ చూచివచ్చితిని.

పృధ్వీ—నిజము చెప్పుము నీకుఎంత ఆనందము కలిగినది? నేనుమొదటనే చెప్పితిని. ఇట్టియుత్సవము ప్రపంచములో నెక్కడను జరుగదు బాదుషావిలెసే ఈ యత్సవము ను అసాధారణమైనది.

(బ్రహ్మలోకమ్ము, అను పద్యము చదవును.)

జోషీ—ఛీ! స్వామీ! ఇట్టిపద్యములు వ్రాయునపుడు మీమస్తకము లజ్జాభరముచే నవనత మేలకాదు? మీనాలుక చీలిక లేలకాదు? ఇంత నీచస్తుతియా! యింతఅసత్యముఖస్తుతియా!

పృధ్వీ—ఏమి జోషి! ఇం దసత్య మేమున్నది? బాదుషాగారు ఈస్తుతి కెంతయు నర్హులనియే నాతలంపు ఇంతకు మించి స్తుతించినను అతిశయోక్తిగా నేరదు.

సీ॥ కాబూలుమొదలు బంగాళ పర్యంతమ్ము
నెల్లదేశమ్ము జయించె నెవఁడు
హిందూముసల్మాను లెలమివర్తింపంగ
నేకసూత్రమున బంధించె నెవఁడు

తా ముసల్మానయ్యుఁ గవిలి హిందూధర్మ
శాస్త్రములఁ శ్రద్ధతోఁ జదువునెవఁడు
అసమ బాహాబల ప్రశమితారాతియై
స్థిరసుయశమ్ము నార్జించె నెవఁడు
గీ॥ అతఁడు పొగడొందఁడే సమస్తావనీశ
మస్తకన్యస్త నిస్తుల మణికిరీట
ఘృణిగణాంచిత పాదనీరేజుఁ డగుచు
విక్రమస్ఫూర్తి యక్బరు చక్రవర్తి

జోషి—మీ పద్యములో నీపాదము నుగూడఁ జేర్పుఁడు—"విమల హిందూరాజరమణులు స్త్రీయోపభోగార్హలని తలపోయు నెవఁడు."

పృథ్వీ—జోషి! నీవు అక్బరును జూడలేదుగా బోలు! కనుకనే యిట్లను చుంటివి

జోషి—చూచితిని స్వామీ! నేఁడు చూచితిని. నేఁడు నా కటారియే నాకు సాయపడనిచో మీ భార్యగూడ అక్బరువారాంగనా సహస్రములో నొక్కతెయయి యుండెడిది.

పృథ్వీ—ఆఁ! ఏమి! ఏమనుచుంటివి?

జోషి—ఇక నేమందును? మీరు క్షత్రియులగుచో, మీయందు మనుష్యత్వమున్నచో, మీయందు కొంచెమేని పౌరుషమున్నచో దీనికి ప్రతిక్రియ సేయుఁడు. లేనిచో 'నాకు నాథుఁడు లేడు, నేను విధవను' అనుకొందును. ఇంక పత్నీభావముతో నన్ను స్పృశించుటకు మీ కధికారముండదు. హా నాథా! ఏమి చెప్పుదును! పిరికి పందలు, కులాంగారులు నగు ఈ హిందువులఁ జూచినచో నాకు పురుషజాతిమీదనే ఏవగింపు కలుగుచున్నది మా యాత్మరక్షణమునకై యింక మేమే కత్తిపట్టుకొందుమా యనిపించుచున్నది. ఆహా! అస్పృశ్యుఁడగు నొకయవనుఁడు ఆలింగనాభిలాషియై మీ ధర్మపత్ని చేయిపట్టుకొనుటయు మీరు ప్రశాంత భావమున మెదలక నిలఁబడి యీ మాటలన్నియు వినుటయు నా?

పృథ్వీ—ఇదియంతయు సత్యమేనా?

శోషి.—నాథా! ఇందును మీకు సందియమా?

గీ॥ అధమ పురుషులువలె నధమాంగనలును
ఒరులు తముఁగూడిరని గొప్ప కుగ్గడింత్రు
సుకులసంజాత కులకాంత యొకఁడు తనుఁ గ
ళంకితం జేసెనని యెందు బొంకునొక్కొ॥

మీరింకను ఎక్కువ వినఁగోరనచో అక్బరుచే వ్రతభ్రష్ట చేయఁబడి ఆతఁడొసంగిన యాభరణములతోఁ గులుకుచు నింటికివచ్చిన మీవదినగారిని అడుగుఁడు. ఆకులటను మీయన్న గామసింహుఁడు నిరాతంకముగ నింటఁజేర్చుకొనెను. ఆహా! ఆర్యజాతి యెంత యధోగతిపాలైనది!

సీ॥ ధీమతి గార్గి లోపాముద్ర మైత్రేయి
మొదలగు విదుషులపుట్టినిల్లు
సావిత్రి యనసూయ సాధ్వి గాంధారి మ
న్నగు పతివ్రతలకు నాటపట్టు
గాంగేయ రాధేయ కౌంతేయులాది వీ
రులగన్న వీరమాతలకు నెలవు
శక్తిసంయుక్త సంయుక్త దుర్గావతి
ప్రముఖ వీరాంగనా వాసభూమి

గీ॥ భారతావని యస్మదభాగ్యగరిమఁ
గులటలకు నాశ్రయంబయి మెలఁగుచుండె
ధనము సుద్యోగములఁ గోరి తమదుసతులఁ
దార్చుచున్నారు హైందవాధములు నేఁడు॥

ఈశ్వరా! ఈపాపయుగమున సాధ్వులకు స్థానము లేదు, ప్రళయకాలాభీలబాడబజ్వాలల నొక్కమాఱుగ నీభారత జాతిని దగ్ధము చేయుము, (క్రోధముతో ప్రస్థానము)

పృధ్వీ—హా నే నేమి వినుచున్నాను. ఈ మాటలన్నియు సత్యములేనా నాకేమియు తోఁచుటలేదు, నే నేమి చేయుదును. అయినను నే నేమి చేయఁగలను? అక్బరు సర్వశక్తిమంతుఁడు- ఇంక నే నేమి చేయఁగలను. ఏమియు ఉపాయము తోఁచుటలేదు.

చతుర్థదృశ్యము

స్థానము—పర్వతగుహ. సమయము—రాత్రి

[ఈర రోగశయ్యపైఁ బరుండును. దగ్గర మేహరు కూర్చుండును.]

ఈర—మేహర్!

మేహ—ఏమి అక్కా?

ఈర—అమ్మయేడ్చుచు నేడ్చుచు బయట కెందుకు లేచిపోయినది? నేను చచ్చిపోవుచుంటిననియేనా?

మేహ—కాదు అక్కా! అట్లనకుము.

ఈర—అయిన నేమి? ప్రపంచములో నింతకంటె మించిన సత్యవిషయమున్నదా? ఈజీవితము కొలఁదికాలమేయుండును ఇక మృత్యువు శాశ్వతమైనది. మృత్యుసముద్రమున ఈజీవితము అలలవలె కొద్దికాలము లేచి పడపడి శాంతమగును. జీవితము మాయాభ్రమ. ఇంక మరణమో స్థిరము-సత్యము చిరస్థాయియు సంజ్ఞాహీనయునగు నిద్రలో నీ జీవితము స్వప్నము వలె వచ్చి పోవుచుండును. మేహర్.

మేహ—ఏమిఅక్కా?

ఈర—చూడుము నీవు మొగలకన్యవు, నేను రాజపుత్రకన్యను. నీ తండ్రియు నాతండ్రియు పరమశత్రువులు, ఒకరిమొగము నొకరు చూచిన మహాపాతకమని తలంచెదరు? ఇంక మనవిద్దఱము పరమమిత్రులము, మనమైత్రి పూర్వజన్మసంస్కారజన్యమాయనిపించును. అయితే మన స్నేహమింక నెంతకాలము? మనము తొలుదొల్త పితృవ్యుని శిబిరమున కలసినమాట నీకు జ్ఞాపకమున్నదా?

మేహ—ఆ జ్ఞాపకమున్నది.

ఈర—తర్వాత నెవ్వరో స్వప్నమునంబలె మనల జతగూర్చిరి. ఈస్వప్నము క్షణస్థాయియే. కాని చాల మధురము నిన్ను విడిచిపోవుచున్నాను. మఱల నెప్పుడో మనము కలసికొనఁగలమని నాకు తోఁచుచున్నది.

మేహా—మరల కలసికొందుమా?—ఎక్కడ?

ఈర—(ఆకాశమువంక వ్రేలితోఁజూపుచు) అక్కడ—ఇప్పుడు నీకా స్థానము కనుపించదు ప్రఖరభాస్కరప్రకాశమున అసంఖ్య తారాగణములువలె తీవ్రజీవితప్రకాశమున ఆస్థానము అదృశ్యమై యుండును. ఈ జీవితజ్యోతి ఆఱిననాడు ఆయపూర్వజ్యోతిర్మయ రాజ్యము ప్రకాశించును కనుపింప సాగును. ఆహా ఆదృశ్యమెంతసుందరమైనది.

(మేహారు మెదలక ఈరవంక చూచును)

ఈర—మేహర్! చూడుము నీ కాయూకాశము కనుపించుచున్నదా? నీలము, గాఢము, సుందరమునై యెంతశోభావహముగ నున్నది! పృథ్వికి బంగారుపూత పెట్టుచు సంధ్యాసూర్యుఁ డస్తమించుచున్నాఁడు. నీరపరాగిశివలె ఆకాశమున ఈలోహితమేఘ మాలిక పలురంగులతో విహరించుచున్నది ఇవి యన్నియు నిక్కంపు వస్తువులే యనుకొనుచుంటివా?

మేహా—కానిచో మఱి యెట్టివి?

ఈర—ఇవియన్నియు తెఱపై వ్రాయఁబడిన వాస్తవిక సౌందర్య చిత్రమాత్రములు. ఆ వాస్తవిక సౌందర్య మీతెరవెనుక నున్నది- అది ఈసూర్యుని వెనుక ఈ ఆకాశమువెనుక నున్నది.

మేహా—(మెదలక ఈరవంక చూచుచుండును.)

ఈర—(కొంచెమాగి) నిద్రవచ్చుచున్నది. నిద్రపోయెదను.

[మెల్లగా ప్రతాపుఁడు ప్రవేశించును.]

ప్రతా—(మెల్లగా) ఈర నిద్రపోయినదా?

మేహా—ఆఁ ఇప్పుడే నిద్రపోయినది.

ప్రతా—మేహర్! ఇంక నీవు పోయి విశ్రమించుము. ఇక్కడ నేను కూర్చుండెదను.

మేహా—కాదు. నేను కూర్చుండెదను. మీరే విశ్రమించుఁడు. మీరు పగలంతయు అలసియున్నారు,

ప్రతా—ఇప్పుడు నాకు విశ్రాంతి అవసరము లేదు. అవసరమైనపుడు నిన్ను పిలిచెదను, నీవు పోయి విశ్రమింపుము.

మేహా—మంచిది. (వెళ్ళఁబోవును.)

ప్రతా—లక్ష్మి యెక్కడ నున్నది?

మేహా—వారు వంటజేయుచున్నారేమో? పిలుతునా?

ప్రతా—పని అయిన పిమ్మట ఇచ్చటకు రమ్మని చెప్పుము.

(మేహారు వెళ్ళును)

ప్రతా—ఇదియే నాదినచర్య. మూడు రోజులనుండి ఒక్క వరుసగా అడవులన్నియు ద్రిమ్మరుచు మొగలసైనికులనుండి తప్పించుకొని తిరుగుచున్నాను. భోజనమునకు సమయము చిక్కుట లేదు. అందులో ఈపిల్ల రోగశయ్యపై నున్నది పిల్లలు ఏమి తినుచున్నారో ఏమి చేయుచున్నారో తెలియదు. నాకు అహోరాత్రములు-ఈయలజడితోసరిపోవుచున్నది (మెల్లగా-ఈరవద్దకుఁ బోయి కూర్చుండును) ఇంతలో నేపథ్యమున పిల్లలరోదనము వినఁబడును.) నిన్న నేను మొగలుల చేతికిఁ జిక్కువాడనే. విశ్వాసపాత్రుఁడగు భిల్లనాయకుని అనుగ్రహముచే నే నీ యవమానము దప్పించుకొంటిని పాప మాతఁడు నాప్రాణములు గాపాడుటకై తన ప్రాణములు పోఁగొట్టుకొనెను. ఇటుల నా ప్రాణరక్షణమునకై ఎన్నిప్రాణములు పోవుచున్నవో తెలియదు. నా ప్రాణదాతల స్త్రీలు అనాథలై కుందుచున్నారు. వారి పిల్లలు నిరాధారులై వగచుచున్నారు ఇది యంతయు దేనికి? నా కొఱకు—నాప్రాణములు రక్షించుటకొఱకు. ఇంక నా ప్రతిజ్ఞ నిలచునట్లు తోఁచుటలేదు. దానిని నిలఁబెట్టుకొనుటకు నాకు సామర్థ్యము లేదు.

లక్ష్మి—(ప్రవేశించి) ఈర నిద్రపోయినదా?

పతా—అవును నిద్రపోయినది. లక్ష్మీ! పిల్లలేడ్చుచున్నా రెందుకు?

లక్ష్మి—వారిద్దరు కూర్చుండిరి. ఇంతలో నొక యడవిపిల్లి వచ్చి వారి రొట్టె లాగికొని పోయెను.

ప్రతా—అయితే ఈరాత్రి వారేమితిందురు?

లక్ష్మి—నేను నావంతు వారికిచ్చితిని. మన మొకపూట తినకున్నను బాధలేదు.

ప్రతా—(కొంచెమూగి) లక్ష్మి!

లక్ష్మి—ప్రభూ!

ప్రతా—లక్ష్మీ! నీవు నానిమిత్తమై బహుకష్టముల సహించితివి.

సీ॥ పతి లభించెనో ధరాపాలుఁడే యగుటకుఁ
గుడువఁగూడును గట్ట గుడ్డ కరవు
రాజ్యమబ్బెనో మహారాజ్యమే పేరుకు
తలదాఁచు కొనుటకు నెలవు నున్న
వైభవంబలవడెనో భవ్యరాజ్ఞీత్వ
జనితమ్ము, సతతమ్ము శ్రమముపడుటె
సంతతిగల్గెనో సంతతత్వత్పిపా
సలకు లోనయి చింత గొలుపునదియు

గీ॥ అతివ! నను జెట్టఁబట్టినదాది నీకు
బహులకష్టమ్ములేగాని స్వప్నమునను
సౌఖ్యమనుమాట లేదాయె చాన యింకఁ
గష్టములునీయు వెరవును గాంచఁగలవు.

ఇంక నేను స్వయముగ వారికి పట్టుపడెదను.

లక్ష్మి—అదియేమి నాథా?

ప్రతా—ఇంక నేను పట్టుపడక యుండఁజాలను. అదియునుగాక మీకష్టములుగూడ నేను చూడఁజాలను నక్కవలె అడవులందును కొండలందును ఇంక నెంతకాలము దాగుచు తిరుగుచుందును? కడుపునకన్నము కంటికి నిద్ర లేక యెంతకాల మిడుములు పడుచుందుము! నేను అన్నియు సహింపగలుగుదును. గాని నీవు—

లక్ష్మి—నేనా! —నాథా! నాకన్నిటకంటె మీయాజ్ఞా పాలనమందే సమధికానందము గలుగును.

ప్రతా—ప్రేయసీ! కష్టసహనమునకుఁగూడ కొంత అవధియుండును

నేను మోటువాఁడను, పురుషుఁడను. అన్నియు సహింపఁగలను కాని నీవు ఆడుదానవు, కోమలహృదయవు.

లక్ష్మి—నాథా! నన్ను ఆడుదియని లఘూకరింపవలదు. స్త్రీలు పతి సుఖమే తమసుఖమని యెఱుఁగుదురు. మఱియు పతిదుఃఖములను శిరసావహించి సహించుటయు నెఱుఁగుదురు. నాథా! స్త్రీలకు కష్టముసహించుట బాగుగ తెలియును. కష్టసహనమునకే వారి జీవిత మేర్పడినది. ఆత్మోత్సర్గమందే వారి కపారసుఖము జనించును స్వామీ! మీయరికాలులో ఒకచిన్నముల్లు గుచ్చుకొనినచో అది మాహృదయమున అంకుశమువలె పొడుచుకొని అపారబాధ గలిగించును

సీ॥ ప్రాణాధికంబగు పరమసంప్రీతిఁ బా
యకతల్లి దండ్రుల నాదరించు
భుజలతా వేష్టితంబునఁ జక్కనిడుకొని
పతి నతిప్రీతిఁ గాపాడుచుండు
హృదయరక్తమును సమ్మోదమునఁ బాఱించి
సంఘభూజమును రక్షణముసేయు
ఆహారనిద్రాదులన్ని విసర్జించి
ప్రాణపణమ్ముగాఁ బ్రజను బ్రోచు
గీ॥ ప్రేమయే ధ్యేయమై సదా వెలయుచుండు
ధర్మమే జీవితంబయి తనరుచుండు
త్యాగమే మూలమంత్రమై అలరుచుండు
భళిర! స్త్రీజాతియన లాఘవంబు తగునె॥

ప్రతా—నిజము కాని నామూలముగ ఈపసికాయలుగూడ చాల కష్టపడుచున్నారు.

లక్ష్మి—స్వామీ! ముందుగ స్వదేశమా లేక పిల్లలా

ప్రతా—లక్ష్మీ! నీవు ధన్యురాలవు. నీకు సాటిలేదు. దైన్యనిలయమగు నీవిపత్సమయమందును నీవు నన్ను అధః పతితుని గానీయలేదు కాని యిప్పుడు నావలన నేమియుఁగాదు. నేను దుర్బలుడను

నాకు బలమిమ్ము నేను కరగిపోవుచున్నాను, నన్ను కఠి
నునిఁ జేయుము. నాకనులముందు అంధకార మావరించినది.
నాకు దీపము చూపింపుము.

ఈర—అమ్మా!

లక్ష్మి—ఏమి అమ్మాయీ!

ఈర—ఎంత సుందరము! చూడుమమ్మా! ఇది యెంత సుందరమో!

లక్ష్మి—ఏమి అమ్మాయీ!

ఈర—ఈ రంజిత సముద్రము. ఇందు ముక్తదేహములగు ఆత్మలెన్నియో
కొట్టుకొని పోవుచున్నవి అపారసౌందర్యమయములగు ప్రకాశ
ఖండము లెన్నియో పరుగెత్తుచున్నవి. ఆకాశమునుండి నిరంతర
మధురసంగీతధార వర్షించుచున్నది. మూర్తిమయియగు చింత,
వర్ణమయియగు కామన, ఆనందమయియగు ఇచ్ఛ

ప్రతా—(లక్ష్మితో) ఇది స్వప్నము చూచుచున్నది కాఁబోలు

ఈర—(ఉలికిపడి) అంతయు పోయినది. ఇదియేమి? అమ్మా! మనమె
క్కడ నున్నాము?

లక్ష్మి—చూడుమమ్మాయీ! అందఱు నిక్కడనే యున్నారు.

ఈర—అమ్మా! మేహరు ఎక్కడ నున్నది?

లక్ష్మి—పిలచెదనా! అదుగో వచ్చుచున్నది.

(మేహరున్నిసా ప్రవేశించును)

ఈర—మేహర్! నీ వెచ్చటకు వెళ్లితివి? ఇట్టి సమయమున నన్నువిడి
చి నీవెచ్చటకు వెళ్లితివి? ఇదుగో నేను వెళ్లిపోవుచున్నాను రమ్ము
నాతో రెండుమాటలు మాటలాడిపొమ్ము.

లక్ష్మి—ఛీ, ఈరా! ఏమిమాటలవి?

ఈర—కాదు అమ్మా! నేను వెళ్లిపోవుచున్నాను. మీకేమియు తెలియ
దు నా కంతయు తెలియును. ఇప్పుడు నేను వెళ్లుచున్నాను.
వెళ్ళుటకు ముందు మీకు రెండుమాటలు చెప్పెదను నాయన
గారి శరీరము సరిగాలేదు వారినివ్యర్థముగ యుద్ధమున కెందుకు
పురిగొల్పెదవు? వారిప్పుడీ కష్టములను సహింపఁజాలరు—

నాయనగారూ! వ్యర్థముగ మీరేల యుద్ధము చేసెదరు? మానవుఁడు చేయఁజాలినదంతయు మీరు చేసితిరి. అక్బరు తన మానవత్వమును బోగొట్టుకొని చిత్తౌరుదుర్గమును బట్టనెంచినచో నెంచుఁగాక వ్యర్థమగు రక్తపాతము చేనేమి లాభము? మీరు అన్నియు విడిచిపెట్టుఁడు అక్బరు చిత్తూరుకోట కోరుచో నిచ్చివేయుఁడు. ఇంక నేమేని మీయొద్దనున్నచో ఇచ్చివేయుఁడు ఆయన తీసికొనుఁగాక ఇవి యన్నియు స్థిరములా? ఇంక నేను పోవుచున్నాను. నాస్థానమున మేహారును విడిచిపోవుచున్నాను. మీరీమెను నన్నుబలె ప్రేమింపుఁడు మేహారు ఎట్టిశుభముహూర్తమున ఇచ్చుటకు వచ్చినది! ఆమె రాకున్నచో మీకు వినోదమునకై యెవరిని విడిచిపోవుదానను. మేహర్! మనయిద్దఱకు పరస్పరమైత్రి యున్నటుల మనతండ్రులకు లేదు. నీచేతనగుచో వీరిద్దఱకు స్నేహముగూర్పుము. మరవకుము.

మేహా—సోదరీ ఈరా! నీప్రతిమాటయు జ్ఞాపకముండును.

ఈర—మంచిది నేను పోవుచున్నాను (తల్లిదండ్రుల పాదముల స్పృశించి మేహరుతో) సోదరీ! ఇపుడు నేను వెళ్ళుచున్నాను. నామృత్యువెంతయు సుఖపూర్ణమైనది నేను నాతల్లిదండ్రుల ఒడిలో మాట్లాడుచు మాట్లాడుచు చనిపోవుచున్నాను మంచిది నేను వెళ్లిపోవుచున్నాను.

లక్ష్మి—ఈరా! ఈరా!

ప్రతా—హా పరమేశ్వరా,

---

## పంచమదృశ్యము.

స్థానము—అక్బరుని ఆలోచనాగృహము. సమయము—మధ్యాహ్నము (అక్బరు చేత నొకజాబు పట్టుకొని ఉత్తేజితభావముతో గదిలోనిటునటు తిరుగుచుండును. మానసింహుఁడు ఎదుట నిలఁబడి యుండును.)

అక్బ—మహారాజా! మీరు ధన్యులు మీకు సాధ్యముగానిపని యేదియు లేదు. మీకు లొంగనిశత్రువులును ఎవ్వరు లేరు ప్రతాప

సింహునివంటి బలిష్ఠశత్రువులును మీరు కాలిబేరమునకు తేఁ
గలిగితిరి. నేడు పృథ్వీరాజు ఇంకను ఏలరాలేదు.

[మహాబత్ఖాను వచ్చి సలాముచేయును]

అక్బ—మహాబత్! నాయాజ్ఞప్రకారము నేఁడు పట్టణమంతయువిజయోత్సవమును చాటఁబంచుము. ప్రతిసౌధశిఖరమందును చీనాంబర పతాకములుగట్టవలయును. రాజవీధులందుగీతవాద్యములుజరుగ వలయును విశాలమగు ఢిల్లీచౌకులో రాజపుత్రులును, మహమ్మదీయులును ఉత్సవములు చేయవలయును దేవాలయములందును మసీదులందును దైవప్రార్థనలు గావింపవలయును. ఆగ్రాపట్టణమున దీపావళిఉత్సవము చేయవలయును బీదలకు విరివిగా అన్నవస్త్రములు పంచిపెట్టవలయును. నేఁడు రాణాప్రతాపసింహుఁడు అక్బరుని అధికారమును స్వీకరించెను. తెలిసినదా మహాబత్! త్వరగా పొమ్ము.

మహా—చిత్తము (ప్రస్థానము)

(పృథ్వీరాజు ప్రవేశించును)

అక్బ—రండు కవిరాజుగారూ! నేఁడు మీకొక సంతోషవార్త చెప్పెదను. దీనిపై నొక చక్కని పద్యము వ్రాయవలయును.

పృథ్వీ—సమ్రాట్ ఏమి యావార్త?

అక్బ—రాణాప్రతాపసింహుఁడు నాయధీనతను ఒప్పుకొనెను.

పృథ్వీ—సమ్రాట్! పరిహాస మాడుచుంటిరా?

అక్బ—ఇదుగో జాబు చదువుఁడు. (జాబు ఇచ్చును)

పృథ్వీ—(చదువుకొనును.)

అక్బ—మహారాజా! ప్రతాపసింహున కేమని జవాబు వ్రాయుదము?

మాన—ఇదియే బాదుషాగారు చాలసంతోషించిరనియు, మీరాక నిరీక్షించుచుంటిమనియు, మీకు వీరోచితమగు సన్మానముజరుగుననియు వ్రాయుట మంచిది. (కొంచెమాగి స్వగతము) కాని ప్రతాప్! నీ వేసన్మానమును నేడు చేతులార పోఁగొట్టు

కొంటివో దానిముందు నీకు ఢిల్లీలో జరుగు సన్మానము అచ్చంపు ముత్తెముముందు మాయముత్తెమువలె నుండును.

పృథ్వీ—సమ్రాట్! ఈజాబు నిజమైనది గాదు.

అక్బ—(ఉలికిపడి) నిజముగాదని మీ కెట్లు తెలియును?

పృథ్వీ—సమ్రాట్! నాకు దీనిపై బొత్తుగా నమ్మకము కలుగుట లేదు.

గీ॥ గానము కఠోరమగుటయు ఖరకరుండు
నల్లపడుటయు ననలుండు చల్లపడుట
ధరను గనవచ్చుఁగాని ప్రతాపసింహుఁ
డొరులకు శిరమ్ము వంచుట జరుగదెపుడు.

సీ॥ ఆకొన్నఁ బ్రాణమ్ము ఁ బవనయించునుగాని
సింగమ్ము ఖరమును మ్రింగునొక్కొ
పీకెయంతయు నెండుఁగాక చాతకపక్షి
ధరఁబడ్డ యుదకమ్ము ద్రాగునొక్కొ
ముత్తెముల్ లేకున్నఁ బొగులునే కాని మా
నసహంస నత్తల మెసవునొక్కొ
పతిగతప్రాణయౌ సతిపూతచిత్త మ
న్యనియూపధనముల గోరగునొక్కొ

గీ॥ ఎంతదారిద్ర్యమే నిచ్చగించుఁగాని
ఎట్టికష్టమ్ములకు నోడిగట్టుఁగాని
ధరణి తల్క్రిందులైనఁ బ్రతాపసింగు
మొగలులకు శిరముఁ వంచఁబోవఁ డెపుడు॥

కాన ఇది ప్రతాపసింహుని చేతివ్రాత గాదు.

అక్బ—కాదు కాదు ఇది తప్పక ప్రతాపుని చేతివ్రాతయే పృథ్వీరాజా! రేపు ఉదయము మొదలుకొని రాత్రివఱకు ఆగ్రాలో విజయోత్సవము చేయవలసినదని నేను ఆజ్ఞాపించితిని. ఇంక నేను పోవు చున్నాను. మహారాజా! ఉత్సవములో నేమియు లోపము లేకుండఁ జూడుఁడు (త్వరగా పోవును.)

మాన—పృథ్వీరాజా! మీ రేమందురు?

పృథ్వీ—మహారాజా! ఏమందును.

చ॥ అవిరలవిక్రమక్రమపరాస్తసమస్తసపత్నవీరులై
భువి నతినీచనేలు రసపుత్రులజాతి నిరస్తవీర్యమై
యవనులదాస్యపాశమున నాదటఁ జిక్కి కృశింపుచుండ శా
త్రవదళభీకరుండగు ప్రతాపుఁడొకండె కడంక స్వాతంత్ర్యగౌ
రవమును బ్రోచి చిందుకరాజశ్రీ వహించె నెంతయున్॥

మనమెల్లరము నతనినే నమ్ముకొనియుంటిమి. ఆతనిమూలము
ననే రాజపుత్రకులోద్ధరణము, మాతృదేశస్వాతంత్ర్యము జరుగఁగల
దని తలంచుచుంటిమి. తుదకు మనయీయాశామాత్రదీపముగూడ
చల్లారినది.

గీ॥ తరుణసింహప్రతాపి ప్రతాపసిం గు
ప్రక్క బల్లెంపుపోటును వఱలియుంట
వ్యాజవిజ్ఞుండు బాదుషా యరఁగియుండెఁ
గాక యితనికిఁ బట్టఁ బగ్గములుగలవె?

ఇంక అక్బరు నిర్భయుఁడు ఆతనినిరంకుశస్వేచ్ఛాచారము నెవ్వ
రడ్డగలరు?

మాన—మీహృదయమందలిభావము తెలిసినది. అక్బరుపై మీరెంత
క్రుద్ధులగుటకుఁ గారణము నెఱుఁగుదును. మీరు మేవాడకుఁ
బోయి ప్రతాపసింహుని మరల యుద్ధమున కుత్సాహితునిఁ
జేయఁగోరినచో చేయవచ్చును. నేనేమియు నాతంకము సేయను

పృథ్వీ—మీరు మహోదారులు. మీ మహత్త్వము ప్రశంసనీయము.
(ప్రస్థానము.)

మాన—ప్రతాప్! ప్రతాప్! తుదకేమి యిట్లు చేసితివి? నేఁడుఁ
మేవాడుసూర్యుఁ డస్తమించెను. నేఁడు పర్వతశిఖరము విరిగి
పడినది. (మెల్లగా నిష్క్రమించును.)

## ష ష్ఠ దృ శ్య ము.

స్థానము—పృధ్వీరాజగృహము సమయము—ప్రాతఃకాలము

[బికనెరు, మార్వాడు, గ్వాలియరు, చందేరీరాజులును, పృధ్వీ రాజును కూర్చుండియుందురు.]

మార్వా—నౌరోజు ఉత్సవము పూర్తిఅయినది.

గ్వాలి—ఆఁ దానితోపాటు రాజపుత్రమహిళాసాంవత్సరిక పరిభవోత్స వమును పూర్తి అయినది.

చందే—(బికనెరుతో) ఊరకుంటిరేమి? మీరును ఏమేని సెలవిండు. ఏమి ఆలోచించుచున్నారు?

బిక—నే నేమి చెప్పుదును?

చందే—వీరిరంగు కొంచెము మారినట్టులున్నది తప్పక యేదోజరిగినది

గ్వాలి—ఈమాఱు నౌరోజుఉత్సవములో నొకక్రొత్తవిషయము జరిగి నదని జనులనుకొనుచున్నారు. ఇది నిజమేనా?

బిక—లేదు వట్టియసత్యము.

గ్వాలి—అసత్యమా— నౌరోజు ఉత్సవమునుండి తిరిగి వచ్చునపుడు బికనేరు రాణిగారి అలంకారధ్వనులు మేము మామేడలోనుండి విన లేదా? వహ్వా! ఎంత శ్రావ్యమైనధ్వని. —టింగుటంగు టిం గటంగు స్వదేశభూషణముల కట్టిధ్వనియుండదు అవి ఊరక భణభణభణభణమని మ్రోగును. ఈటింగుటంగు తప్పక మొగలు లవని వాటుతన మే

మార్వా.—అయితే ఇంతకు ఈమాఱు రాణిగారి కేమేమి సత్కార ములు జరిగినవి.

బిక—మంచిసత్కారములే జరిగినవి,

గ్వాలి—కొంచెము చెప్పుదురు. మేముగూడ వినెదము.

చందే—అవును. అవును. స్పష్టముగా చెప్పుడు

బిక—మీరెల్లరు మీమీ యిండ్లకుఁబోయి రాణుల కెట్టిసత్కారము జరుగునో అడుగుఁడు. తమతమ పిల్లలనెత్తిపై చేయివేసి ధర్మ సాక్షిగా ఎట్టి సత్కారము జరిగినదో నిజము చెప్పుమని యడు

గూడు. గుఱిగింజ తననలు పెఱుఁగ దనినట్లు మాట్లాడిన నేమి ప్రయోజనము?

(రక్త నేత్రయు, శిథిల కేశ పాశయు, విచలిత వసనయునయి జోషిబాయి ప్రవేశించును. ఆమె భీకరవేషమును జూచి అందఱు నిలబడుదురు

జోషి.— (రెండుచేతులు పైకెత్తి) ఓ రాజపుత్ర రాజులారా! నేను పృథ్విరాజు ధర్మపత్నిని. నా పేరు జోషిబాయి. నేఁడు లజ్జను విడనాడి నాకళంక కథను మీ యెదుట చెప్పికొనుటకై వచ్చితిని. ఆవిషయమును నేను హృదయమున దాఁచియుండఁ జాలను. నా శరీరమంతయు మండిపోవుచున్నది. వినుఁడు— నేను ను నౌరోజు ఉత్సవమునకుఁ బోతిని. మరల నెటులనో తిరిగివచ్చితిని, మానప్రతిష్ఠలతోఁ బోతిని వానిని పోఁగొట్టుకొని వచ్చితిని. ఇట్లు నేనొక్కతెనె కాదు. ఈవార్షికలోఽ సోత్సవము నకు బోయిన రాజపుత్రస్త్రీలలో దాదాపు సగమునంది మానప్రతిష్ఠల బో గొట్టికొనియు సగముమంది వ్రతభ్రష్టలయియు తిరిగివచ్చిరి. నేఁడు తప్పని పనిచే ఈయసహ్యాలజ్జా విషయములు మీకు చెప్ప వలసి వచ్చినది. నిద అతిగాఢనశను బొందినపుడు ఇట్టి చెప్పు దెబ్బలచేతనే అది తొలఁగిపోవును తక్కినవిషయము లేవి యెట్లున్నను హిందువులు తమస్త్రీల సతీత్వరక్షణమునకై ప్రాణము లర్పించెదరనివినెడిదానను ఇప్పుడాశక్తి కూడ వారియందు లేదు, నేడు రాజపుత్రస్థానములో హిందూసతీ రక్షణకై సాయపడు వాఁడొక్కడును లేడా?

జోధ — లేకేమి' రాణాప్రతాపసింహుఁడున్నాఁడు.

జోషి:— లేదు. ఇప్పుడు ఆయనయు లేడు. దేశవ్యాప్తమగు సీనీచత్వ మధ్యమున ఇన్ని దినముల వరకు ఆయన యొక్కఁడే తలయెత్తు కొని నిలబడియుండెను. ఈ గౌరవాధఃపతనమున ఆయనహృదయ మొక్కటియే అజేయమై యున్నతమై కనుపట్టుచుండెడిది. రాజప్రసాద భోగులగు నీరాజపుత్ర కులాంగారుల మధ్య ఆయన యొక్కఁడే గరిమామయమగు దారిద్ర్యవ్రతము నవలంబించి

యున్నాఁడు కాని ఇప్పుడాయనకూడ అక్బరునకు తలవంచెనని వింటిని. ఇంతదనుక దేశమందలి సాధ్వీమణులెల్లరు ఆయన నామమునే జపించుచుండెడివారు. కాని ఇప్పుడా ప్రతాపసింహుఁడు లేడు

చ॥ ధనమును వైభవంబులఁ బదంబులఁ గోరుచు మాతృదేశముం
దనయులు మ్లేచ్ఛజాతులకుఁ దార్చిననాఁడె యెఱుంగనాయె వీ
తనయులు వీర లింతులను దల్లులఁ బిల్లలఁ దార్తురింకనం
చనుభవమయ్యె నేటికది యక్షరమక్షరమున్ యథార్థమై.

గీ॥ రాజపుత్రాంగనలు మాన రహితలగుచు
నిజమలం బడునప్పుడు నిలను బతులు
సతులధర్మంబు రక్షింపఁ జాలనపుడు
తుది యుపాయంబు ప్రాణముల్ తొలఁగుటొకటె.

(కత్తి దూసి) దీనిచే హిందువులు కన్నులు తెరతురేమో చూచెదను నిద్రితులగువారిమానవతీవ్రము బహుశః మేల్కొనవచ్చును (జోషి కత్తితో రొమ్మునఁ బొడుచుకొని క్రింద బడిపోవును. అందఱు ఆశ్చర్యముతోఁ జూచుచుందురు.)

పృథ్వీ—జోషి! జోషి! ఏమి యిట్లు చేసితివి? (దగ్గరకు వెళ్ళును.)

జోషి—చాలు ఇంక పొందు స్వామీ! నన్నవమానించినవాని పాదములు చుంబనము సేయుఁడు. వానిగుణములుగానము సేయుడు. నీకును ధర్మమునకును భేదము పొడగట్టునపుడు నేను నిన్ను విడిచి ధర్మమునే స్వీకరించెదను. పతి తనపడఁతియొక్క ధర్మమును రక్షింపఁ జాలనపుడు పడతియే తనధర్మమును రక్షించుకొనును.

## నవమ దృశ్యము

స్థానము—పర్వతగుహ. సమయము—రాత్రి

(ప్రతాపుఁడు, లక్ష్మి)

ప్రతా—లక్ష్మీ! మేహరున్నిసా యెక్కడున్నది?

లక్ష్మి—వంట చేయుచున్నది.

ప్రతా—నేను మేహరును నాబిడ్డనువలె ప్రేమించెదను. నాకోడలు కూడ ఇట్టిగుణవతి లభించుగాకయని నే నీశ్వరుని ప్రార్థించు చుందును.

లక్ష్మి—(మెదలక యుండును.)

ప్రతా—లక్ష్మి! మరల నీవు దుఃఖించుచుంటివా? మన ఈర పుణ్యలోక మునకుబోయినది దానికై దుఃఖమెందుకు?

లక్ష్మి—నాథా!—(ఏడ్చును)

ప్రతా—నీవుకొంచె మాలోచించుము మనముమాత్ర మింకనెన్నిరోజు లుందుము? ఏడ్వకుము. కొలదికాలములో మనమును దాని వద్దకు బోయెదము.

లక్ష్మి—నాథా! నన్ను క్షమింపుడు. ఇంక నే నేడ్వను. మీరు నాకు గురువులు. నేను మీకు శిష్యురాలను. ప్రాణేశ్వరా! నేను మీకు తగినశిష్యురాలను కాఁగోరుచున్నాను. (ప్రస్థానము.)

(గోవిందసింహుని ప్రవేశము)

గోవిం—రాణాజీ! మీరు అక్బరుని అధీనత నొప్పుకొనిరని నేఁడుఆగ్రా పట్టణమున గొప్పఉత్సవము చేయఁబడుచున్నది మేడలపై జెండాలు గట్టినారు, రాజవీధులందు దీపోత్సవము జరుగుచున్నది. యింటింటను నృత్యగీతములు జరుగుచున్నవి ఇది మీ కెంతయు గౌరవవిషయము

ప్రతా—(శుష్కహాస్యముతో) అవును. గౌరవవిషయము.

గోవిం—అక్బరు తనదర్బారులో కుడిప్రక్క ప్రప్రథమమున మీకు ఆసనము వేయించినాఁడు.

ప్రతా—ఇది ఆయన అపారదయ.

శక్త—(ప్రవేశించి) అన్నయ్య యెక్కడ?

ప్రతా—ఎవరు? శక్తా!

శక్త—అవును అన్నా! నేనే. మొగలులయుద్ధములో నీకు సాయము చేయుటకై వచ్చితిని.

ప్రతా—వద్దు తమ్ముఁడా! ఇప్పుడు సహాయ మక్కఱలేదు, నేను మొగ లులకు లొంగి సంధిచేసికొన నిశ్చయించితిని.

శక్త—ఆఁ యేమి! నీవు అక్బరునకు లొంగితివా?

ప్రతా—అవునుతమ్ముఁడా! ఇప్పుడు అక్బరుతో నాకేమియు వైరము లేదు మేవాడు పోనిమ్ము, చిత్తూరుపోనిమ్ము, కోమలమీరు పోనిమ్ము

శక్త—ప్రపంచము నవ్వును

ప్రతా—నవ్వనిమ్ము,

శక్త—మానసింహుఁడు నవ్వును,

ప్రతా—నవ్వనిమ్ము. ఏమిచేయుదును

శక్త—అన్నా! సిట్టిమాటయందువని నేను స్వప్నమందును అనుకొన లేదు.

ప్రతా—తమ్ముఁడా! నేనేమి చేయుదును. ఎవ్వనిదినములుగాని ఎప్పుడు నొకరీతినుండవు.

శక్త—నేను చెప్పునదియు నిదియే. ఇంతదనుక మేవాడుకు కష్టపు దిన ములు. ఇంకి మంచిరోజులు రాగలవు. ఈవిషయము నీకు తెలు పుటకే నేను వచ్చితిని.

ప్రతా—(మెదలకయుందును.)

శక్త—అన్నా! నీవెఱుఁగుదువా? నే నిచ్చటకు వచ్చుటకు ముందు ఫిన సహారా దుర్గమును జయించితిని

ప్రతా—నీవా!—నీకు సేన యెక్కడిది?

శక్త—నేను దారిలోనే చాలమంది సైనికులఁ బోగుచేసితి. నేను వెళ్ళిన చోటనెల్ల "నేను ప్రతాపసింహుని తమ్ముఁడను. శక్తసింహుఁ డను. ప్రతాపసింహునికి సహాయము చేయఁబోవుచున్నాను. నా తో రాఁదలచిన వారెల్లఱు రండు" అని అఱచుచు వెళ్లితిని. ఈనా పిలుపు వినగనే గృహస్థులు తమభార్యలను విడిచియు తం డ్రులు తమపిల్లలను విడిచియు లోభులు తమ ధనమును విడిచియు నాకు సహాయమునకు వచ్చిరి. దారినిబోవు కూలివాండ్రు సెత్తి

పైని మోపులు పాఱవేసి యస్త్రములు ధరించిరి. గూనువాండ్రు అొమ్ము తిన్నగా సాచి నిలఁబడిరి. ఇంకనాకు సైనికుల కేమి తక్కువ? నీపేరులో ఇంద్రజాల మున్నది. దానిని నీవెఱుఁగివు, నేనెఱుఁగుదును.

[భామాషాతో పృథ్వీరాజు ప్రవేశించును.]

పృథ్వీ—రాణాగారెక్కడ?

ప్రతా—ఎవరు? పృథ్వీరాజా! ఇచ్చట కేల వచ్చితివి?

పృథ్వీ—రాణాజీ! మీరు అక్బరుని అధీనత నొప్పుకొంటిరా?

ప్రతా—అవును పృథ్వీరాజా!

పృథ్వీ—హా అభాగ్యభారతవర్షమా! తుదకు నిన్ను రాణాకూడ విడచి పెట్టెనా? రాణాజీ! మేము భ్రష్టులము బానిసలము కానే అయితిమి, మీరొక్కరేని మాజాతి గౌరవము కాపాడుచుంటి రని సంతోషించుచుండెడి వారము, రాజపుత్రరాజమండలము లో అక్బరునకు తలవంచక ప్రతిష్ఠతో మీరొకరుండిరని చెప్పి కొనియేని మేము గర్వపడుచుండెడి వారము. అకటా! నేఁడు మా ఆయాదర్శముకూడ నష్టమాయెను.

ఉ॥ సంతతదాస్యవేదనకుఁ జాలఁగ నేడ్చెడు భారతాంబ య
త్యంతదురంత బాష్పజలధారికు మీదుకతానఁ గొంత వి
శ్రాంతి లభించె నిందనుక క్షత్రియవంశ వతంస! యింక న
శ్రాంతతదశ్రుపూరమున సర్వము కొట్టుకపోవు నీయెడన్

ప్రతా—పృథ్వీరాజా! నీకు లజ్జ యగుటలేదా? నీవును నీయన్నయగు రాయసింహుఁడును గ్వాలియర్ మార్వాడమున్నగు రాజులెల్ల రును నీచభోగవిలాసములఁ జిక్కుకొని అక్బరునివద్ద ముఖస్తుతు లు చేయుచు పైఁగా రాజపుత్రస్థానమంతకు నే నొక్కఁడనే కొం డుపూటలు ఇన్నిగంజినీళ్లని త్రాగుటమాని మీయెల్లర యభి మానమునకును ఆదర్శము కావలయునని కోరుచుంటిరా? ఎంత టి స్వార్థపరులు!

పృథ్వీ—రాణాజీ! అధమమగు భల్లూకమును ఆటగాండ్రు ఇచ్చవచ్చినటుల ఆడించెదరు, కాని సింహము ఘోరారణ్యముల నతిగౌరవముతో తిరుగుచుండును. దీపము లెన్నియో యుండును. గాని సూర్యుఁ డొక్కఁడే. సస్యశ్యామలయగు, భూమిని ఎల్లఱు దున్నెదరు, కాలితో త్రొక్కెదరు. కాని మహోన్నతమగు పర్వతరాజము దరిద్రమయ్యును అభిమానముతో తలయెత్తుకొని నిలబడును. ప్రపంచములో క్షుద్రమానవులు తుచ్ఛవిలాసములకును దుచ్ఛసుఖములకును ఆరటపడుచుందురు. కాని అప్పుడప్పుడు అనశనవ్రతులు నిస్వార్థులునగు సిద్ధులు, సన్యాసులు వచ్చి నూతనతత్త్వములను నూతన ధర్మములను ఉపదేశింపు చుందురు. అత్యాచారుల కఱకు కటారులు వారి సత్యజ్యోతి నింకను విస్తరింపజేయును. కారాగృహము లందలి కటిక చీఁకటులు వారి మహిమను మఱియు ప్రకాశింపఁ జేయును. జ్వలదనల జ్వాలలు వారికీర్తిని మఱియు ప్రసరింపఁజేయును, మీరు ఆసిద్ధ సన్యాసులలోఁజేరిన మహాపురుషులు మీరు ఒకరి యధీనతను బాటింపవచ్చునా?

సీ॥ అనమతేజో రాశియైన భాస్కరునకు
గ్రహరాజ్య పట్టంబు గట్టెనెవఁడు
భూరివిక్రమ కళా స్ఫారసింహమునకు
మృగరాజ బిరుదంబు నిచ్చె నెవఁడు
గగన నిరంకుశగతిగల్గు గరుడున
కురుపక్షిరాజాఖ్య నొసఁగె నెవఁడు
జలచరరాజ్యమ్ము శాసింపుమని తిమిం
గలమును బీర మెక్కించె నెవఁడు
గీ॥ సహజవిక్రమ ప్రక్రమస్ఫారవీర
వరులు పరులయాతంకమ్ము దరియనీరు
దేశమునకయి సర్వసన్యాసివయిన
నీవు తుద కొక్కనికి లొంగ నీతి యగునె?

ప్రతా—రాజపుత్రులెల్లఱు నేకమయి మొగలుఁ హస్తమునుండి భారతవర్షమును లాగుకొనుటకు దృఢనిశ్చయులగుచో మొగలుల సింహాసన మింక నెన్నిరోజులు నిలువఁగలదు? నీవెఱుఁగుదువుగదా ఇరువది సంవత్సరములనుండి నేనొక్కఁడనే విడువక యుద్ధము చేయుచున్నాను. ఇంతవఱకు రాజపుత్రరా జొక్కఁడును తన దేశమును, తనధర్మమును ఉద్ధరించుటకు నాకు సాయపడలేదు నేఁడు నాసర్వస్వమును బోఁగొట్టుకొని ఘోరమగు సాంసారిక దుఃఖములోఁ బడియున్నాను. పృథ్వీరాజా! నాకూతురు ఈర చనిపోయినది. ఈయుగ్రారణ్యమున తినుటకు తిండియు కప్పుకొనటకు వస్త్రమునులేక అది యుసురుల విడిచినది. ఇప్పుడు నేనా ప్రతాపుఁడను గాను. ఆతనియస్థిపంజర మొక్కటియే మిగిలి యున్నది.

పృథ్వీ,శక్త—(ఉలికిపడి) ఆఁ! ఈర చనిపోయినదా?

ప్రతా—అవును. ఈదారిద్ర్యకఠోర తుషారపాతముచే నాస్వర్గీయ కుసుమము రాలిపోయినది.

పృథ్వీ—హాపరమేశ్వరా! అట్టిసత్కర్మముల కిట్టి పరిణామమా! రాణాజీ! నేనును మీకు సమానునిగనే యున్నాను. మీరు మహానుభావులు, నేను నీచుఁడను కాని నేనును మీవలెనే దుఃఖితుఁడనే, జోషియు ఇపుడు ఈలోకములో లేదు,

ప్రతా—ఆఁ! జోషిబాయి చనిపోయినదా?

పృథ్వీ—లేదు ఆమె చావలేదు. నరాధముడనగు నన్ను విడిచి దేవలోకమునకుఁ బోయినది,

ప్రతా—ఆమె మృత్యువునకుఁ గారణము?

పృథ్వీ—నాకళంకిత సమాచారమును నే నేమి చెప్పుదును? నౌరోజ ఉత్సవమునకు రమ్మని నవోఢయగు నాభార్యకుకూడ ఆహ్వానము వచ్చినది. ఆమెకిష్టము లేకున్నను బలవంతముగ ఆమెను పంపితి. పైశాచిక కామనావశుఁడై అక్బరు ఆమెను స్పృశించెను. వెంటనే కటారిని దూసి ఆమె తనపతీత్వమును గాపాడు

కొనెను. పదపడి ఇంటికి వచ్చి సర్వరాజసమక్షమున ఆకత్తి తోనే పొడుచుకొని చనిపోయినది.

ప్రతా—ఏమి! అక్బరు హిందూరాజపరాభవ మాత్రమునకు సంతుష్టి జెందక ఇప్పుడు హిందూస్త్రీల పైకిఁగూడ దాడివెడలెనా? అక్బర్! నీవు నిజముగ భారతవర్షమును జయించిన వీరుఁడవు.

శక్త—నేను దీనికి బదులు తీర్చుకొందును.

పృథ్వీ—రాణాజీ! దీనికి ప్రతిక్రియ సేయుటకు మీసహాయమును గోరియే నేను ఆగ్రానుండి ఇంతదూరము వచ్చితిని. ఇప్పుడు మీరే నన్ను రక్షింపఁగలరు.

గోవిం—రాణాజీ! ఈపలుకులు వినికూడ మీరింకను తలవంచుకొని కూర్చుంటిరేమి?

ప్రతా—నే నేమి చేయుదును? నావద్ద నేమియు లేదు. ఒంటరిగా నే నేమి చేయఁగలను? పట్టుమని పదిమంది సైనికులునునావద్ద లేరు.

శక్త—నేను క్రొత్తసేనను పోగుచేసెదను.

ప్రతా—నావద్ద ధనమున్నచో నేను క్రొత్తసేనను పోగుచేయఁగలను. ఏమిచేయుదును? రాజకోశము శూన్యముగ నున్నది.

భామాషా—రాణాజీ! చాల ధన మున్నది

ప్రతా—మంత్రీ! ధన మెక్కడిది? నే నెఱిగున్నంతవఱకు కోశములో గుడ్డిగవ్వకూడ లేదు.

భామా—రాజకోశములో గ్రుడ్డిగవ్వయు లేకున్నను ధనమునకు కొఱత లేదు.

ప్రతా—వృద్ధమంత్రీ! నీకు పిచ్చియా లేక మతిభ్రమయా? ఇప్పుడు ధన మెక్కడనుండి వచ్చును?

భామా—రాణాజీ! చితౌరురాజ్య మున్నతశిఖరమున నున్నపుడు మా పెద్దలు చితౌరు రాజవంశమునుండి చాల ధనమును సంపాదించిరి. ఆధన మిప్పటికిని సేవకునివద్ద నున్నది సెలవగుచో పాదములకడఁ జేర్చెదను.

ప్రతా—నీవద్ద నెంత ధన మున్నది?

భామా—మహారాజా! ఆశ్చర్యపడకుఁడు. ఆధనముతో ఇరువదివేల సైనికులకు పదునాలుసంవత్సరములవఱకు వేతనమిచ్చి పోషింప వచ్చును.

(అందఱు విస్మయముతో నొకరివంక నొకరు చూచుకొందురు.)

ప్రతా—మంత్రీ! నీస్వామిభక్తిని నేను హృదయపూర్వకముగఁ బ్రశంసించుచున్నాను. అయితే భృత్యులకొసఁగిన ధనమును తిరిగి తీసికొనుట మేవాడురాణా కుచితముగాదు. నీవనుభవించుటకే నీకు ధన మొసంగఁబడినది. గాన దానిని నీవేయనుభవింపుము

భామాషా—రాణాజీ! ఇట్టి సంకట సమయములందు సేవకునివద్ద నుండియు ధనముతీసికొనుట యనుచితము గాదు. నేఁడు మేవాడుకు చాలసంకటదినము హిందూస్త్రీల దురవస్థ నొకమాఱు స్మరింపుఁడు. హిందువుల యధోగతియుఁ దిలకింపుఁడు వారి దేశము పోయినది. ధర్మముపోయినది. ధనము పోయినది. ఇంతదనుక మిగిలియున్న స్త్రీలసతీత్వముగూడ పోవుచున్నది. రాణాజీ మీరు దానిని రక్షింపుఁడు. నేను నాపూర్వపురుషులయు నాదియు ఆజన్మార్జితమగు ధనరాశిని మీచేతికిచ్చుచున్నాను అది మీకొరకుగాదు.—హిందూధర్మమును, హిందూస్త్రీల సతీత్వమును రక్షించుటకు నిచ్చుచున్నాను (మోకరిలబడును.)

శక్త—(మోకరిలబడి) అన్నా! దేశనిమిత్తమై మీరీధనమును, దప్పక గ్రహింపుఁడు

ప్రతా—మంచిది. అట్లే కానిండు. నే నీధనమును దీసికొందును. రాజపుత్రసైనికుఁ డొక్కఁడేని ప్రాణావశిష్టుఁడై యుండునంతవఱకు హిందూస్త్రీలసతీత్వమును సురక్షితముగ నుండును. అక్బర్ నీవు పాముకలుగులోఁ జేయిపెట్టితివి. (ప్రస్థానము)

పృథ్వీ—ఇంక నేమియు భయములేదు. నిదురించిన సింగము మేల్కొనినది. మంత్రీ!

గీ॥ అసురసంహారమునకు వజ్రాయుధంబు
నొనరుపంగ దధీచి శక్రునకు మున్ను

# రాణాప్రతాపసింహ.

## పంచమాంకము.

### ప్రథమదృశ్యము,

స్థానము—మానసింహుని ప్రాసాదము. సమయము—సాయంకాలము

[మానసింహుఁడు మహాబత్ఖాను.]

మాన—అయితే శక్తసింహుఁడు మన ప్రధానవర్తకస్థానమగు మాల్పూరును దోచుకొనెనా?

మహా—అవును మహారాజా!

మాన—ఇంతసాహసమా?

మహా—అటు ప్రతాపసింహుఁడును కోమలమీరును వశపఱచుకొని అక్కడ దుర్గము కట్టించుచున్నాఁడు.

మాన—మంచిది. నీవు పదివేల మొగల సైనికులను దీసికొనిపోయి ఫినసహారా దుర్గమును బట్టుకొనుము. అవసరమగుచో వెనుక నుండి నే నింకను సేనను బంపెదను.

మహా—చిత్తము [ప్రస్థానము]

మాన—ఈదేవారుయుద్ధ మెంత యద్భుతమైనది! అందు ప్రతాపుఁడు చూపిన సాహసము, చాతుర్యము వర్ణనాతీతము. అతఁడు మొగల సేనాపతియగు శాహబాజు సైన్యమును తుపానువలె వచ్చి కొట్టుకొనిపోయెను ప్రతాపసింహా! ధన్యుఁడవు, నేఁడీ దేశములో నిన్నుబోలినవీరుఁడు లేఁడు, ఏవిధమున నేని నీతోవియ్యముచేయఁ గల్గినచో నాకెంత గౌరవము, ఎంత సన్మానముండెడిది! కాని మాభాగ్య చక్రము తిరిగిపోవుచున్నది. నీశిరము కోసినను అవనతము కాఁజాలదు. మొగలులతో సంబంధము చేయుటకు నేనెంత వెనుకకు పాఱిపోవు చున్నానో అది

అంత ముందుకు తోసికొని వచ్చుచున్నది. మహమ్మదీయమతా చారముపై దినదిన ప్రవర్ధమానమగు నా ద్వేషభావమును చతురుఁడగు అక్బరును ఇప్పుడు కనిపెట్టినాఁడు. గనుకనే యతఁడు సలీముతో రేవకు వివాహము గావింపఁజేసి నన్నొక నవీనజాలమున చిక్కింపఁ గోరుచున్నాఁడు. ఈ వివాహము మూలమున సలీమునకును నాకునుగల మనస్పర్ధను దొలఁగించుటయు నొక యుద్దేశము. ఔరా! అక్బరునికూట నీతి అత్యద్భుతము!

[ రేవ ప్రవేశించును ]

మాన—ఎవరు? రేవా?

రేవ—అవును, అన్నా!

మాన—ఏమి రేవా?

రేవ—నాకు పెండ్లియా?

మాన—అవును, రేవా?

రేవ—నీవిందు కంగీకరించితివా?

మాన—నే నంగీకరించిన నేమి మానిన నేమి? అంతయు అక్బరుని ఇచ్ఛా ప్రకారము జరుగును. ఆయన ఇచ్ఛయే నా కనుల్లంఘనీయమగు ఆజ్ఞ

రేవ—అనఁగా ఈ వివాహము నీకిష్టము గాదు, అదియే కాదు?

మాన—అవును సోదరీ!

రేవ—అయితే ఈవివాహము ఇంకఁ గాఁజాలదు.

మాన—ఆఁ! అదియెట్లు? ఇది బాదుషాకోరికపై ఆధారపడి యున్నది.

రేవ—బాదుషాకోరిక విశ్వమంతకు అనుల్లంఘనీయమైనఁ గావచ్చును కాని రేవ ఆవిశ్వములోనిది గాదు, ఇంక ఈవివాహము కాఁజాలదు.

మాన—ఏమిమాటలవి రేవా? నేను మాట యిచ్చితిని.

రేవ—ఏమి అన్నా! నన్నడుగకయే మాట యిచ్చితివా? స్త్రీలను వారి యనుమతి దీసికొనకయే యిచ్చవచ్చినవారి కంటఁగట్టుటకు నాగంతకి తగుచు గాంచుడా?

తనదు నష్ఠుల నొసఁగెనంచును బురాణ
ములను జదివినదిప్పు డనుభూతమయ్యె॥

అది సత్యయుగపుది. కలియుగమునఁగూడ నిట్టిది జరుగునని యనుకొనలేదు.

భామా—కవిరాజా! హిందూరమణుల సతీత్వమునకు సంకటము వాటిల్లినపుడు తద్రక్షణార్థమై యేహిందువు తనసర్వస్వము నర్పింపఁడు?

శక్త—మంచిది నేను పోయి సేనను సిద్ధపఱిచెదను. ఒక నెలలో యిరువదివేలసైనికులఁ బోగుచేసెదను (వెళ్ళిపోవును.)

పృథ్వీ—(శక్తసింహుని ఆపి) ఆగుడు. నేనును వచ్చెదను. ఒకనాఁడ జోషి దేశీయులను మోహనిద్రనుండి మేలుకొలుపు నొకగీతమును రచింపుమనినది. నేఁ డట్టిదానిని వ్రాసి రాజపుత్రస్థానమందలి రాళ్లను రప్పలను గూడ మేలుకొలిపెదను జయ కాళీ మాతా.

అందఱు—జయకాళీ మాతా.

(అందఱునిష్క్రమించెదరు.)

## అష్టమ దృశ్యము.

స్థానము—పర్వతమార్గము. సమయము—ప్రభాతము.

[పృథ్వీరాజును గాయకులును పాడుచుందురు. కొంచెము దూరమున గ్రామవాసులు నిలఁబడియుందురు.]

### గీతము.

సమరానలమున నురికెదము - శత్రుగణమ్ముల నరకెదము
అమితశక్తి చూపించెదము - యశము భృశమ్ము గడించెదము
ఆశ్రితజనకల్పకవల్లి - యఖిలగుణాలయ మాతల్లి
ప్రశ్రయమునఁ బూజించెదము - ప్రాణములిడి రక్షించెదము

## చతుర్థాంకము.

జనని పరాధీనతఁ గుందన్ - సౌఖ్యము లేలాగొ పొందక
అనశనవ్రత మొనరించెదము - జననిశ్శృంఖలన్ ద్రుంచెదము
మాన్యచరిత కరుణోపేత - మా యీభారతమాత
అన్యులు దీనిని శాసింప - సర్వాలై నయముదలంప
కఱకుకత్తులు తుపాకిగుండుల్ - మఱిఫిరంగులున్ మఱి భుసుండులున్
సరకుగొనము స్వాతంత్ర్యప్రాప్తికై - సర్వస్వమునర్పించెదము.

—: మాతృభక్తి: — దేశభక్తి:

మాన—అయితే నీ భవిష్యజీవితము సుఖపూర్ణముగఁ గడచునను తలంపుతో నేను మాట యిచ్చితిని.

రేవ—అయితే బాదుషాకు వెఱచికాదుగదా?

మాన—లేదు.

రేవ—అయితే ఈవివాహము నీ కిష్టమన్నమాటయే

మాన—అవును.

రేవ—అయితే దీనికి నాయభ్యంతర మేమియు లేదు

మాన—రేవా! నీ కీవివాహ మిష్టము గాదా?

రేవ—అన్నా! నీ విష్టపడుచో నింక నే నిష్టపడుటయు మానుటయు అవసరము లేదు. నీకిష్టమయినది నాకును గావలయును. ఇదియే నా కర్తవ్యము.

మాన—రేవా! నీవీ వివాహముచే సుఖపడెదవు

రేవ—సుఖపడిన మంచిదియే. కాని నా కాయాశ లేదు. (మెల్లగా వెళ్లిపోవును.)

మాన—నేను నాయీసోదరివంటి ఉదాసీనయు, అనాసక్తయు కర్తవ్యపరాయణయునగు బాలికను మఱియెచ్చటను జూడలేదు అప్పుడే వెళ్లి నిశ్చింతముగ సంగీతము పాడుచున్నది. దీనికంఠ స్వరము చాల కోమలమైనది. దర్బారునకుఁ బోవు సమయ మయినది ఇంక నేను పోవుదును. (ప్రస్థానము)

## ద్వితీయదృశ్యము.

స్థానము—ఫినసహారాదుర్గములోపలిభాగము. సమయము-ప్రభాతము.
(శస్త్రధారియై శక్తసింహుఁడు ఒంటరిగా తిరుగుచుండును.)

శక్త—ఏమి హత్య! ఏమిహత్య! ఏమిహత్య! ఈప్రపంచ మొక్క పెద్ద కసాయిఖానా. ఒకవెంప భూకంపము, వరదలు, రోగములు, వార్ధక్యము మున్నగువానిచే నిత్యము ప్రపంచములో అసంఖ్యములగు హత్యలు జరుగుచుండ మేమింకను తృప్తిచెందక కామ క్రోధలోభాదులకు వశులమై యుద్ధమను పేరుతో ప్రపంచమును

ముంచివేయు భీషణరక్త ప్రవాహములను బొలింపుచున్నాము. మేము హత్యలు చేసినచో ఘోరపాపమఁట! ఇంక ఈశ్వరుఁడు నిత్యము నొనరించు ఈఅసంఖ్య హత్య లేమియుఁగావఁట! మానవుఁ డెవ్వఁడేని ఒకనిని చంపినచో అది హత్యయందురు యుద్ధములోఁజేయు హత్యలను వీరత్వమందురు ఔరా! ఈమానవుఁడెంత చక్కని ధర్మనీతిని సిద్ధపఱచినాఁడు (అనతి దూరమున ఫిరంగులమ్రోఁత విని) అదుగో మరల హత్యాకాండము ప్రారంభమయినది ఇది మృత్యుదేవత హుంకారము!—అదుగో మరల వినఁబడుచున్నది.

(భయముచే వణఁకుచు దుర్గాధ్యక్షుఁడు ప్రవేశించును.)

శక్త—చెప్పుము. ఏమి సమాచారము?

దుర్గా—మహారాజా! కోటతూర్పుగోడ పడిపోయినది ఇంక రక్షణమున కేమియు నుపాయము లేదు.

శక్త—కోటను ముట్టడించుట విషయమై రాణాగారికి పంపినవార్త కేమియు జవాబు రాలేదా?

దుర్గా—లేదు

శక్త—మంచిది సైన్యమును సిద్ధపఱుపుము. ఇప్పుడు జోహారువ్రతమున కుద్యాపనము చేయవలయును. (దుర్గాధ్యక్షుఁడు పోవును.) మహాబత్ఖాను యుద్ధవిద్యలోఁ గడు నేర్పరి. కోటగోడలన్నిటిలో తూర్పుగోడయే గట్టితనము లేనిది. అందుకనియే యతఁడు తొలుదొల్త దానిని పడఁగొట్టించెను. మంచిది ఏమియు భయము లేదు. నేను మృత్యుముఖమునఁ బడుట కెప్పుడును సిద్ధముగనే యుంటిని. కాని సలీమ్! నీఋణము తీర్చుకొనలేక పోతిని.

[వెంద్రుకలు విరియఁబోసికొని దౌలతు ప్రవేశించును.]

శక్త—ఎవ్వరు? దౌలతున్నిసా! నీ విచ్చట కేల వచ్చితివి?

దౌల—నాథా! మీ రింత పెందలకడనే యెచ్చటకు బయలుదేరితిరి?

శక్త—చచ్చుటకు. నీకు జవాబు ముట్టినదిగద? ఇంక లోనికిఁ బొమ్ము. ఇంక నిలచియుంటివేమి? నీకు బాగుగ అర్థము కాలేదా? అయి

తే వినుము బాగుగ చెప్పెదను. మొగలు లీకోటను ముట్టడించిరి నీ వెఱుఁగుదువా?

డాల—అవును ఎఱుఁగుదును.

శక్త—మంచిది. వారిపు డీదుర్గమును దాదాపు జయించి రేయనుకొనుము. దుర్గమును శత్రువులకు వశపరచుటకు మున్ను ప్రాణములు విడుచుట రాజపుత్రజాతి కొకయాచారము. గనుకనే నేను సేన నంతను దీసికొని కోటబయటకు పోవుచున్నాను, అచ్చటనే శత్రులతోఁ బోరాడి ప్రాణము లర్పించెదను. (ఫిరంగుల మ్రోఁతవిని) అదుగో వినుము. ఇంక నాకు దారియిమ్ము. నేను వెళ్లెదను.

డాల—ఆగుఁడు, నేనును వచ్చెదను.

శక్త—నీవును వచ్చెదవా? యుద్ధరంగమునకు! డాలత్! యుద్ధక్షేత్ర మనఁ బ్రేమిజనము పరుండు పూలపాను పనుకొంటివిగాబోలు. కాదు. అది మృత్యులీలాక్షేత్రము.

డాల—నాథా! నేనును మరణించుట యెఱుఁగుదును.

శక్త—అవును. నీవు రోజుకు పదిపన్రెండుమారులు మరణించుచుందువు. కాని యీమరణమంత సులభము గాదు. ఈమరణము అభిమానవతియగు పడఁతియొక్క రోదనముగాదు, ఇది చాల కఠినమైనది.

డాల—అంతయు నెఱుఁగుదును. నేనును మొగలుల బిడ్డను. చచ్చుటకు వెఱువను, యుద్ధక్షేత్రము నాకు క్రొత్తదికాదు. నేనును మీావెంటవచ్చెదను.

శక్త—(కొంచెము సేపు ఆశ్చర్యముతో డాలతువంక చూచి) అయినను మరణించుటకు నీకింతపట్టుదల యెందుకు? ఇంకను నివయస్సు చాల చిన్నది. ఇంకను కొంతకాలము నీవు ప్రాపంచిక సుఖ మనుభవించుట న్యాయము.

(డాలతు తెల్లని మొగము వెంటనే యెఱ్ఱపడును)

శక్త—ఓహో తెలిసినది నీయీచూపున కర్థము తెలిసినది! నేనుచాల కఠినుఁడననియు, నీవు నన్ను చాల ప్రేమించుచుంటివనియునీయ

భిప్రాయముగాఁబోలు. కాని డాలత్! ఈ ప్రపంచములోనాకంటె సుందరులగు పురుషు లెందరో కలరు.

డాల—(వెంటనే శక్తసింహునివైపునకు మెడతిప్పి నిలఁబడి దృఢస్వరముతోఁ జెప్పును) నాధా! పురుషుని ప్రేమవిషయము నేనెఱుఁగను. కాని స్త్రీ ఒక్కమారే ప్రేమించును. ప్రేమ పురుషునకు శారీరిక లాలస కావచ్చును. కాని స్త్రీ కది మజ్జాగతమగు ధర్మము వియోగమందును, నిరాశయందును, నిరాదరణమందును స్త్రీల ప్రేమ ధ్రువతారవలె స్థిరముగ నుండును.

శక్త—భగవద్గీతా పారాయణము చేసితివి. మంచిది. అట్లనే కానిమ్ము నీవును నావెంటరమ్ము మరణముపై నీకింత యభిలాషయున్నచో రమ్ము. అయితే నీ వేవేషముతో మరణింపఁగోరుచున్నావు?

(తుపాకి మ్రోఁతవినఁబడును)

డాల—వీరవేషమున నేను మీతోపాటు యుద్ధము చేయుచు ప్రాణములు విడిచెదను

శక్త—(నవ్వి) డాలత్! వాగ్యుద్ధముదక్క నీకు మఱియేమేని యుద్ధము వచ్చునా?

డాల—నే నింతవఱకెన్నడును యుద్ధము చేయలేదు. అయినను మొగలకన్యను—క్షత్రియప్పుట యెఱుఁగుదును.

శక్త—మంచిది పోమ్ము నీకవచము ధరించిరమ్ము. అయితే తుపాకిగుండు వచ్చి ప్రేమివలె నిన్ను ముద్దుపెట్టుకొనునని మోనుమా జాగ్రత్తగాపోమ్ము, వీరవేషమును ధరించిరమ్ము.

(డాలతు వెళ్లును. కనుచాటగునంతవఱకు శక్తసింహుఁడు ఆమెవంక చూచుచుండును.)

శక్త—అయితే ఈమెనిజముగ నాతో మరణించుటకే వచ్చుచున్నదా? స్త్రీలప్రేమ విలాసమును, సంభోగమాత్రము నేకాదా? ఈమె మఱియొక తగులాటము తెచ్చిపెట్టినది.

(దుర్గాధ్యక్షుఁడు మరలఁ బ్రవేశించును)

శక్త—సేన సిద్ధముగ నున్నదా?

దుర్గా—చిత్తము.

శక్త—మంచిది పద. (ఇద్దరు నిష్క్రమింతురు)

దృశ్యాంతరము.

ఛినసహారాదుర్గముగోడ—ప్రభాతము.

(గోడపై శక్తసింహుఁడును వీరవేషమున దౌలతును నిలబడియుందురు.)

శక్త—అదుగో ఎదురుగశత్రుసైన్యము కనుపించుచున్నదా? మనము వారివ్యూహమును భేదింపవలయును, నీ కీపని చేతనగునా?

దౌల—అగును.

శక్త—మంచిది పద. గుఱ్ఱము సిద్ధముగ నున్నది. ఈయుద్ధములో చచ్చుట తప్పదుసుమా.

దౌ—ఆఁ ఎరుగుదును.

శక్త—ఇంక పద. ఆలసించెదవేల? భయము వేయుచున్నదా?

దౌల—మీరు నావెంటనుండ నింక భయమెందుకు? మిమ్ము మృత్యుముఖమునఁ జూచికూడ భయపడుదునా? నేను నాసర్వస్వమును పోఁగొట్టుకొనుటకు సిద్ధపడియు భయపడుట యెందుకు? ఇన్ని దినములయినది. మీరెన్నడును నన్ను ప్రేమించలేదు. కాని యెన్నఁడేని మీరు నన్ను ప్రేమించెదరనియు ప్రేమపూర్ణదృష్టితోఁ జూచెదరనియు ప్రేమభరితమగు స్వరముతో 'నా దౌలత్' అని పిలిచెదరనియు ఆశ పెట్టుకొనియుంటిని. ఆయాశ చేతనే నేనింతవనుక జీవించియుంటిని నేఁడు ఆయాశకూడ నష్టముకానున్నది. ఇంక నాకు భయమెందుకు?

శక్త—మంచిది పద.

దౌల—నడువుము. (శక్తసింహుని రెండుచేతులు పట్టుకొని ఆతనికి ఎదురుగ నిలఁబడును.)

శక —

దౌల—నాథా! చచ్చుటకుఁ బోవుచున్నాను. చచ్చుటకు ముందు శత్రుసేనా సమక్షమున, ఈభీషణకోలాహలమున, ఈజీవనమరణ

సంధిస్థలమున చచ్చుటకు ముందు ఒకమాఱు మీనోటితోఁ
నేను నిన్ను ప్రేమించుచున్నాను. అనుఁడు.

(తెఱలో యుద్ధకోలాహల మెక్కువగ వినఁబడును.)

శక్త—బాలత్! యుద్ధక్షేత్రము ప్రేమిజనము పరుండు పూలపాన్పు
కాదని నీకు తొలుతనే చెప్పితిని

బాల—నాథా! ఎఱుగుదును. కాని ఈయభాగ్యురాలకు చిరకాలము
నుండి యొకకోరిక గలదు. మీరీ తుదికోరికను నెరవేర్పుడు.
నేను నాచుట్టములను, పక్కములను, పరిజనమును, భోగవిలాస
ములను అన్నిటిని వదలి మీశరణకు వచ్చితిని. చిరకాలము
నుండి మీనోట నీమాట యెప్పుడు వచ్చునాయని వేచియుంటి
ని. నేటివఱకు నాకాసౌభాగ్యము గలుగలేదు. నేను మరణించు
టకు ముందు నాయీకోరికను దీర్పుఁడు. ఒకమాఱు ప్రేమతో
నావంక చూచి ప్రేయసీ యనుఁడు.

శక్త—దీని కిదియేనా సమయము?

బాల—అవును ఇదియే సమయము. అదుగో ఎదురుగ సూర్యుఁడుద
యించుచున్నాఁడు. (ఫిరంగుల మ్రోత విని) అదుగో వికటమృ
త్యుగర్జనములు. వెనుక జీవనము ముందు మరణము. ఈసమ
యమున నన్నొకమాఱు 'ప్రేయసీ' యని పిలువుఁడు ఏమాటను
మీరింతవఱక నెన్నఁడు నుచ్చరింపలేదో, ఏయమృతాస్వాద
ము నాకెన్నఁడు లభింపలేదో, ఏమాటను వినుటకై ఆకొన్న
దానివలె నేను అధికాశతో నుంటినో దానిని ఒక్కమాఱు
పలుకుడు. మరణించుటకు ముందొకమాఱు మీరు నన్ను ప్రే
మించుచుంటిరని విని సుఖపూర్వముగ మరణించెదను.

గీ॥ తలఁగని నితాంతదారిద్ర్య భరముగాని
ఘన సుదుస్సహ మృత్యుయంత్రణయుఁ గాని
యడఁచి స్వర్గీయ మహిత సౌఖ్యంబునొసఁగు
పొలఁతులకు పతిప్రేమ సంబోధనమ్ము॥

గీ॥ చంద్రికిరణమ్ములఁ లేనిచల్లఁదనము
ఇంద్రు భండారమున లభియింపని సుధ
మలయ పవనమ్మునన్ లేని ప్రాణశక్తి
పొలచు పతికృతప్రేమ సంబోధనమున॥

శక్త—ఆఁ! ఇది యేమి? నా నేత్రముల ఈఅశ్రువులేమి! లేదు. దౌలత్! ఇప్పుడు నేనీమాట యనఁజాలను.

దౌల—అనుఁడు, అనుఁడు. (కాళ్లపైఁబడి) ఒక్కమారు అనుఁడు.

శక్త—ఒకవేళ నే నన్నను నీవు విశ్వసించెదవా? నేఁడు— (నోట మాటరాదు)

దౌల—మిమ్ము విశ్వసింపనా? ఏవ్వనిపాదములపై విశ్వాసముంచి నేను నాయిహకాలమంతయు నర్పించితినో వానిని ప్రేమింపనా? మీ మాట యసత్యమైనఁ గానిండు. నే నేమియు ప్రశ్నింపను వితర్కము సేయను. ఇదివఱకెన్నఁడును వితర్కము సేసియెఱుఁగను. ఇప్పుడు చనిపోవుటకు ముందును అట్లే యుందును ఆమాట వినుటకు నీకింత యభిలాష యెందుకు అందురేమో?—వినుఁడు నేను స్త్రీని. స్త్రీజాతికి సహజముగనుండు మహత్తరాభిలాష నాకు నేటివరకు తీఱలేదు. నేఁడు ఆకోరిక తీర్చుకొని సుఖముగ మరణింపఁ గోరుచున్నాను. అనుఁడు అనుఁడు

శక్త—దౌలత్! నీ వెంత సుందరివి! నీముఖమున నెట్టి స్వర్గీయజ్యోతి విరాజిల్లుచున్నది! నీస్వర మెంత మధురమైనది! నే నెంతయు మూర్ఖుఁడనై ఇంతవఱకు నీవిషయములపై ధ్యానముంచలేదు. నేను మోహాంధుడను. స్వార్థపరుఁడను. గనుక నేలోకమంతయు నావలెనే స్వార్థపరమనుకొంటిని. స్వప్నమందును నేనీవిషయము నాలోచింపలేదు. దౌలత్! దౌలత్! నేఁడు నీవు నా కెట్టి మార్పు గలిగించితివి? నా ప్రతి రక్తాణువు నందును లీనమైయున్న విశ్వాసమును, తలంపును నేఁడు నీవు తొలఁగించితివి. కాని యిట్లుచేయుట కింత విలంబమేల చేసితివి?

దౌల—అనుఁడు అనుఁడు నిన్ను ప్రేమించుచుంటిని, అని యనుఁడు

అదుగో యుద్ధ వాద్యములు మ్రోగుచున్నవి. ఇంక సమయము లేదు. త్వరగా ననుఁడు. (శక్తసింహుని కాళ్ళపైఁబడి) ఒక మాఱు ఒక్క మాటేయనుడు.

శక్త—దౌలత్! నిన్ను నిజముగ ప్రేమించుచున్నాను హృదయపూర్వముగ ప్రేమించుచున్నాను ఇంతదనుక నా హృదయస్రోతమున కొక పెద్ద రాతిబండ అడ్డుపడి యుండెను. నేఁడు నీవు దానిని తీసివేసితివి. దౌలత్! ప్రేయసీ దౌలత్! నేఁడు నా నోటివెంట నీమాట లేలవచ్చుచున్నవి! ఆగియున్న ప్రవాహము గట్టు తెంపికొని బయలు దేఱనది ఇంక దీని నెవ్వ రడ్డగలరు? దౌలత్! నిన్ను మనఃపూర్తిగ చాల ప్రేమించుచున్నాను. నా ప్రేమను నాకు రుజువుచేయుట కింక నవకాశము చిక్కదనియే నాకు విచారము. ఇంక నేను మరణించుటకుఁ బోవుచున్నాను. ఈ ప్రేమ యిచ్చటనే ప్రారంభమై యిచ్చటనే అంతముచెందును.

దౌల—అయితే నాకొకమాఱు అంతిమచుంబనము ప్రసాదింపుఁడు.

శక్త—(దౌలతును కౌగలించుకొని ఆమె ముఖము ముద్దుపెట్టుకొని గద్గదస్వరముతో) దౌలత్! నా ప్రియ దౌలత్!

దౌల—చాలు చాలు. ఇది గొప్ప మధురస్వప్నము! మరణమునకు ముందు ఇది భగ్నముకాకుండుగాక. ఇకఁ బోయి యుద్ధతరంగములలో నుఱకవలయును

శక్త—రమ్ము గుఱ్ఱము సిద్ధముగనున్నది.

(ఇద్దరును అక్కడనుండి దిగిపోయెదరు. తెరలో యుద్ధకలకలము దుర్గాధ్యక్షుఁడు ప్రవేశించును)

దుర్గా—(ఉలికిపడి) ఆఁ! ఇదియేమి! (మరల జయనాదము వినఁబడును.) ఇంక నేమియు విచారము లేదు రాణాజీ దుర్గరక్షణమునకై ససైన్యముగ వచ్చినారు. ఇంక నేమియు భయము లేదు. (ప్రస్థానము)

## తృతీయదృశ్యము.

స్థానము—దుర్గసమీపమున యుద్ధక్షేత్రము. ప్రతాపునిశిబిరము.
సమయము—సాయంకాలము. [ప్రతాపుడు గోవిందసింహుఁడు పృథ్వీరాజు సశస్త్రులై నిలఁబడుదురు.]

ప్రతా—ఇదియంతయు భగవతీకటాక్షము!

పృథ్వీ—సాక్షాత్తు మహాబత్ఖాను ఖైదీ అయినాడు.

గోవిం—యెనిమిది వేల మొగల సైనికులు నరుకబడిరి.

ప్రతా—గోవిందసింహా! మహాబతుని ఇచ్చటకుఁ గొనిరమ్ము

(గోవిందసింహుఁడు వెళ్ళి ఇరువురుసిపాయిలతో శృంఖలాబద్ధుడగు మహాబతుని తీసికొనివచ్చును.)

ప్రతా—సంకెలలు విప్పుము. (పహరేదారు సంకెలలు విప్పును.)

ప్రతా—మహాబత్! పొమ్ము. నేను నిన్ను విడిచిపెట్టితిని నీవు ఆగ్రాకు బోయి మానసింహునితో జెప్పుము. ఈ యుద్ధమునకు అతఁడు వచ్చునని నేను చాల ఆశపడితిని. ఆతఁడు ఈయుద్ధమునకు వచ్చియున్నచో హల్దీఘాటుఋణమును దీర్చుకొనువాడను. మొగలసేనాపతియగు మహారాజ మానసింహునితోఁ జెప్పుము. యుద్ధక్షేత్రమున సేనతనిని కలియఁగోరుచున్నాను. ఇంక పొమ్ము.

(మహాబత్ఖాను మెదలక తలవంచుకొని పోవును.)

పృథ్వీ—ఉదయపూరు రాణాగారిచేతికి చిక్కినట్లేనా?

ప్రతా—ఆఁ

పృథ్వీ—అయితే చిత్తూరు ఒకటియే మిగిలియున్నది.

ప్రతా—అజమేరు మండలగఢుదుర్గములుగూడ మిగిలియున్నవి.

(శక్తసింహుఁడు ప్రవేశించును.)

ప్రతా—రమ్ము తమ్ముఁడా! (లేచి కౌగిలించుకొని) ఒకక్షణము విలంబమగుచో నిన్ను జీవితావస్థలోఁ జూచువాఁడను గాను.

శక్త—అన్నా! నీవు నన్ను రక్షించినమాట వాస్తవము. కాని (నిట్టూర్పు విడిచి) ఈయుద్ధములో నేను నాసర్వస్వమును బోఁగొట్టుకొంటిని.

ప్రతా—ఏమి? ఏమయినది?

శక్త—నాభార్య దౌలతున్నిసా చనిపోయినది.

ప్రతా—నీభార్య దౌలతున్నిసా!!!

శక్త—అవును. నాభార్య దౌలతున్నిసా.

ప్రతా—ఆఁ! నీవు తురుష్క స్త్రీని పెండ్లి యాడితివా?

శక్త—అవును అన్నా! నేను తురుష్క స్త్రీని పెండ్లియాడితిని.

ప్రతా—(నిర్వ్యాజపడి తలమొత్తుకొని) తమ్ముఁడా! తమ్ముఁడా! అయ్యో నీవేమిచేసితివి? నేను నాసర్వస్వమును బోఁగొట్టుకొని నావంశ గౌరవమును గాపాడితిని (నిట్టూర్పు విడిచి, కొంచెమాగి దృఢ స్వరముతో) కాదు శక్తసింహా! నేను బ్రదికియుండగా నిట్టి మాట కాఁజాలదు. నేటినుండి నీవు నాకు సోదరుఁడవుగావు. నేను నీకేమియుఁ గాను. మేవాడు రాజవంశముతో నీకేమియు సంబంధము లేదు. అయితే ఫినసహారా దుర్గమును నీవు జయించితివి. దానిపై నీకు సంపూర్ణాధికారము గలదు. నేటినుండి నిన్నును ఆదుర్గమను మేవాడువంశమునకును మేవాడురాజ్యమునకును జెందనివానినిగా తలఁచెదను.

పృథ్వీ—రాణాజీ! ఏమిపని యిది?

ప్రతా—పృథ్వీరాజ! నేను చేయునది యెమియో నేను బాగుగ నెఱుఁగుదును. శక్తసింహా! నేటినుండి నీవు మేవాడు కేమియుఁ గావు. నారాజవంశముతో నీకేమియు సంబంధము లేదు. (క్రోధదుఃఖములచే రెండుచేతులతోఁ గన్నులు మూసికొనును)

గోవిం—రాణాజీ!

ప్రతా—గోవిందసింహా! ఊరకొనుము. నేటివఱకు ప్రాణములు ధార పోసి ఈపవిత్రవంశగౌరవమును గాపాడుచువచ్చితిని.

చ॥ సతతదరిద్రతావ్రత మసారత్న్యణాదిక భక్షణంబుచేన్
క్షితిశయనంబు కానల వసించుటయున్ బలవద్విరోధమున్
ధృతి నిజవంశగౌరవప్రతిష్ఠకుఁ బూనితిఁ దన్నిమిత్తమై
సుతహితబంధుభార్యలను సోదరులన్ బనియేని వీడదన్॥

నేను బ్రదికియున్నంతవరకు ఈ వంశగౌరవమును గాపాడెదను. నాయనంతర మేమి కావలయునో అగును.

—రాణాజీ! శక్తసింహుఁడీయుద్ధమున—

ప్రతా—అవును. శక్తసింహుఁడీయుద్ధమున నాకు కుడిభుజముగానున్న మాట యెఱుఁగుదు. కాని వ్యాధిగ్రస్తమగు కుడిభుజమును గోసివేయునటుల నేనీతనిఁ బరిత్యజించెదను. (ప్రస్థానము)

పృథ్వీ—హా! అభాగ్యరాజ్యస్థానమా! (ప్రస్థానము)

(పృథ్వీరాజువెనుక గోవిందసింహుఁడును వెళ్ళును)

శక్త—అన్నా! దైవసమానముగ హృదయమునఁ నిన్నుఁబూజింతును. కాని నీ వాజ్ఞయొసఁగినను నేను దాలతున్ని సానుమాత్రము విడువఁజాలను. నేనామెను వివాహమాడితినని ఒక్కమారుగాదు. నూరుమార్లు చాటిచెప్పెదను. ఆవివాహములో మంగళవాద్యములు లేకుండుగాక. పురోహితుఁడు మంత్రములఁ బఠించకుండుగాక. అగ్నిదేవుఁడుసాక్షిగ లేకుండుగాక. అయినను అది వివాహమే. నేనామెను వివాహమాడితినని చెప్పుటయే నాకిప్పుడు సుఖకరముగ నుండును. రాణాజీ! నీవు దైవస్వరూపుఁడవైన మాట వాస్తవము. ఆమెయు దేవియే. నాకన్నులు దెఱపించి నీవు నాకు పురుషులమహాత్మ్యమును జూపించితివి. అటులనే ఆమెయు నాకు స్త్రీజాతి మహత్వమును జూపించినది. నేను పురుషులు వట్టిస్వార్థపరులని తలఁచుచుండెడివాఁడను. కాని నీవు పురుషులందును సార్థత్యాగమంత్ర ప్రతిష్ఠాతలు గలరని చూపించితివి అట్లే స్త్రీలుతుచ్ఛలు, అసారలు, కదాకారలు అని తలఁచుచుండెడివాఁడను కాని ఆమె స్త్రీలయందును సౌందర్యము గలదని చూపించెను. ఆహా! ఆసౌందర్య మెంతయద్భుతమైనది! ఎంతప్రభావముగలది. నేటి ప్రభాతమున ఆమె నాయెదుట నిలఁబడినది. ఆమె ముఖమున ఎట్టి స్వర్గీయ ప్రకాశము, ఎట్టి స్వర్గీయ తేజము, ఎట్టి స్వర్గీయశోభ విరాజిల్లుచుండెను. ఆమె ముఖమున నొకస్వర్గీయ

జ్యోతి తాండవమాడుచుండెను. ఆమె ముఖము తచ్ఛిరసంచిత పుణ్యాజలముచే క్షాళితమైనట్టు లుండెను. ఆమె పాదములను మోయుటచే భూమి తన్ను ధన్యురాలుగ తలంచు చున్నటు లుండెను. ఏమి యాశోభ! హా త్యారాష్ట్రసిరియొక్క భూమిా భూతమగు ఆనిశ్వాసమున, ఆమరణప్రళయకల్లోలమున, ఆజీవన సంధ్యాలగ్నమున ఏమిమూర్తి! ఏమిమూర్తి! (మెల్లగా నిష్క్రమించును)

## చతుర్థ దృశ్యము.

స్థానము— కోమల మారులో ఉదయనాగరతీరము. సమయము— వెన్నెలరాత్రి. (మేహారున్నిసా ఒంటంగ కూర్చుండును.)

మేహా— ఆహా! ఈ రాత్రి ఎంత శోభాయమానముగ నున్నది. నలు దిక్కులు ప్రశాంతభావమునఁ దనరారుచున్నవి. వెన్నెల పిండి యారఁబోసినట్టు లున్నది. (కొంచెమాగి) నాకు తడవ తడవకు ఆయనమాట లేల జ్ఞాపకము వచ్చుచున్నవి! ఇన్ని దినములైనను నే నాయనను మరవఁజాలకుంటిని. నా జనకుని యగాధ ప్రేమను ఆగ్రాలోని సుందరరాజ ప్రాసాదమును నేను బుద్ధిపూర్వకముగనే విడిచినమాట వాస్తవము. కాని నన్నిచటకు ఈడ్చుకొని వచ్చినదెవరు!—ఆశక్తసింహుఁడే. నే నిచటకు వచ్చినపిమ్మట ఎదుటఁబడినను కనులార ఆయనను జూడనని ప్రతిజ్ఞ చేసితిని. నేటిదనుక నె నా ప్రతిజ్ఞను నిర్వహించితిని. అయితే నేనీప్రదేశము నేల విడవఁజాలను? దీనికి కారణము రోజున శోకమాతేని ఆయన నామము నాకు కర్ణానందము గలిగించుటయే. ,శక్తసింహ, ఆహా! ఏమి మధురనామము! కాని నేనింక నిచట నుండజాలను. ఇంతవఱకు నాకిచట ఈర సహావాసినిగా నుండెడిది. ఆమెసాంగత్యముచే నేననావిచారము నెట్లో పోఁగొట్టుకొనుచుంటిని. ఇప్పు డాయాధారము లేదు. నన్ను నే నింక భద్రపఱచుకొనఁజాలను. ఇప్పుడీ ప్రదేశమును విడుటయే

నాకు క్షేమము. నామాటలు డౌలతున్నిసాకుఁ దెలిసినచో అది చాల విచారపడును ప్రియదౌలత్! నిన్నుజూచియెంతకాలమో అయినది. నీసమాచారమేమియుఁ దెలియుటలేదు రాణాగారికి వెఱచి శక్తిసింహుఁడు ఈవిషయము నెవ్వరితోడను చెప్పలేదు కాబోలు. ఒకమాఱు ఈ సంగతి రాణాగారి చెవులబడెను, కాని వారు విశ్వసింపలేదు వినినప్పుడు మాత్రము వారిమొగ మెఱ్ఱ పడినది. స్వతంత్రమగు ప్రేమ రాజ్యమున వ్యర్థముగ నీసంఘపు కట్టుపాట్లెందుకు, ఈ తెగ లెందుకు. ఈహద్దులెందుకు? ప్రియదౌలత్! నేనుచేసినదంతయు నీసుఖమునకే చేసితిని నీవుసుఖముగ నుండుము అదియే నాకుపరమసుఖమునీసుఖమే నాకుఆనందము

దాసి—(ప్రవేశించి) శాహజాదీ!

మేహరు—(ఉలికిపడి) ఎవరు?

దాసి—రాణాగారు తిరిగివచ్చిరి. అమ్మగారు మిమ్ము పిలచుచున్నారు. బౌదుషాగారివద్దనుండి మీపేర జాబు వచ్చినది.

మేహ—నా పేర జాబువచ్చినదా? ఎక్కడనున్నది?

దాసి—రాణాగారివద్ద అమరసింహుఁ డిచ్చుటకు రాలేదుగద?

మేహ—లేదు

దాసి—అయితే వారెచటకు వెళ్ళిరి? వెళ్లి వెదకెదను (ప్రస్థానము)

మేహ—నాయనా! ఇన్నిదినములకు నేను మీకు జ్ఞప్తికి వచ్చితినా? ఏమి వ్రాసిరో పోయిచూచెదను. ఎవరు? అమరసింహా!

అమర—(ప్రవేశించి)అవును. నేనే.

మేహ—ఇప్పుడే దాసి నిన్ను వెదకుచు వచ్చినది. పద పోదము.

అమర—పదపోదము. (ముందుకుఁబోయి మేహరుచేయి పట్టుకొనును)

మేహ—ఆఁ! ఇదియేమి! చేయి విడువుము.

అమర—విడిచెదను. ముందు నామాట వినుము. నీ కొకమాట చెప్పెద నుండుము.

మేహ—నీస్వరమును బట్టిచూడ నీవు మద్యము త్రాగివచ్చినటులున్నది. ఏమి చెప్పెదవో చెప్పుము

అమర—నే నేమి చెప్పుచుంటినో నీవెఱుఁగుదువా? అదుగో ఎదురుగఁ జూడుము, ఆసరోవరమునఁ బ్రసరించు చంద్రకాంతి యెంత అందముగనున్నది! చూచుచుంటివా?

మేహ—ఆఁ చూచుచున్నాను.

అమర—ఈయాకాశము, ఈవెన్నెల, ఈచల్లనిగాలి—చూచుచుంటివా? ఈసౌందర్య మంతయు దేనికి సిద్ధపఱుపఁబడినది?

మేహ—ఏమో నేనెఱుఁగను పద ఇంటికిఁబోదము

అమర—నీవెఱుఁగవు, కాని నేనెఱుగుదును. ఇదియంతయు భోగము నకై సిద్ధపఱుపఁబడినది

మేహ—మంచిది. దారివిడువుము

అమర—మేహర్! మానవుఁ డీ మధుపూర్ణపాత్రమును గ్రోలనిచో ప్రకృతి దీనిని వానినోటివద్ద నేల పెట్టుచున్నది?

మేహ—పద ఇంటికిఁ బోదము (వెళ్ళఁబోవును.)

అమర—(దారి అడ్డి) నేను చాలకాలము అణచుకొని యుంటిని. కాని యింక నావలనఁగాదు మేహరున్నిసా! వినుము. నేను యువకుఁడను. నీవు యువతివి. ఇది యేకాంతస్థానము. దానిపై నీ వెన్నెలరాత్రి!

మేహ—నీవు నేఁడు మరల మద్యము త్రాగితివి, నీవేమిఁజేయుచుంటివో నీకు తెలియదు

అమర—కాదు మేహర్! నేను బాగుగ నెఱుగుదును. (మరల చేయి పట్టుకొనుచు.)

మేహ—(బిగ్గరగా) నా చేయివిడువుము.

అమర—ప్రేయసీ! మేహరున్నిసా! (కౌఁగలించుకొనఁబోవును.)

మేహ—అమరసింహా! నాచేయి విడువుము (చేయివిడిపించుకొనుటకు యత్నించును.) ఎవ్వరక్కడ?

(లక్ష్మియు ప్రతాపుఁడును ప్రవేశించెదరు.)

ప్రతా—ఏమి యేమి? ఇదుగో నేను వచ్చితిని. (గంభీర స్వరముతో) అమరసింహా!

(అమరసింహుఁడు మేహరు చేయి విడిచి దూరముగ నిలఁబడును)

ప్రతా—అమరసింహా! ఇది యేమి? నేను తొలుత నే అనుకొంటిని బాల్యమున సోమరిగా తిరిగినవాఁడు యౌవనమున తప్పక దురాచారియు, నిరంకుశుఁడు నగును. కాని నాకుమారుఁడు ఆశ్రితయగు నొక యబలపై నిట్టి అత్యాచారమును జేయు నని నేనుకలలోఁగూడ అనుకొన లేదు దుష్టుఁడా! కులాంగారా! నిలఁబడుము. నీకు శిక్ష విధించెదను. (పిస్తోలు తీయును.)

అమర—నాయనగారూ! నాయనగారూ! (కాళ్లపై బడును )

ప్రతా— ఓరీ పిరికిపందా! క్షత్రియుండవయ్యు చావుకు వెఱచు చుంటివా? నిలఁబడుము.

లక్ష్మి— (ప్రతాపుని కాళ్ళపైబడి) నాథా! క్షమింపుఁడు. అది నా దోషమే. ఇన్ని దినములవరకు నేను తెలిసియు తెలియని దాని వలె నుంటిని.

ప్రతా—లేదు వీనిని శిక్షింపక విడువను ఈయపరాధము క్షమించుట కు వీలు లేదు.

మేహ—రాణాజీ! మీరీయనను క్షమింపుఁడు. ఇప్పుడీయన స్మారకములో లేడు. ఈయన మద్యమును త్రావినాఁడు.

ప్రతా—ఏమి! వీఁడు మద్యము త్రావినాఁడా?

అమర—నాయనగారూ! నన్ను క్షమింపుఁడు.

ప్రతా—(పిస్తోలుఎత్తి) లేదు. నేను నిన్నుక్షమింపను.

మేహ—రాణాజీ పుత్రహత్య చేయకుఁడు

లక్ష్మి—(కొడుకునకు ముందు నిలఁబడి) వీనిని చంపుటకుముందు నన్ను చంపుఁడు (ఇంతలో పిస్తోలు ప్రేలుటచే లక్ష్మి క్రిందపడును )

మేహ—అరే ఇదియేమి! ఇది యేమి! అమ్మా! అమ్మా! (పరుగెత్తుకొని పోయి లక్ష్మిశిరమునెత్తి తనతొడపై పెట్టుకొనును)

ప్రతా—లక్ష్మీ! లక్ష్మీ!

లక్ష్మి—నాథా! అమరసింహుని క్షమింపుఁడు. నేను నాజీవితములో నొ

ఈ మృత్యుకాలమున మీ చరణములకడ నాకు స్థానమిందు (ప్రతాపుని పాదములు పట్టుకొని లక్ష్మి ప్రాణములు విడుచును.)

ప్రతా—మెహర్! నే నెంతపనిచేసితిని!

(అమరుఁడు నిశ్చేష్టితుఁడై నిలఁబడును. మేహరు ఏడ్చును.)

ప్రతా—జగదీశ్వరా! పూర్వజన్మమున నే నేమి పాపము చేసితిని అన్నివిధములగు విపత్తులును నాకు తటస్థించుచున్నవి నాకన్నులముందు అంధకార మావరించుచున్నది. (మూర్ఛితుఁడైపడిపోవును.)

## పంచమదృశ్యము

స్థానము—అక్బరుని ఏకాంతగృహము. సమయము—మధ్యాహ్నము.

(అక్బరును మానసింహుఁడును ఎదురుగ నిలఁబడి యుందురు.)

అక్బ—వింటివి మానసింహా! అంతయు వింటివి దుర్గములన్నియు క్రమముగ రాజపుత్రుల యధీనము లగుచున్నవి. పైఁగ మహాబత్ఖాను ప్రతాపునిచేతిలో ఖైదీ అయ్యెను. తుదకెట్లో ఆయన దయతలచి విడిచిపెట్టగా ఢిల్లీకి తిరిగివచ్చినాడు ఇదియు వింటివి.

మాన—జహాఁపనాహ్ ప్రతాపసింహుఁడు నేఁడు మూర్తీభవించిన ప్రళయమువలె నున్నాఁడు. ఆయన నడుట కెవ్వరికి తిరము!

అక్బ—మహారాజా! యీవృత్తాంతము వినుటకై నేను మిమ్ముపిలువలేదు.

మాన—(మెదలక యుండును.)

అక్బ—మానసింహా! దీనియర్థము కేవలము మొగలుల పరాజయమనియే కాదు. దీనియర్థము—మొగలుల యవమానము. దీనియర్థము—దేశమున నిరుత్సాహము. దీనియర్థము—స్వదేశరాజల రాజభక్తిక్షయము. మహారాజా! ప్రపంచములో వ్యాధియొక్కటియే సంక్రామకము గాదు. స్వాస్థ్యమును సంక్రామకమే. భీరుత్వమువలె సాహసమును సంక్రామకమే. పాపమువలె పుణ్యమును సంక్రామకమే. అట్లేప్రతాపుని ఈ స్వదేశభక్తియుఅంటువ్యాధివలె దేశమంతటను వ్యాపించునని తోఁచుచున్నది.

మాన—(తలవంచుకొని) చిత్తము.

అక్బ—గనుక ముందుగనే దీనికి ప్రతిక్రియ చేయవలయును ఈప్రతాపునిగతి నిరోధించుటకై ఎంత ద్రవ్యము, సైన్యము కావలసి యున్నను ఇచ్చెదను.

మాన—(మెదలక యుండును)

అక్బ—(మానసింహుని భావ మెఱింగి) మహారాజా! మీరు ప్రతాపుని ప్రతాపమునకు ముగ్ధులైతిరని నేనెరుగుదును నేనును ముగ్ధుడ నైతిని నిజముగ ప్రతాపసింహుఁడు ఒక మహావీరుఁడు, అయితే ఏసామ్రాజ్యమును స్థాపించుటకు మీరును, మీతండ్రియు నాకు పరమాప్తుఁడగు భగవాన్దాసును ఇన్ని సంవత్సరములనుండి సహాయము చేయుచు వచ్చితిరో ఆసామ్రాజ్య మిప్పుడు నాశనమగుచుండ మీరు తప్పక చింతించెదరనియు నే నెఱుఁగుదును.

మాన—మొగల సామ్రాజ్యము నాక్రమించుట ప్రతాపునియుద్దేశ్యము గాదు. చిత్తూరు దుర్గము నుద్ధరించుటమాత్రమె ఆయన సంకల్పము ఆయన దేశభక్తుఁడే కాని పరస్వాపహారి యెన్నఁడును కాఁడు.

అక్బ—తెలిసినది, కాని మహారాజా! చిత్తూరుదుర్గమును పోగొట్టుకొనినచో సామ్రాజ్యమంతయు పోఁగొట్టుకొనిన వాఁడ నగుదునని నానిశ్చయము. మహారాజా! మీరునాకు పరమాప్తులగు భగవాన్దాసునకు పుత్రులరు కొలఁదిరోజులలో ఇంకను ఆ పసంబంధులు కానున్నారు. నే నెతయు మీమీద నే ఆధారపడి యుంటిననియు మీ రెఱుఁగుదురు,

మాన—సమ్రాట్! చిత్తూరు మొగలుల చేతిలోనుండి పోకుండ యథాశక్తి ప్రయత్నింతునని నమ్ముఁడు

అక్బ...ఇదియే మానసింహునకు తగినమాట,

మాన...ఇంక నాకు సెలవిండు. (సలాముచేసి పోవును.)

అక్బరు. (పచారుచేయుచు) నేను ఆనాఁడు సలీముతో పరుని శాసింపవలయునన్నచో ముందుగ తన్నుఁదా శాసించుకొనవలయు

నని చెప్పితిని. కాని అంతలోనే క్రోధవశుఁడనై నా ప్రాణప్రియయగు కన్యను పోఁగొట్టుకొంటిని. ఇటు నౌరోజ మేళాలో కామవశుఁడనై రాజపుత్రరాజుల ప్రేమను బోఁగొట్టుకొంటిని. బుద్ధిబలముచే మరల నీపనులన్నియు చక్కఁబఱు చేమో చగాచెదను. మహాబతాఖానువలన మేహరున్నిసా సమాచారము తెలిసినది ప్రాణాధిక కుమారీ! నీవు అభిమానముచే నన్ను విడిచి నాశత్రువునుఁ వజ్ర చేసితివి. హా! నేఁడు నే నెంతటి నిరభిమానకార్యము చేయవలసి వచ్చినది! నాముద్దుఁ పట్టి మొగము చూచుటకై నేఁడు నాశత్రుని క్షమాపణ వేసితిని. నాపుత్రికను గూడ క్షమాపణ వేడవలసివచ్చినది. ఈశ్వరా! ఎంత విరుద్ధమైన మాట! తండ్రిని ఇంత ప్రేమ దుర్బలునిగా నేల సృజించితివి?

(ద్వారపాలకుఁడు ప్రవేశించును)

అక్బ—మేహర్! మేహర్! నీవు తిరిగి రమ్ము. నేను నీతప్పులన్నియు క్షమించితిని. నీవును నాతప్పు క్షమింపుము.

ద్వార—ఖుదావంద్! మేవాడునుంచి ఒకదూత వచ్చినాఁడు.

అక్బ—(ఉలికిపడి) మేవాడునుంచి వచ్చెనా? ఎక్కడ నున్నాఁడు? ఏమి కబురు తెచ్చినాడు?

ద్వార—వెంట బాదుషాకన్యయగు మేహరున్నిసాకూడ— .

అక్బ—మేహరున్నిసా కూడ వచ్చినదా? ఎక్కడ నున్నది?

(అక్బరు త్వరగా ముందుకుఁ బోవును ఇంతలో మేహరున్నిసా వచ్చి "నాయనా నాయనా" అని కాళ్ళపైఁ బడును ద్వారపాలకుఁడు పోవును.)

అక్బ—మేహర్! మేహర్! నిజముగ నీవు వచ్చితివా?

మేహ—నాయనగారూ! నన్ను క్షమింపుఁడు. నా దోషములన్నిటిని క్షమింపుఁడు నేను నాబుద్ధిదోషముచే దౌలతున్నిసాను పాడుచేసితిని, రాణాజీని పాడుచేసితిని, నన్ను పాడుచేసికొంటిని క్షమింపుఁడు.

అక్బ—లెమ్ము మేహర్! నేను నీతప్పులన్నిటిని క్షమించితినని నీకు

ముందే వ్రాసితిని. అజేయుఁడగు భారతసార్వభౌముఁడును నీ ముందు గడ్డిపరకవలె దుర్బలుఁడు మేహార్! నీవు నన్ను క్షమించితివా?

మేహ—నేను మిమ్ము క్షమించుదాననా! దేనికి?

అక్బ—నేను నీతల్లిని దూషించితిని

మేహ—ఆవిషయమై మీరు క్షమాపణ గోరియుంటిరిగదా?

అక్బ—క్షమాపణ గోరనిచో తిరిగివచ్చెడుదానవు గావా?

మేహ—అదియంతయు నాకు తెలియదు. నే నింతగా ఆలోచన చేసి యిచ్చటకు రాలేదు. మీజాబు చదివితిని. ఇంక ఉండలేకపోతిని. వెంటనే వచ్చితిని నాయనగారూ! నేను మిమ్మింతగా ప్రేమించుచుంటినని నాకు పూర్వము తెలియదు. (మేహారు అక్బరుని హృదయముపై తలయుంచి యేడ్చి పిదపఁ జెప్పును.) నాయనగారూ! ఇన్నిదినములకు నేను తెలిసికొనఁగల్గితిని స్త్రీల కెన్నఁడును ప్రతివాదము పనికిరాదు. సర్వము సహింపవలయును. స్త్రీల కర్తవ్యము అంతఃపురముననే కాని బయట కాదు. స్త్రీల ధర్మము సేవయే కాని స్వేచ్ఛాచారము గాదు.

అక్బ—ప్రతాపుఁడు నీవిషయమై యెట్టి అత్యాచారమును జేసియుండ లేదుగద?

మేహ—అత్యాచారమా! నన్ను అత్యాచారమునుండి రక్షించుటకై ఆయన తనభార్యనుగూడ చంపికొనెను.

అక్బ—అదియెట్లు?

మేహ—ఒకనాఁడు రాణాగారిపుత్రుఁడు మద్యపానప్రమత్తుఁడై నాచేయి పట్టుకొనెను. రాణాగారదిచూచి పుత్రునిఁ జంపుటకై తుపాకి గురిపెట్టెను. ఇంతలో పుత్రరక్షణార్థము ఆయన భార్య అడ్డము పోయి తుపాకిగుండు తగిలి చనిపోయెను.

అక్బ—ప్రతాప్! ప్రతాప్! నీవెంతయు మహాత్ముఁడవు. నీవు నాకుమిత్రుడవగుచో నిన్ను నాకుడిప్రక్క కూర్చుండఁబెట్టుకొనెడువాఁడను. కాని నీవు నాకు శత్రువైతివిగాన నీయాసనము నాకు ఎదురుగ

నుండవలసివచ్చెను. ఇట్టి శత్రు వ్రుడుటయు మా రాజ్యమునకు గౌరవమే. నేను అక్బరు బాదుషా కాకుండినచో రాణాప్రతాప సింహుఁడనగుట కేకోరువాఁడను నేను సార్వభౌముఁడను. భారత వర్షమంతయు శాసింపఁగోరుచున్నాను. కాని నన్ను నేను శాసించు కొనఁజాలకున్నాను. ఇంక నీవు దీనుఁడవు. దరిద్రుఁడవయ్యును నిన్ను శరణుజొచ్చిన శత్రు కన్యనురక్షించుటకై నీ యేకపుత్రుని గూడ చంపనెంచితివి! నీమహాత్త్వమేమని కొనియాడుదును?

మేహ—నాయనగారూ! నాది యొక విన్నపమున్నది. మీరింతటినుండి రాణాప్రతాపసింహునిపై కికత్తికట్టవలదు. ఆయనను వీరోచిత రీతిని గౌరవింపుఁడు. ప్రతాపుఁడు శత్రువయ్యును మహావీరుఁడు. ఆయన మానవుఁడు గాడు- దేవాంశగలవాఁడు ఆయనతోటి వైరము మా నాయనగారికి ఉచితము గాదు నేఁడు ఆయన ఘోర సాంసారిక కష్టములఁ జిక్కుకొని యున్నాఁడు. ఆయన కొమార్తెయు భార్యయు మరణించిరి. సోదరుఁడు విడిపోయి నాఁడు. కుమారుఁ డెందుకును కొఱగానివాఁడుగ నున్నాఁడు. ఆయనపై దయవహింపుఁడు.

అక్బ—మంచిది. అట్లే కానిమ్ము. నీకు బహుమలుగ చిత్తోరుదుర్గమును ఆయన కిచ్చివేసితిని.

మేహ—అయితే వారింతవరకు దానిని తీసికొనుట కంగీకరింప లేదు. ఒకమాట మఱచితిని. రాణాగారు మీకిమ్మని యొక జాబు ఇచ్చిరి. (జాబుతీసి అక్బరున కిచ్చును.)

అక్బ—ప్రతాపసింహుఁడు వ్రాసిన జాబేనా? (జాబు మేహారున కిచ్చి) నాకు బాగుగ కనిపించుట లేదు అమ్మాయీ! నీవే చదువుము.

మేహ—(జాబు చదువును) "ప్రబల ప్రతాపులగు అక్బరు బాదుషా గారికి. మహాశయా! మీ మేనకోడలగు దౌలతున్నిసా ఇపుడు ఈలోకమున లేదని తెలుపుటకు విచార మగుచున్నది. ఆమె ఖినసహారా యుద్ధమున చనిపోయినది. ఆమెకు యథోచితముగ అంత్య సంస్కారము చేయించబడినది.

అక్బ—ఇది మొదటనే వింటిని. ఇంక నేమి వ్రాసెనో చదువుము

మేహా—"దౌలతున్నిసా వృత్తాంతమును యుద్ధానంతరము మేహారున్నిసావలన వింటిని. అంతకు మున్నే శక్తసింహుఁడు బహిష్కరింపఁబడెను శక్తసింహుఁడు నా సోదరుండు. యుద్ధములో నాకు కుడిభుజముగ నుండెను. కాని యిపుడతనికి నాతోఁగాని మేవాడుతోఁగాని యట్టి సంబంధమును లేదు. ఇప్పటికిని నేను పూర్వము వలె మీకు శత్రువునే చిత్తోరు స్వాధీనమైనను గాకున్నను భారతవర్షమునకు ద్రోహిఁగాఁడగు అక్బరునకు శత్రువుగ నుండితే మరణింపవలెనను నాసంకల్పమెన్నఁడు వికల్పము కాఁజాలదు. దౌలతున్నిసా శక్తసింహునిపెండ్లి యాడుటయు, మేహరున్నిసా నావద్దనున్న సంగతియు వెల్లడింపవలదని మీరు కోరితిరి. నే నట్లు చేతునని మీరు నమ్ముఁడు. మేహరున్నిసాను మీకు అప్పగించినచో దానికి బదులుగా నాకు చిత్తోరుదుర్గమును ఇచ్చెదమని వ్రాసితిరి. మేహరున్నిసా తన యిచ్ఛచే నన్ను శరణు జొచ్చినది ఆమెను నను యుద్ధములో ఖైదుచేయ లేదు. గాన ఆమెను తిరిగి మీకిచ్చుటకు నాకధికారము లేదు. ఆమె తన స్వేచ్ఛచే నిచ్చటకువచ్చినది మరల స్వేచ్ఛచే వెళ్లుచున్నది. ఆమెను నేనేమియు నడ్డగింపఁజాలను. గాన ఆమెకు బదులుగ నేను చిత్తోరుదుర్గమును దీసికొనఁగోరుట లేదు. నాచేత నగుచో నాశక్తిచేతనే చిత్తోరు నార్జించెదను. చిత్తగించవలెను.

రాణాప్రతాపసింహుఁడు."

అక్బ—(ఉచ్చస్వరముతో) ప్రతాప్! ప్రతాప్! నీకు నాయెదుటనే స్థానమున్నదను కొంటిని. కాని యిప్పుడు తెలిసినది. నీస్థానము నాకు చాల పైగానున్నది. నీవు నాకు ప్రజవును, నేను నీకు బాదుషాను అనుకొంటిని. అట్లు కాదు. నీవే బాదుషావు. నేనే ప్రజను. మొదట నను విజయిని, నీవు విజితుఁడవు ననుకొంటిని. కాదు కాదు. నీవే విజయివి. నేనే విజితుఁడను. మంచిది మేహార్! నీవు లోనికిఁ బొమ్ము. నేను నీమాట అంగీకరించితిని. నేటి

నుండి ప్రతాపునకును నాకును ఎట్టి వైరము లేదు. నేటినుండి ఆయన నాకు మిత్రుఁడు ఇంక మొగలు లెవ్వరును ఆయన కెట్టిహానియు చేయఁజాలరు. మంచిది. అమ్మాయీ! నీవు లోనికిఁ బొమ్ము, నే నిప్పుడే వచ్చుచున్నాను. (ప్రస్థానము)

మేహ—నాపరిశ్రమము వ్యర్థముగా లేదు నాకష్టములు, నాదుఃఖములు అన్నియు సఫలములయినవి తుదకు నేను రాణాకును బాదుషాకును సంధిచేసితిని. (ఉద్యానాభిముఖముగు కిటికీవద్దకుఁ బోయి) నేఁడు మరల నేను నాబాల్యస్మృతిచిహ్నితమగు నా ప్రదేశమునకు వచ్చితిని. ఇది యాస్థానమే. మధురములగు నీనౌబతువాద్యములు నవియే విమలసలిలయగు నీయమునానదియు నదియే అంతయు నదియె, నేనొక్కదానను మారిపోతిని నేను నామూర్ఖతచే శక్తసింహునకును, గోతున్నినాకును, రాణాప్రతాపసింహునకును సర్వనాశము చేసితిని. నేను వెళ్ళిన చోటికెల్ల నొకయాపదగ, ఒకయుపద్రవముగ, వెళ్లితిని అయినను ఈశ్వరుఁడెఱుఁగును, నే నేమిచేసినను మహావిచ్ఛేదకారిణిగ చేసితిని నాలక్ష్యము మహత్తు నేనొక్కతెను సర్వప్రాపంచికనియమములకు విరుద్ధముగ నిలఁబడి అనర్థసృష్టి గావించితిని, అయినను ఈశ్వరుఁడెఱుఁగును నే నేమిచేసినను నిష్కపటభావముతో నాసుఖభోగముల వదలుకొని, ఆపదలకంగీకరించి సత్సంకల్పప్రేరితనై స్వాతంత్ర్యముతో చేసితిని. ఇప్పుడు నే నీప్రాపంచిక కోలాహలమునుండి తొలఁగి నీరవనిభృత నిరహంకారమగు కర్తవ్యసాధనకుఁ గడంగెదను. ఈశ్వరా! నన్ను బాగుగ పరిశీలింపుము- నేను నీదయకుపాత్రురాలనుగాని ద్వేషమునకుఁగాదు.

## షష్ఠదృశ్యము

స్థానము—మానసింహుని ఏకాంతగృహము సమయము—రాత్రి

(మార్వాడ, బికనేరు, గ్వాలియరు, చందేరీరాజులును, మానసింహుడును గూర్చుండియుందురు.)

చందే—ఛీఛీ మహారాజ మానసింహ! మీనోటివెంట నిట్టిమాటయా

మాన— నేనేమి యనుచితమైన మాట యంటిని? ఈశాసనము నిరంకుశమును నీతిబాహ్యము నగుచో నేను మీతోఁగలసి దీనిని విరోధించుటకు వెనుదీయను. కాని అట్లుగాదు. మొగలుల రాజనీతి శాసనముగాని దోపిడిగాదు. ఇందు రక్షణమేకాని పీడనము లేదు. ఇందు ప్రేమయేకాని అహంకారము లేదు.

భిక— ఆప్రేమ హద్దుమీఱినది ఆప్రేమ మర్యాదగల రాజపుత్రుల అంతఃపురములందుకూడ ప్రవేశించినది.

మాన— అవును ఈమాట నేను కాదనను అయితే ఒకసంగతి యున్నది. అక్బరు బాదుషాఅయినను మానవుఁడు. ఆయన ఉద్దేశ్యము గొప్పది అయినను కామక్రోధాది శత్రువుల కధీనము. అన్యాయములు, అపరాధములు అప్పుడప్పుడు ప్రతివారు చేయుచుందురు అయినను అక్బరు తనయపరాధము నొప్పుకొనెను. ఆవిషయమై ఆయన క్షమాపణకూడఁగోరెను. ఇంకనెన్నఁడు భారతమహిళల నవమానింపనని ప్రతిజ్ఞచేసెను ఇంతకంటె ఆయన యేమిచేయఁగలడు?

ఝూర్వా— అవును. ఇది నిజమే.

మాన— హిందూమహమ్మదీయు లేకముగ నుండవలయుననియే అక్బరుని ఉద్దేశ్యము. వారుభయులు కలసిమెలసి యుండవలయుననియు ఆయనకోరిక

గ్వాలి— కాని ఈలక్షణము లేమియుఁ గనుపట్టుట లేదు.

మాన— వందలకొలఁది నిదర్శనము లున్నవి. అక్బరు మహమ్మదీయుఁడుగదా? ఆయన హిందూధర్మ పక్షపాతియని యెవ్వరెరుఁగరు? మహమ్మదీయుఁడు హిందువు కాఁగలిగియున్నచో అక్బరు ఇదివఱకే హిందువయి యుండువాఁడు. ఆయన హిందువు కాఁజాలకపోయెను. అందుచే నిపుడు ముల్లాలయొక్కయు పండితులయొక్కయు సహాయముచే ఒకనూతనమతమును స్థాపింపఁ గోరుచున్నాడు. ఆమతమున ఉభయజాతులును నిస్సంకోచముగఁ జేరవచ్చును. రాజ్యమందలి ఉన్నతపదవులు హిందూమహమ్మ

దీయులకు సమానముగ నొసంగఁబడుచున్నవి. భారత రాజేశ్వరి హింందూస్త్రీ.

గ్వాలి—కాఁబోవు భారతరాజేశ్వరియు హిందూస్త్రీయే—అనఁగా మహారాజ మానసింహుని సోదరియే. (మార్వాడు రాజువంక చూచి) నేను మీకు తొలుతనే చెప్పితిని మానసింహునివలన మన కేమియు నాశలేదు భారతవర్షమునకు స్వాతంత్ర్యమనునది స్వప్నవార్త

మాన—మీరు స్వాతంత్ర్యవిషయము చెప్పుచుంటిరా? జాతీయ జీవనము నశించి చాలకాలమైనది జాతియంతయు క్షీణించుచున్నది.

చందే—ఎట్లు?

మాన—దీనికిని దృష్టాంతము కావలయునా? ఈనిరంతరాలస్యము, ఈ ఔదాసీన్యము, ఈనిశ్చేష్టత ఇవి జీవనమునకు లక్షణములా? ద్రావిడదేశబ్రాహ్మణులు కాశీబ్రాహ్మణులతోఁ గలసి భోజనము చెయరు. సముద్రయాత్రచేసిన మానవుఁడు జాతిభ్రష్టుఁడగును, జాతికి ప్రాణస్వరూపమగు ధర్మము నామమాత్రావశిష్టముగ నున్నది, ఇది జాతీయజీవనమునకు లక్షణమా? అన్నదమ్ములలో నొకరిపై నొకరికి ఈర్ష్య, ద్వేషము, అహంకారము— ఇవి జాతీయ జీవనమునకు లక్షణమా?—ఆరోజులన్నియు పోయినవి మహారాజా!

బిక—హిందువులందఱు నొక్కటియగుచో ఇప్పుడును ఆరోజులు వచ్చును.

మాన—అది కాఁజాలదు. హిందువులహృదయ మెంతయు శుష్కించినది. వారు ఎంతయు జడులును విచ్ఛిన్నులు నయిరి. ఇంక వారిలో సంఘీభావ మసంభవము.

గ్వాలి—అయితే హిందువుల కైకమత్యము ఇంక కలుగనేకలుగదా?

మాన—కలుగును. ఏనాఁడు హిందువులు ఈజీర్ణశీర్ణశుష్కసంఘాచారముల విడిచి సజీవము నుజ్జ్వలమునగు నూతనధర్మమును

గూడదనియు ఇంతదనుక ప్రతాపుఁడు నాకు ప్రధానశత్రువుగ నుండెనుగాక. ఇంతటనుండి ఆయన నాకు పరమమిత్రుఁడు అని యువ్రాసిరి.

బిక — ఈయౌదార్యమునకుఁగూడ నేదియో విశేషార్థమున్నది. చంక దుష్ట శరణార్థి యనుసామెత స్మృతికి వచ్చుచున్నది.

మాన — బాదుషాగారు ఇపుడే నన్ను రమ్మని సెలవిచ్చిరి. గాన నాకు సెలవిండు (అందఱకు నమస్కరించి వెళ్లును.)

గ్యాలి ఇఁక మనము పోదము. (అందఱు నిలుబడుదురు.)

మార్వ్యా మీరు లక్ష చెప్పుడు, కాని బాదుషాగారి హృదయము మాత్రము ఉదారమును ఉన్నతమునయినది.

చందే అవును. ఆయన శత్రువును క్షమింపఁగలఁడు,

గ్యాలి క్షమాపణ గోరనుగలఁడు.

మార్వ్యా హిందూరాజులపై ఆయన కమిత్రశ్రద్ధ.

చందే మానసింహుఁడుచెప్పినమాట వాస్తవము. ఆయన విజయి యందును విజితునందును భేదభావ ముండదు!

మార్వ్యా అదియునుగాక ఆయన హిందూధర్మపక్షపాతి.

గ్యాలి.. వాస్తవమైనసంగతి యేమన ఇప్పుడు హిందువులకు స్వాతంత్రులగు ఆసక్తి లేదు.

మార్వ్యా ఓయి! ఈస్వాతంత్ర్యము ఉన్మత్తుని స్వప్నము.
(అందఱు నిష్క్రమించెదరు.)

సప్తమదృశ్యము.

స్థానము రాజమార్గము. సమయము రాత్రి

(చిత్రదీపికలు వెలుఁగుచుండును, అనతిదూరమున వాద్యములు మ్రోగుచుండును. జెండా లెగురుచు డుచు రాజభటులు వచ్చుచుపోవుచునుందురు ఒకప్రక్కకొందఱుదర్శకులు నిలఁబడి మాట్లాడుచుందురు.)

౧...(నెట్టి) అరే సరిగా నుంచో

౨. అరే నెట్టుతావేం?

౩. అరే పెళ్ళివారు వస్తున్నారు మాట్లాడమాకు

౪...అబ్బా! నుంచునినుంచుని కాళ్లు లాక్కుపోతున్నాయిరా! పెళ్లోరు దబ్బున వొస్తే బాగుండును.

౫...అరేయ్! యువరాజుకున్నూ మానసిమ్మ మహారాజు కూతురుకున్నూ కాదంట్రా పెళ్లి?

౧...కాదుకాదు. ఆయన చెల్లెలికి

౨. కాదనే, కూతురుకే

౩ ..చెల్లెలికేరా.

౨ .అయితే ఈపెళ్లి ఎల్లా చేశారు? ఇదికాకూడదు.

౧...కాగూడదేం?

౨.. సలీముతాత హుమాయూను భగవాందాసు కూత్తుర్ని పెళ్లిచేసికొన్నాడాయన, ఇప్పుడు సలీము కిచ్చేదేమిటో మళ్లీ ఆయన రొండోకూతుర్నేగా?

౧...అయితే యేం?

౨...అదిగాక సలీముతండ్రి భగవాందాసు చెల్లెల్ని పెండ్లిచేసికొన్నాడు

౪. వరసేమీ చెడిపోలేదులే తండ్రి భగవాందాసు చెల్లెల్ని పెళ్లిచేసుకొన్నాడు తాతామనుమ లిద్దరూ భగవాన్ దాసు కూతుళ్ళ నిద్దర్నీ పంచుకొన్నారు,

౫...మొత్తానికి సంబంధం అంతా సీరకాయ పీచల్లే భగవాందాసుకు చుట్టుకొని వుంది.

౧ ..నిజంగా భగవాందాసు చాలా అదృష్టవంతుడు

౨ కాని మానసింగు బలే వన్నుగడ పన్నాడు.

౫...ఏంపన్నాడు?

౨...ఉండి ఉండి ఇట్టే సలీముకు బావమరదైనాడు.

౩...సలీముకు బావమరదిఅవుట నిజంగా గొప్ప అదృష్టమే.

౫.. ఇందులో అదృష్టమేమున్నది?

౩...అసలు వవంచకంలో బావమరది అపటమె అదృష్టము అందులో బావమరదన్న బావమరదా? యువరాజుకు బావమరదవుటం ఆహా! నేను బావమరినైతే!

౫...పిచ్చివాడా! అందరూ అవుతారా? మొగాన రాసివుండాలి.
౩...ఇది పూర్వజన్మ కర్మఫలంరా ఇక్కడే పూర్వజన్మ వొప్పుకోవలసి వస్తుంది
౫...వొప్పుకోండే పనేసాగదు
౩—లేకపోతే యువరాజుకు బావమరదిఅవటం మాటలా?
౧—అయితే ఈపెళ్లితో కూడా సలీముకు మొత్తం ఎన్నిపెళ్లిళ్లు?
౨...నూటికి తక్కువుండవు,
౩...నిజమేరా! మనం ఎన్నేళ్లనుంచో సెలకోపెళ్లి సూస్తునే వున్నాము
౪...ఇంతమంది పెళ్లాలున్నవాళ్లు నిజంగా చాల అదుష్టమంతులే.
౧ దీనికీ అదుష్టానికీ సంబంధం ఏమిటి?
౪. ఇందులో అదుష్టంలేదా? కూకున్నప్పుడు, లెగుస్తున్నప్పుడు, వస్తున్నప్పుడు పోతున్నప్పుడు, పడుకున్నపుడు, మేలుకొన్నపుడు, తింటున్నపుడు ఆడుకుంటున్నపుడు ఎవళ్లో వాళ్లు కనుపిస్తునే వుంటారు గులాబితోటలో తిరుగుతున్నట్టు వుంటుంది.
౧.. అదుగోపెళ్లోళ్లు వొచ్చారు సరిగా నుంచో.
౨...అరే రామసింగ్! నీతలకాయ ఆకాశాన్ని అంటుతుంగేంరా?
౩...ఈ తలకాయ కూసేపు ఇంటికాడొగ్గేసి రాకపోయా?

(పెండ్లి ఊరేగింపు అతివైభవముతో పోవుచు.)

౧.. ఇదుగో ఈయనే బాదుషా,
౩—ఇదుగో ఈయన పెళ్ళికూతురు తండ్రి మానసిమ్మడు.
౨— కాదుకాదు. ఈయన పెళ్ళికూతురు అన్న. ఇందాకనుండి సిలకకు సెప్పినట్టు సెప్పాను అన్నిమరిసిపోయావు,
౪—పాదుషా సరీగ్గా పాదుషాలాగ్లేనే వున్నాడురా.
౫—మానసిమ్మడుకూడా సరీగ్గా మానసిమ్మడల్లేనే వున్నాడు.
౧...అదుగో బోగమాళ్ళు వస్తూన్నారు.
౨.. వహ్వా! బలేసక్కగా ఆడుతూన్నారురా
౪—అదుగో దార్లో ఆడుతున్నారు.
౫...సరీగ్గా నెమళ్లల్లే వున్నారు.

౧ పెళ్ళికొడుకు వెళ్ళిపోయాడు ఇంక వెడదాముపదండిరా

౨...మనమంతా సలీములు కాము!

౩—పెళ్ళికొడుకును నూస్తే అందరికి పెళ్ళికొడుకు కావాలనిపిస్తుంది

౨ గడ్డి అమ్ముకొనేవాడైనా చివరకి పెండ్లికొడుకౌతే మంచిడాబుగా నడుస్తాడు. ముందు బాజాలు మోగుతాయి వెంబడి వందలుతరిపిడి మనుష్యులుంటారు. ఇంతకంటే ఇంక మంచిరోజు ఏముంది!

(తెరలో తుపాకిమోత వినబడును. చాల గల్లంతు జరుగును. మరల తుపాకిమోత వినబడును)

౧.. బాబో ఏమిటి కీ గలభా?

(ముగ్గురు మనుష్యులు భయకంపితులై ప్రవేశింతురు)

౨ ఏమిటయ్యా అది?

౧మను— బాబో చాల మొప్పం.

౧...ఏమి? ఏమయింది?

౨మను . ఓపిచ్చోడు వచ్చి సలీము పల్లకీమోసేవాళ్లని ముగ్గుర్ని కత్తెట్టి నరికాడు.

౩ .ఏమి! తర్వాత?

౧మను ..చాలామంది వాణ్ణి పట్టుకోవటానికి వెంటపడ్డారు. ఆడుఎవళ్ళీ చంపలేదు. కత్తి అవతల పారేసి పిస్తోలెట్టి తన్నచంపుకొన్నాడు.

౨ , ఆ డెవడు?

౩మను ఒకపిచ్చోడు

౨మను —అరే ఆయన పిచ్చోడు కాడు. రాణాప్రతాపసిమ్మని తమ్ముడు

౨ నువ్వు ఆయన్ని ఎట్లా గురుతెట్టా?

౨మను.. ముందు సలీమును రొండు తన్నులుతన్ని తర్వాత ఆయనే చెప్పాడు "నేను శక్తసిమ్ముడను ఇదుగో సలీమ్! ఇది నీతన్నకు మారుతన్ను ఇంక ఇది దానికి వడ్డీ" అని మళ్ళీ రెండు తన్నులు తన్నాడు

౧...బలే సాహసంపని చేశాడు

౨—అయితే శత్రుసైన్యము సచ్చిపోయాడా?
౧వను అవును.
౩వను ఇప్పుడాయన్ని తిగలేస్తారో పాతేస్తారో సూద్దాము పదండి
(అందఱు నిష్క్రమించెదరు.)

---

అష్టమ దృశ్యము.

స్థానము. చిత్తూరు పరిసరారణ్యము. సమయము సాయంకాలము.

(ప్రతాపుడు మృత్యుశయ్యపై బరుండియుండును ఎదుట వైద్యుడు రాజపుత్రసర్దారులు, పృథ్వీరాజు, అమరసింహుడు, నిలబడియుందురు)

ప్రతా...పృథ్వీరాజా! తుదకు బాదుషాకు దయాపాత్రుడగుటకూడ సహింపవలసివచ్చెను.

పృథ్వీ—ఇది దయ గాదు, భక్తి.

ప్రతా—వ్యర్థప్రసంగము చేసెదవు? ఇది భక్తిగాదు, దయయే. నేను మరదృష్టవంతుడను దుర్బలుడను, పీడితుడను. శోకాపన్నుడను గనుకనే సమ్రాట్టు నాపై నిఘాదు ఆక్రమణ సేయుడు. ఆహా! మరణకాలమున ఇట్టి మాటలను వినవలసి వచ్చెనుగదా. గోవిందసింహా!

గోవిం—రాణాజీ!

ప్రతా—నన్నొకమారు ఈడేరాలోనుండి బయటకు తీసికొని పొమ్ము. మరణించుటకు ముందొకమారు చిత్తూరుదుర్గము చూచెదను.

గోవిం—(వైద్యునివంక చూచుచు.)

వైద్య—హానియేమి? బయటకు తీసికొనిపొండు.

(అందరు కలసి ప్రతాపుని మంచము బయటకు తెచ్చి దుర్గమున కెదురుగ నుంచెదరు)

గోవిం—(వైద్యుని విడిగా బిలిచి) ఇంక జీవితాశ యేమియులేదా?

వైద్య—ఏమియు లేదు. గోవిందసింహుడు తలవంచుకొనును.)

ప్రతా—(శయ్యపైనుండి సగము లేచి చిత్తోరుకోటవంక చూచుచు)

ఇదియే ఆచిత్తోరు, ఒకనాఁడు రాజపుత్రుల యధికారమున నున్న యజేయదుర్గ మిదియే నేఁడు దీనిపై మొగలపతాక యెగురుచున్నది. నేఁడు నాకు చిత్తోరు ముట్టడించు మ్లేచ్ఛులను ఓడించి వారిని గజనీనఁటకు తఱిమి గజనీ సింహాసనమున తన సోదర కుమారుని గూర్చుండబెట్టిన మహావీరుఁడు నా పూర్వ పురుషుఁడు స్వర్గీయ బాప్పారావలు స్మృతికి వచ్చుచున్నాఁడు. నేఁడు నాకు పఠానులకును సమరసింహునకును జరిగిన ఘోర యుద్ధము తలపునకు వచ్చుచున్నది, అ మహాసంగ్రామముననే నల్లని కాగర్నదీజలము మ్లేచ్ఛరాజపుత్రుల రక్తముచే నెఱ్ఱబడెను నేఁడు నాకు పద్మిని నిమిత్తము జరిగిన ఆ మహాయుద్ధము కనులకగపడుచున్నది. అందే చండాతురాణి షోడశవర్షప్రాయుండగు తన కొమరుని కోడలిని దీసికొని వెళ్లి యవనులతోఁ బోరి ప్రాణములు విడిచెను ఆఘటనలన్నియు నేఁడు నాకు ప్రత్యక్షముగఁ గనుపడుచున్నది. ఇదియే ఆ చిత్తోరు. దీనినే నే నుద్ధరింపఁ గోరితిని గాని నావలనఁ గాలేదు. నా పని నేను చేయవలయు ననుకొంటిని. అంతలోనే దినాంతమయ్యెను. పని యసంపూర్ణముగనే యున్నది.

పృథ్వీ—రాణాజీ! మీరు దీనికై చింతింపకుఁడు. ఎప్పుడును పనులన్నియు నొక వ్యక్తివలననే కావు. అవి అసంపూర్ణముగ ఉండును. కాని సమయము వచ్చినప్పుడు ఆవ్రతమును బాలించు ఉత్తరాధికారులు జన్మించి వానిని పూర్తిచేయుదురు ఒకదాని వెనుక నొకటిగ కెరటములు వచ్చును. మరల వెనుకకు మరలును. సముద్ర మిటులే ముందుకు నడచును పగటి వెంట రాత్రి, రాత్రివెంట పగలు ఇట్లే పృథ్వీజీవితము నడచుచుండును. అపారములగు స్పందననివృత్తులవలనని ప్రకాశము వ్యాపించుచుండును. జన్మమరణములవలననే మానవుల యుత్థానము, సృష్టిలయములవలననే బ్రహ్మాండవికాసము జరుగును. గాన మీరేమియు చింతింపకుఁడు.

ప్రతా — నేను నా వెనుక నొక వీరపుత్రుని ఉంచి పోవుచో నాకు విచారముండెడిది కాదు. కాని — అబ్బా! — (ఒత్తిగిలును)

గోవిం — ఏమి రాణాజీ! చాల బాధగా నున్నదా?

ప్రతా — అవును గోవిందసింహా! అయితే ఈకష్టము మానసికముగాని శారీరకము గాదు. నేను చచ్చిపోయిన పిమ్మట ఈపని చాల వెనుకపడిపోవునని చింతించుచున్నాను.

గోవిం — అదియేమి?

ప్రతా — అమరుఁడు బాదుషా సమ్మానలోభమునఁ బడి నేను ఉద్ధరించిన యీరాజ్యమును మొగలుల కప్పగించునని తలఁచుచున్నాను

గోవిం — రాణాజీ! ఈవిషయమై మీ రేమియు శంకింపకుఁడు.

ప్రతా — గోవిందసింహా! నేను అహేతుకముగ శంకించుట లేదు. అమరుఁడు విలాసి, వాఁ డీదారిద్ర్యకష్టములు సహింపలేఁడు. గనుక నే నామరణానంతరము ఈకుటీరస్థానమున ప్రాసాదము నిర్మింపఁబడుననియు ఈమేవాడుభూమి మొగలుల కమ్మివేయఁబడుననియు, మీరును విలాసమున కాశ్రయ మొసగెదరనియు శంకించుచున్నాను

గోవిం — నేను బాష్పసాక్షిగా చెప్పుచున్నాను అట్లెన్నఁడును గాదు.

ప్రతా — అగుచో నేను సుఖముగ మరణించెదను (అమరసింహుని వంక చూచి) అమర్! ఇటు రమ్ము. ఇదిగో నేను వెళ్లుచున్నాను నేఁడు నేను పోవుచోటికి ఒకనాఁడు అందఱును వెళ్ళవలసినదే. అబ్బాయీ! ఏడ్వకుము. నేను నిన్ను ఒంటరిగా విడిచిపోవుట లేదు. ఇర్వదైదు వత్సరములనుండి పర్వతములందును, అరణ్యములందును నాతోఁబాటు సకలకష్టములను అనుభవించిన వీరులను నీకు విడిచిపోవుచున్నాను. నీవు వారిని విడిచినను వారు నిన్నెన్నఁడును విడువరు వారందఱు ప్రతాపుని పుత్రునికై ప్రాణ మొసఁగుటకు సిద్ధముగ నుందురు. మేవాడు రాజ్యమంతయు నీకు అప్పగించి పోవుచున్నాను. చిత్తోరు దుర్గమును నీకు నొసఁగఁజాలననియే విచారము. చిత్తోరు నుద్ధరించుభారమును నీకె

[illegible]సి ఆశీర్వదించుచున్నాను. నిష్కళంకమగు నీఖడ్గమును నీకొసంగుచున్నాను (ఖడ్గమిచ్చును) నీఖడ్గము సజ్వలముగ నుండెదననియు దీనికి కళంకము తగులనీయవనియు నమ్ముచున్నాను కుమారా! ఇంక నేమి చెప్పుదును ఇదియే నాయాశీర్వాదము. పొమ్ము విజయివి, యశస్వివి సుఖివి గమ్ము. (అమరుడు నమస్కరింప ప్రతాపుడు ఆశీర్వదించును) నా కన్నులయెదుట అంధకారము గ్రమ్ముచున్నది కంఠస్వరము సన్నగిలుచున్నది. అమరసింహా! నీ వెక్కడ నున్నావు? కుమారా! రమ్ము. ఇంకను దగ్గఱకు రమ్ము ఇంక నేను వెళ్లుచున్నాను. ప్రియతమా! లక్ష్మీ! ఆగుము నేను వచ్చుచున్నాను.

వైద్య—(నాడిచూచి) రాణాగారి జీవనలీల సమాప్తమైనది. ఇంక అంత్య సంస్కారయత్నము చేయవలయును.

గోవిం—పురుషోత్తమా! మేవాడప్రభాకరా! ప్రియసఖా! నీచిరసహచరుని విడిచి యెచటికిఁ బోతివి? (రాణాపాదములపైఁబడును. రాజపుత్రులెల్లరును మోకరిలఁబడి రాణాపాదములకు నమస్కరించెదరు.)

పృథ్వీ—వీరవరా! నీవు నిజపుణ్యార్జితమైన స్వర్గధామమునకుఁ బొమ్ము నిష్కళంకమగు నీకీర్తి అనంతకాలము దనుక రాజపుత్రుల హృదయములందును మొగలుల హృదయములందు నేకాక సమస్తమానవజాతి హృదయమందును విరాజిల్లును ఇతిహాసమున నీకీర్తిగాథలు సవర్ణాక్షరములతో వ్రాయబడును ఆరావళీ పర్వతమందలి ప్రతిశిఖరమును, ప్రతి లోయయు నీపుణ్యకథలచే ప్రతిధ్వనించును. రాజపుత్రస్థానమందలి ప్రతిక్షేత్రమును, ప్రతి వనమును, ప్రతి పర్వతమును నీయొక్క యస్మృతిచే సర్వదా పవిత్రమయియుండును

యవనికా పతనము

ఓం తత్సత్.

# ఆంధ్రగ్రంథ రత్నాకరము

## గుడివాడ

ఆంధ్రసారస్వతమున కత్యావశ్యకములును అపూర్వములును గు గ్రంథరత్నములఁ బ్రకటించి యథాశక్తి ఆంధ్రవాఙ్మయము నందలి కొఱంత దీర్చుటయే ఈ గ్రంథమాల యొక్క ప్రథానోద్దేశ్యము. ఇందు సంవత్సరమునకు మూడునాలుగు గ్రంథరత్నములు వెలుఁవడును. ఇవిగాక కొన్ని అనుబంధ గ్రంథములుగూడ వెలువడును. ఎనిమిది అణాలు ప్రవేశరుసుము ఇచ్చి చందాదారులుగ చేరువారికి మేము ప్రకటించు గ్రంథములన్నియు రూపాయికి నాల్గుఅణాలు చొ॥ తగ్గించి ఈయబడును. అనుబంధములు కొనవలసిన నిర్బంధము లేదు. కోరినచో అవికూడ తగ్గింపుధరలకే ఈయఁబడును చందాదారులు రత్నములను మాత్రము తప్పకకొనవలయును మా గ్రంథమాలకు ఒకేమాఱుగ రు 116, 50, 25 రూపాయలు విరాళము లిచ్చువారి నామములు క్రమముగ రాజపోషకులు, ప్రథానపోషకులు, పోష కులు అను శీర్షికలక్రింద ప్రతిరత్నమందును ప్రకటింపఁబడును. మా రత్నములన్నియు వారికి ఉచితముగ నొసఁగఁబడును వర్తకులకు మంచికమీషను ఈయఁబడును

---

ఇందు వెలువడిన గ్రంథములు

౧వ రత్నము.

## దుర్గాదాసు

ఇదినూతనముగ ఆంధ్రప్రపంచమున నవతరించిన యొక అత్యు త్తమనాటకము ఆధునికనాటక లేఖకులలో నగ్రగణ్యుఁడగు శ్రీ ద్వి జేంద్రలాల్ రాయల బంగాళీనాటకమున కిది తేటతెలుఁగున కనువాద ము. ద్విజేంద్రుఁడు నాటకకళావ్యాపనమునకై యవతరించిన మహాపు రుషుఁడుగాని సామాన్యుఁడుగాఁడు. అతని నాటకములలో పవిత్రత, ఔదార్యము, దేశభక్తి, స్వార్థత్యాగము, విశుద్ధహాస్యము నిండియుం డును. అందు ఉన్మాదక శృంగార మేమాత్రము నుండదు. ప్లాటులో

నింక ద్విజేంద్రునిది. పెట్టినదిపేరు. ఇది ప్రఖ్యాతిజెందిన కలకత్తాథియేటరులలో ప్రదర్శింపఁబడినపుడు ప్రేక్షకులెల్లరు జయధ్వానములచే నాట్యశాలను ప్రతిధ్వనింపజేసిరి. ఇట్టిసర్వాంగశోభితమగు నాటకము "నభూతో న భవిష్యతి." హిందూమహమ్మదీయుల యైకమత్యము నుద్బోధించు నిట్టిగ్రంథము నిదివర కెవ్వరును వ్రాయలేదు సినిమాలో ప్రదర్శింపఁబడి పెక్కుఆంధ్రుల హృదయముల కొల్లగొనినది ఈనాటకరాజమే ఈగాంధీయుగమందు ద్విజేంద్రుని గ్రంథముల ప్రచార మత్యావశ్యకము వెల రు 1-4-0. చందాదారులకు రు 1-0-0

---

౨వ రత్నము

## కాళిదాసభవభూతులు

ఇదియు ద్విజేంద్రునిదే. సంస్కృతనాటక వాఙ్మయమున అగ్రస్థానము వహించిన ఇద్దఱు మహాకవుల యొక్క సర్వోత్తమ నాటకముల విమర్శనము. ఇది పేరునకు 'కాళిదాస భవభూతులు' గాని ఇందు ప్రాసంగికముగ ఇంగ్లీషు, జర్మను, ఫ్రెంచి, గ్రీకుభాషలలో ధురంధరులగు కవుల నాటకములు గూడ చక్కగ విమర్శింపఁబడినవి. నాటకకళ, కవిత్వకళ, పాత్రపోషణము, ప్లాటుమున్నగు నెన్నియో గంభీర విషయములు కడుహృద్యముగ చర్చింపఁబడినవి నాటకతత్త్వ మెఱుంగఁగోరువారి కింతకంటె నుత్తమగ్రంథము వేఱొకటిలేదు

వెల రు 1—0—0. చందాదారులకు రు 0—12—0.

---

3వ రత్నము.

## సాత్రాజితీ పరిణయము

బిల్వనాథీయము, ఆంధ్రమత్స్యపురాణము మున్నగు ననేక గ్రంథములు రచించిన శ్రీ అడవి సాంబశివరాయ కవిశిఖామణిచే రచింపఁబడిన ఐదాశ్వాసముల చక్కని ప్రబంధము.

వెల 12 అణాలు. చందాదార్లకు 9 అణాలు.

౪వ రత్నము

# చంద్రగుప్త

మౌర్యసామ్రాజ్యస్థాపకుఁడగు చంద్రగుప్తుని చరిత్ర యింత మనోజ్ఞముగ నిదివఱ కెవ్వరును రచించలేదు. విశ్వప్రేమ, దేశభక్తి పితృభక్తి మున్నగు మహోన్నతభావము లిందు కడు హృదయంగమముగ చూపింపబడినవి. ఇందు ఛాయా, హెలీనాల అపూర్వచరిత్రము చదివిన రోమాంచితమగును చాణక్య, చంద్రగుప్త, మురా చంద్రకేతుల చరిత్రములు చక్కఁగ చిత్రింపఁబడినవి. ఇందు అమృత గుళికలఁబోలు చక్కనిపద్యములును గీతికలును గలవు. ప్రదర్శన యోగ్యము. వెల 1—0—0. చందాదారులకు 12 అణాలు

---

౫వ రత్నము.

# రాణా ప్రతాపసింహ

మొగలుల యుచ్ఛిష్టమున కాసింపక మాతృదేశమునకై కఠోర దారిద్ర్యవ్రతము నవలంబించి మరణాంతముదనుక తనప్రతిజ్ఞను పాలించిన రాణా ప్రతాపసింహుని యుజ్జ్వలచరిత్రము ఈనాటకమున మనోహరముగ చిత్రింపఁబడినది రాజపుత్రుల ప్రబోధమునకై తనజీవితము నర్పించిన జోశీబాయి యొక్కయు శక్తసింహుఁడు, పృథ్వీరాజు, దౌలతున్నిసా, మేహరున్నిసా మున్నగు పాత్రలయొక్కయు చరిత్రములు ఇందు చదివి తీరవలయును. ఇందలి వచనమును పద్యములును వీరరసమును వర్షింపును (అచ్చుననున్నది)

వెల 1—4—0 చందాదారులకు రు 1—0—0.

---

౬వ రత్నము.

# భీష్మ

ఇది ద్విజేంద్రలాల్ రాయల యత్యుత్తమమగు పౌరాణిక నాటకము. ఇందు భీష్ముని బ్రహ్మచర్యము, పితృభక్తి, స్వార్థత్యాగము

మున్నగు గుణములు కడుమనోహరముగ చూపింపఁబడినవి. భీష్ముని చరిత్రమునింత యుజ్జ్వలముగనింతవఱకు నేనాట్యకారుఁడును చిత్రింప లేదు. కాశీరాజు పుత్రియగు అంబచరిత్రము అద్భుతముగ నుండును దాశరాజుప్రసంగము కడుపు చెక్కలుచేయును ఆంధ్రదేశమున పెక్కు నాట్యసమాజములవారు దీనిని ప్రదర్శించుటకు ప్రయత్నించుచున్నారు పద్యములు రసవంతములు

వెల రు 1—4—0. చందాదారులకు 1—0—0.

---

# అనుబంధములు

౧వ అనుబంధము

## అర్ధానుస్వార శకటరేఫచంద్రిక

ఎచ్చట అఱసున్నలుంచవలయునో ఎచ్చట శకటరేఫము వ్రాయవలయునో దీనివలన సుగమముగ తెలిసికొనవచ్చును. స్కూలు విద్యార్థులకును తెలుఁగున వ్యాసములు వ్రాయువారికిని మిక్కిలి ఉపయోగకరము వెల 6 అణాలు చందాదారులకు 4 అణాలు

---

౨వ అనుబంధము

## సాసూను వైద్యశాలలోని గాంధిమహాత్ముడు

మహాత్మునిపై భారతదేశీయులకేగాక విదేశీయులకుఁగూడ నెట్టి ప్రేమభావమున్నదియు వారి సాన్నిధ్యముచే సాసూను వైద్యశాల యెట్లు ప్రేమవాతావరణముగ మారినదియు ఇందు చక్కగ వ్రాయఁబడెను.

గ్రంథకర్త శ్రీమహాదేవదేశాయిగారు

వెల 1½ అణాలు చందాదారులకు 1 అణా

---

3 అనుబంధము

## మయూరధ్వజ చరిత్రము

ఇదియొక చక్కనిహరికథ ఇందలిపద్యములును గేయములును చాలహృద్యములుగ నుండును.

వెల రు 0-8-0 చందాదారులకు వెల రు 0-6-0

౨ వ అనుబంధము

# మేవాడుపతనము

ఇది యొక యపూర్వనాటకము. ఇందు కళ్యాణి, సత్యవతి, మానసియను పాత్రలచే క్రమముగ పతిభక్తి, దేశభక్తి, విశ్వప్రేమయను మహోన్నత భావములు కడుహృద్యముగ నిరూపింపఁబడినవి. ఇదియును దుర్గాదాసునవలె ప్రస్తుతకాలమునకు అనుగుణముగ నుండును. నాటకశైలియు, గీతములును సరళముగను మనోహరముగ నుండును

వెల రు 1—4—0 చందాదార్లకు రు 1—0—0

౩ వ అనుబంధము

# శుద్ధాంధ్రనిర్వచన శతకంఠరామాయణము

భాష అచ్చతెనుఁగైనను సులభమగు వాడుకశైలిలో నుండి చదువుకొనుటకు హృదయరంజకముగ నుండును. 5 అణాలచీట్లు పంపు గ్రంథాలయముల కిది ఉచితముగ పంపఁబడును.

వెల రు 1—4—0 చందాదార్లకు రు 1—0—0

---

మావద్ద విక్రయమునకుదొరకు ఇతరగ్రంథములు

# హిందీ - తెలుఁగునిఘంటువు

లేఖకులు:—పండిత జంధ్యాల శివన్న శాస్త్రిగారు

స్వయముగా హిందీనేర్చుకొనువారికి ఇదియున్న ఇంక నే నిఘంటువును అక్కరలేదు దీనిమూలమున హిందీ గ్రంథములన్నియు సులభముగ అర్థముచేసికొనవచ్చును. ఇందు ౨౧ వేలకుపైగా హిందీ ఉర్దూ ఫార్సీ శబ్దములకు అకారాదిక్రమముగ తెలుగుఅర్థము వ్రాయఁబడినది మఱియు ప్రతిశబ్దమునకును పుంలింగ స్త్రీలింగ విశేష్య విశేషణ అవ్యయాది భేదములు వ్రాయఁబడియున్నవి. గ్లేజు కాగితములు, క్యాలికోబైండు వెల 2 రూపాయలు.

ౘ

# ఆంధ్ర హిందీనిఘంటువు

అకారాదిక్రమముగ తెలుగుమాట లన్నిటికిని హిందీ ఉర్దూ ప్రతిపదములు వ్రాయఁబడినవి హిందీలో వ్యాసరచనయు, గ్రంథ రచనయు, అనువాదమునుచేయు ఆంధ్రులకు దీనిఉపయోగము చెప్ప నలవికాదు. చక్కనిబైండు వెల 1 రూపాయి

---

# హిందీ తెలుఁగువ్యాకరణము

హిందీప్రచారమునందు చిరకాలానుభవముగల పండిత శివన్న శాస్త్రిగారు దీనిని కడుసులభశైలిని వ్రాసిరి. హిందీనభ్యసించుఆంధ్రులకు సహజముగఁదోఁచు సందేహములు దీనిచే వారింపఁబడును. ఇది సర్వహిందీవ్యాకరణముల యొక్కసారము బహుకాల పరిశ్రమము యొక్క ఫలము అని చెప్పవచ్చును. దీని సహాయమున ఎట్టివారును సులభముగ హిందీ నభ్యసింపవచ్చును. వెల 14 అణాలు

| | |
|---|---|
| శ్రీమదాంధ్రరామాయణాద్భుతోత్తర కాండము | 1—4—0 |
| జగన్నాథీయము (అపూర్వ ప్రబంధము) | 0—8—0 |
| శ్రీశైల హనుమచ్ఛతకము | 0—1—0 |
| బాలశతకము (స్త్రీనీతులు) | 0—1—0 |
| కన్యావిక్రయము | 0—2—0 |
| వరవిక్రయము | 0—3—0 |
| యోగసారము | 0—4—0 |
| పరమేశనుతి కదంబము | 0—4—0 |
| హరిస్తుతి కదంబము | 0—2—0 |

చిరునామా:—

ఆంధ్రగ్రంథ రత్నాకరము,

గుడివాడ

కృష్ణాజిల్లా.

శ్రీ

# బాలభారతీగ్రంథనిలయము

చాగలమర్రి

కర్నూల్ (జిల్లా)—దత్తమండలము

స్థాపితము 1923

## ఇందు వెలువడిన గ్రంథములు.

(ప్రథమ రత్నము)

## సువర్ణకేసరీకృష్ణసేన (నవల)

కథాచమత్కృతి అద్భుతము. ఇందు సందర్భానుసారముగా పెక్కు సాంఘిక విషయములు చర్చింపబడినవి వెయ్యేల చదు॥ మొద లిడిన అంత్యమగువఱకును విడువరు

| | | |
|---|---|---|
| వెల చందాదారులకు | రు 0-12-0 | పోస్టేజి వేరు. |
| ఇతరులకు | 1- 0-0 | |

ద్వితీయ రత్నము

## కలియుగదర్పణము (నాటకము)

వృద్ధ వివాహములు, అతిబాల్యవివాహములు, కలియుగానర్థములనియు—యవ్వనకంటకములనియు—ప్రదర్శించుటకు "కలియుగ దర్పణమే" దర్పణము.

| | | |
|---|---|---|
| వెల చందాదారులకు | రు 0-12-0 | పోస్టేజి వేరు. |
| ఇతరులకు | 1- 0-0 | |

శ్రీ

తృతీయ రత్నము

మనోరమా విజయము (చరిత్రాత్మక నాటకము)

గ్రంథకర్త: గండ్లూరి నరసింహారావుగారు

రిటయిర్డు రివిన్యూయినస్పెక్టరు, జంబులమడుగు

వెల చందాదారులకు రు 0-12-0

ఇతరులకు 1- 0-0

# ప్రియదర్శిని

చిత్రపట శోభితమును చరిత్రాత్మకమును నగు నవలా రాజము

గ్రంథకర్త: పాలపర్తి సూర్యనారాయణరావుగారు.

వెల చందాదారులకు రు 0-12-0 ఇతరులకు రు 1-0-0

---

# గండికోట

ఒకపురాతన పట్టణముయొక్క చరిత్రము. చక్కగ చిత్రింపఁ బడినది చందాదారుల కుచితము. ఇతరులకు ౨ అణాలు మాత్రమే.